THE LARGEST CIRCULATED TELUGU WEEKLY

స్వాతి

సపరివార పత్రిక

FOUNDER PROPRIETOR EDITOR : VEMURI BALARAM





పాఠక దేవుళ్ళకు నమస్కారం

ఎడిటర్

వేమూరి బలరామ్

ESTABLISHED 1984 | సంపుటి 34 | 1.6.2018 | సంచిక 48

అనిల్ బిల్డింగ్స్ సూర్యారావుపేట పోస్ట్ బాక్స్ 339 విజయవాడ 520 002

Wake up every day and trust this world all over again

## సీరియల్స్



## కథలు





ముఖచిత్రం
ప్రియాంక జైన్

## శీర్షికలు



## స్పెషల్ ఫీచర్స్



## దివ్యమార్గం

కాలం చాలా విలువైనది. చెడు కార్యాలు చేయడంలో కాలం వ్యర్థం చేయరాదు. ఎప్పటి కప్పుడే మంచి కార్యాలు చేయాలి. ఎప్పుడో, ఏనాడో చేస్తామనుకోవటంలో అర్థంలేదు. కాలానికి ఎవ్వరూ మిత్రులు కారు. సర్వులూ కాలమును అనుసరించవలసినదే.

కానీ కాలం ఎవ్వరినీ అనుసరించదు. కనుక కాలమును వ్యర్థము చేయక కాలాన్ని నిరర్థకం చేసుకొనక, కర్మలను సార్థకం చేసుకోవాలి. ఈ కాయం కర్మాచరణ నిమిత్తమై ఏర్పడినదనే సత్యాన్ని ప్రతి వ్యక్తీ గుర్తించాలి.

ఏ కర్మలు చేసినప్పటికీ, పరమాత్మ సేవగా మనం భావించాలి. ఏవో కర్మలు చేస్తున్నామని సంతృప్తితోఉండిపోవటం కేవలం అజ్ఞానమే.

కర్మలు పశు,పక్షి, మృగాదులు కూడా చేస్తున్నాయి. అయితే కేవలం కర్మలు చేయటమే ప్రధానం కాదు. అహంకారరహితమైన కర్మలు చేయటం మానవుని కర్తవ్యం. ఇదియే సేవల యందున్న ప్రధానమైన దివ్యమార్గం.

సేవ అనగా 'కేవలం నేను యజమానుడను కాను' అనే సత్యాన్ని గుర్తించటమే.

ప్రతి మానవుని యందు ఉండేది దివ్యత్వమైన దైవస్వరూపమే. ఈ సేవారూపమైన కర్మలు అహంకార నిర్మూలనం చేసి దివ్యత్వమైన దైవత్వమును చేకూర్చగలవు.

ఇటువంటి సేవలుచేసి మానవుడు తన జీవితాన్ని సార్థకం చేసుకోవాలి. సేవ మానవత్వం యొక్క 'దివ్యత్వాన్ని' ప్రకటింపజేస్తుంది. హృదయమును విశాలంచేస్తుంది.

సంకుచితమైన భావాలను దూరంచేస్తుంది. ఆనందాన్ని అందిస్తుంది. ఐక్యతను చేకూరుస్తుంది. ఆత్మతత్త్వమును బోధిస్తుంది.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

చందాను www.swatipublications.com వెబ్‌సైట్ ద్వారా చెల్లించవచ్చు
E-mail: advtswati@gmail.com swativja@eth.net

విడిప్రతి ₹20 12 నెలలకు ₹1076
విదేశాలకు సంవత్సరచందా (ఎయిర్ మెయిల్) ₹6666 (100 డాలర్లు)

Editor: VEMURI BALARAM Swati Publications Anil Buildings Suryaraopet Vijayawada 520 002 Printed and Published by the owner VEMURI BALARAM
Printed at Anil Swati Press Autonagar Vijayawada Cover at Kala Jyothi Process Pvt.Ltd., Hyderabad
Tel.: (0866) 243 1862 243 4017 Advt. 243 1233 Mktg. 243 3938 Fax: 0866-243 0433

# అనూస్ సిస్టర్స్‌కు కూడ తప్పలేదు ఆ ఇబ్బంది..!




ముప్ఫై ఏళ్ళు వచ్చేసరికి నాకు కూడ కొద్ది కొద్దిగా తెల్ల జుట్టు రావడం మొదలయ్యింది. తెల్ల వెంట్రుకలను హెన్నాతో కవర్ చేయడం మొదలు పెట్టాను. దాదాపు 20 సం॥లు మేనేజ్ చేయగలిగాను. ఒకరోజు మా తోటికోడలు నాతో అంది ఏంటక్కా! మీ హెయిర్ బ్రౌన్‌గా కనబడుతోంది బాగుండలేదు, డై వేసుకోండి అని. అయ్యో ఇంత బ్యూటీ ఫీల్డ్‌లో ఉండి, తోటికోడలితో చెప్పించుకోవాల్సి వచ్చిందని మధనపడ్డాను. కారణం నాకు హెయిర్ డై వేసుకోవడం అస్సలు ఇష్టం లేదు. ఎందుకంటే క్లయింట్స్‌తో రోజువారీ అనుబంధం, అనుభవం. వారికి కెమికల్ హెయిర్ డైతో వచ్చే కష్టాలు, నష్టాలు, ఎలర్జీలు, ఇన్ని రోజులు ఈ హెన్నాతో మేనేజ్ చేస్తూ ఎలా మనం కూడ ఆ కెమికల్ బారిన పడక తప్పదేమో, మాతో పాటు మా క్లయింట్స్‌కు కూడ ఈ ఇబ్బంది తప్పించాలన్న మా అందరి ఆలోచనకు ప్రతి రూపమే అనూస్ బ్లాక్ ఎక్స్‌పర్ట్. ప్రతి వ్యక్తి కోరుకునేది జుట్టు రాలకూడదు, చిట్లకూడదు, పొడిబారకూడదు, ఒత్తుగా కనబడాలి, ఆరోగ్యంగా ఉండాలి అని. పైన చెప్పినవన్నీ చేయడంతో పాటు జుట్టు నల్లగా ఉండాలి. తెల్లబడిన వెంట్రుకలను చూసుకొన్నప్పుడల్లా అద్దం వెక్కిరిస్తోంది. అనారోగ్యం, వయస్సు మీద పడినట్లు అనిపిస్తోందని క్లయింట్స్ తరచుగా చెబుతుంటారు, వాటన్నిటికీ జవాబే బ్లాక్ ఎక్స్‌పర్ట్. ఎందుకంటే మన తరతరాల ఆయుర్వేద, ప్రకృతి సహజ వరమే ఈ బ్లాక్ ఎక్స్‌పర్ట్. ఇది గోరింటాకు + ఇండిబ్లాక్ ఆకుల యొక్క సమ్మేళనం. జుట్టుకు నలుపు రంగుతో పాటు, గోరింటాకు (హెన్నా) కండిషనింగ్‌గా, ఇండీ బ్లాక్ ఎక్స్‌ఫోలియేషన్ చర్యనిచ్చి జుట్టును ఆరోగ్యంగా మారుస్తుంది.



మన జుట్టుకు ప్రకృతి నుంచి ఇచ్చే అంతేకాక జుట్టుకు వారం వారం మంచి హెయిర్ ప్యాక్‌లాగ పనిచేసి పొల్యూషన్ నుంచి, ఒత్తిడి నుంచి జుట్టును కాపాడుతుంది. మనం ఆరోగ్యకరమైన భోజనం అన్నమాట. ఇది జుట్టుకు చక్కటి సహజమైన నలుపు రంగును ఇస్తుంది.

అనూస్ అన్ని ప్రోడక్ట్స్‌లోకి నా ఫేవరెట్ ప్రోడక్ట్ బ్లాక్ ఎక్స్‌పర్ట్. ఎందుకంటే అది వాడకుండా నన్ను నేను అస్సలు ఊహించుకోలేను. అందంగా, ఆరోగ్యంగా, శుభ్రంగా కనిపించాలనే ప్రతి మనిషికి ఉంటుంది. అమ్మమ్మ అయిన నన్ను నా జుట్టును హెన్నా + ఇండి బ్లాక్ కాంబినేషన్ కాపాడుతోంది. ప్రకృతి అందించిన ఈ వరం క్లయింట్స్ వద్దకు చేరాలనే తపనతో....

- మీ అనూస్ సిస్టర్ అన్నపూర్ణ

**మా సేవలకై మీ ప్రశ్నలను ఈ నంబరుపై 99596 16106 సంప్రదించండి – అనూస్ సిస్టర్స్**

- అనూస్ హెర్బల్ ప్రోడక్ట్ మీ దగ్గరలోని సూపర్ మార్కెట్స్‌లోగాని, షాపులోగాని పొందాలంటే, పదే పదే అడిగి ఒత్తిడి పెంచండి.
- అనూస్ వీడియోస్‌కై మీ వాట్సప్ నంబరును ఈ **91000 34054** కు షేర్ చేయండి.
- అనూస్ బ్లాక్ ఎక్స్‌పర్ట్ అప్లికేషన్‌కై ఈ క్రింది లింక్‌ను క్లిక్ చేయండి : https://www.youtube.com/watch?v=JIuUHIbfGxk&t=29s

**ANOO'S**
SALON & CLINIC Since 1982
TELANGANA | ANDHRAPRADESH
KARNATAKA | TAMILNADU | USA

**Watch Anoo's Programme**
Every Friday in TV'9 at 12.30 PM
Every Saturday in STAR MAA at 7.30 AM
Every Saturday in HMTV at 1.30 PM.

*Services &*
*Beauty School:* 99596 16106
*Product Enquiries:* 9100034054

« అత్యధిక సర్క్యులేషన్‌గల ఏకైక తెలుగు వారపత్రిక »



సాక్షి

## 18.5.2018

'ప్రతివారం 'సత్యాన్వేషణ' శీర్షిక చాలా బాగుంది. భగవంతుడు ఇచ్చిన దానిలో హాయిగా,సంతోషంగా,తృప్తిగా జీవించడమే నిజమైన వైరాగ్యం అన్న విషయం తెలుసుకున్నాం.

'ఫర్ U' శీర్షికలోని అన్ని అంశాలూ ఆరోగ్య ప్రియత్వాన్ని కలిగించేవే.

'పొదుపు లక్ష్మి', 'చంద్రోదయం' కథలు చాలా బాగున్నాయి.

'మనిషిలో మనిషి', 'హృదయం ఎక్కడున్నదీ...', 'సామ్రాట్ సముద్ర గుప్త', 'వేట' సీరియల్స్ అన్నీ ఇంట్రెస్టింగ్‌గా సాగుతున్నాయి.

ఎస్.ఎస్.చంద్రబోస్ విశాఖపట్నం

పిల్లల విషయంలో పెద్దవాళ్ళు అతి గారాబంచేస్తే అది వాళ్ళ మనసుల మీద చెరగని ముద్ర వేసి వారికి తెలియకుండానే పెద్దవారి దృష్టిని ఆకర్షించటం ఎలాగాఅని వారు ఆలోచిస్తుంటారు అని 'గారాబం వద్దు' ఫీచర్ ద్వారా మంచి విషయాన్ని చర్చించారు.

'శ్రీరామదూతం శిరసా నమామి'లో డా॥ మైలవరపు శ్రీనివాసరావుగారి విశ్లేషణద్వారా మాకు ఉండే సందేహాలు నివృత్తి అయ్యాయి.

ఫేస్ బుక్,వాట్సప్‌లకి ఎంత దూరం ఉంటే అంత మంచి జరుగుతుంది అని 'గుడ్‌నైట్ శుభరాత్రి' వ్యాసంలో తెలిపిన విషయాలు బాగున్నాయి.

'థాంక్యూ బేజో రెక్సియా', 'పొదుపు లక్ష్మి', 'చంద్రోదయం' కథలు చాలా బాగున్నాయి. 'వేట', 'మనిషిలో మనిషి' సీరియల్స్ బాగుంటున్నాయి.

వి.రామకృష్ణ హైదరాబాద్

ఏ సందర్భానికైనా తగినట్టు వుండే డ్రెస్ వేసుకోవాలి అన్న ఫీచర్ మాకెంతో ఉపయుక్తంగా ఉంది.

సీరియల్స్ అన్నీ సూపర్. కథలన్నీ ఎక్సలెంట్. ఫీచర్స్, శీర్షికలూ అన్నీ అలరించాయి. పూర్ణారావు కాకినాడ

ఆంజనేయస్వామి పాదాల మధ్య శని ఉంటుంది అని భ్రమించేవారికి అది కట్టుకథ. బయటపడకుండా హనుమ పాదాలను చూడవచ్చు అని 'శ్రీరామదూతం శిరసా నమామి' వ్యాసంలో తెలుసుకున్నాం.

'చంద్రోదయం', 'పొదుపు లక్ష్మి' కథలు చాలా బాగున్నాయి.

'మనిషిలో మనిషి', 'హృదయం ఎక్కడున్నదీ...', 'సామ్రాట్ సముద్ర గుప్త', 'వేట' సీరియల్స్ వారం వారం ఆసక్తికరంగా చదివిస్తున్నాయి.

జి.వి.మురళీమోహన్ కోటరామచంద్రపురం

హనుమజ్జయంతిని పురస్కరించుకుని అందించిన ఫీచర్ చదివి మంచి విషయాలతోపాటు, తల, మొండెంలేని కట్టుకథలగురించి తెలుసుకుని వాటిని నమ్మకూడదని, ప్రచారం చేయకూడదని డిసైడైపోయాం.

'సత్యాన్వేషణ' చదివి సీతమ్మ గొప్ప గుణం, దాసుడు, భృత్యునికి మధ్యగల భేదం తెలుసుకున్నాం.'చిలిపి' ప్రశ్నలు మెదడుకు మేత అని భావిస్తున్నాం.

పి.నరసయ్య హైదరాబాద్





# ఇది మంచి సమయం

**24.5.2018 నుండి 29.5.2018 వరకు శ్రీ విలంబి నామ సంవత్సరం, ఉత్తరాయణం, గ్రీష్మఋతువు, అధిక జ్యేష్ఠం, శుక్లపక్షం. 30.5.2018 నుండి కృష్ణపక్షం**



### 24.5.2018 గురువారం
తిథి: దశమి సా.6.18 వరకు
నక్షత్రం: ఉత్తరఫల్గుని సా.7.45 వరకు.
వర్జ్యం: తె. 4.14 లగా...
దుర్ముహూర్తం : ప. 9.52-10.43 వరకు. మ. 2.57-3.48 వరకు
రాహుకాలం: మ. 1.35-3.10 వరకు
మంచి సమయం : ఉ. 5.00-6.20 వరకు. ప.11.25-1.00 వరకు
సూర్యోదయం: 5.31కి
సూర్యాస్తమయం: 6.28కి

### 25.5.2018 శుక్రవారం
తిథి: ఏకాదశి సా. 5.48 వరకు
నక్షత్రం: హస్త సా.7.59 వరకు
వర్జ్యం: ...ఉ. 5.51 వరకు, తె.వ. 4.11 లగాయతు
దుర్ముహూర్తం: ప.8.10 నుండి 9.01 వరకు. మ. 12.24-1.15 వరకు
రాహుకాలం: ప.10.25-12.00 వరకు
మంచి సమయం: మ.2.00 నుండి 3.30 వరకు
సూర్యోదయం: 5.31కి
సూర్యాస్తమయం: 6.29కి

### 26.5.2018 శనివారం
తిథి: ద్వాదశి సా.5.41 వరకు
నక్షత్రం: చిత్త రా.8.36 వరకు
వర్జ్యం: ఉ.5.49 వరకు, రా.2.26-4.06 వరకు
దుర్ముహూర్తం: ఉ.5.37-7.19 వరకు
రాహుకాలం: ప. 8.49-10.25 వరకు
మంచిసమయం: సా. 4.00 నుండి 5.35 వరకు
సూర్యోదయం: 5.31కి
సూర్యాస్తమయం: 6.29కి

### 27.5.2018 ఆదివారం
తిథి: త్రయోదశి సా.5.58 వరకు
నక్షత్రం: స్వాతి రా.9.37 వరకు
వర్జ్యం: రా.3.33-5.15 వరకు
దుర్ముహూర్తం: సా.4.40-5.31 వరకు
రాహుకాలం: సా. 4.45-6.20 వరకు
మంచిసమయం : ప.11.10 నుండి 1.00 వరకు
సూర్యోదయం: 5.30కి
సూర్యాస్తమయం: 6.29కి

### 28.5.2018 సోమవారం
తిథి: చతుర్దశి సా.6.41 వరకు
నక్షత్రం: విశాఖ రా.11.03 వరకు
వర్జ్యం: రా.3.22-5.06 వరకు
దుర్ముహూర్తం : మ. 12.24 నుండి 1.15 వరకు.మ. 2.57-3.48 వరకు
రాహుకాలం: ఉ. 7.14-8.49 వరకు
మంచి సమయం:ఉ.5.30-7.00వరకు
సూర్యోదయం: 5.30కి
సూర్యాస్తమయం: 6.29కి

### 29.5.2018 మంగళవారం
తిథి: పూర్ణిమ సా.7.50 వరకు
నక్షత్రం: అనూరాధ రా.12.55 వరకు
వర్జ్యం : లేదు
దుర్ముహూర్తం: ప. 8.11 నుండి 9.02 వరకు. రా.10.52-11.43 వరకు
రాహుకాలం: ప. 3.10-4.44 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 5.30కి
సూర్యాస్తమయం: 6.30కి

### 30.5.2018 బుధవారం
తిథి: బహుళ పాడ్యమి రా.9.25 వరకు
నక్షత్రం: జ్యేష్ఠ రా.3.12 వరకు
వర్జ్యం : ఉ.7.03-8.48 వరకు
దుర్ముహూర్తం : ప. 11.35 నుండి 12.26 వరకు
రాహుకాలం: మ. 12.00-1.35 వరకు
మంచి సమయం : లేదు
సూర్యోదయం: 5.30కి
సూర్యాస్తమయం: 6.30కి

* ఏదైనా పరవాలేదు.

అంతర్జాతీయ అభివృద్ధి, రాజకీయాలన్నీ నిన్న మొన్నటివరకు అట్లాంటిక్ మహా సముద్రాన్ని ఆవరించివున్న అమెరికా, ఐరోపా ఖండ దేశాల ఆధారంగా నడిచాయి. ఎల్లకాలం ప్రపంచ పరిస్థితులు ఒక ప్రాంతానికే అనుకూలంగా వుండవు. అభివృద్ధి చెందిన దేశాలు ప్రపంచ ఆర్థికవ్యవస్థను తమకు అనుకూలంగా మలచుకునే యత్నాలు వికటించక తప్పదు.

ఇది గత కొన్ని దశాబ్దాలుగా ఆర్థిక, సామాజిక రంగ నిపుణులు చెపుతున్న అంశం. క్రమంగా అంతర్జాతీయ వ్యవహారాలు మొత్తం అట్లాంటిక్ సముద్రాన్ని వదిలి హిమాలయ పర్వతాల చుట్టూ తిరుగుతాయన్నది ముందుచూపున్నవారు చెప్పిన విషయం. అది నిజమనటానికి ఆట్టేకాలం ఆగాల్సిన పని లేదు.

శాతం మంది కూడా ఉద్యోగాలకు పనికిరావటంలేదన్న నివేదిక వచ్చింది. ఈ విషయంమీద వివిధ రాష్ట్రాలు అనేకరకాలుగా ప్రయత్నాలు చేస్తున్నాయి.

అయితే ఆ రాష్ట్రాలలో ఇరవై ఒక్క మంత్రిత్వ శాఖలు నిర్వహించే నైపుణ్యాభివృద్ధి అంశాలమీద సరైన పర్యవేక్షణ కొరవడింది.

ఏ రాష్ట్రంలో ఏం జరుగుతున్నదో తెలియని పరిస్థితి నుండి ఒక నవీనదిశవైపు మలుపు తిప్పేయత్నం 2014 సంవత్సరం తర్వాత మొదలైంది.

కేంద్రంలో నైపుణ్యాభివృద్ధిశాఖను ఒకటి ఏర్పాటు చేయుటంతోపాటు, వివిధ రాష్ట్రాలలో కూడా నైపుణ్యాభివృద్ధి కార్పొరేషన్‌లను ప్రోత్సహించారు.

# నైపుణ్య భారత నిర్మాణం

రాబోయేరోజుల్లో అగ్రరాజ్యాలు చైనా, భారత్‌లే నన్నది సర్వత్రా వినిపిస్తున్న మాట.

అగ్రదేశాలు చేపట్టిన ప్రపంచీకరణ ఎత్తుగడను తమకు అనుకూలంగా మలచుకోవటంలో చైనా, భారత్‌లు సఫలీకృతులయ్యాయి.

అమెరికా అనుసరించిన విధానాలు చైనాలో పారిశ్రామికీకరణను ప్రోత్సహించాయి. చైనాలో వున్న మానవవనరులు కారుచౌకగా లభించే కూలీలుగా ఆ ప్రభుత్వం ప్రయోగించింది. ఫలితంగా చైనా అత్యున్నత ఉత్పత్తిదేశంగా రూపుదిద్దుకుంది.

అమెరికా ఆర్థికవ్యవస్థేకాదు ప్రపంచ ఆర్థికవ్యవస్థ మొత్తం చైనామీద ఆధారపడాల్సివచ్చింది.

చైనాతో ఆర్థికపరంగా పోటీపడడంలో భారత్ వెనకపడినా మానవవనరులను మరోవిధంగా ఉపయోగించటంలో భారత్ ముందంజలో వుంది. సేవా రంగంలో భారత్‌దే అగ్రస్థానం.

ఐ.టి.విప్లవాన్ని అద్భుతంగా వినియోగించుకున్న దేశం భారత్. నేడు అన్ని దేశాలలో ఐ.టి. సేవలు అందించటమేకాక ప్రముఖ ప్రపంచ ఐ.టి. సంస్థలలో సి.ఇ.ఓ.లుగా నిలిచింది భారత సంతతివారే.

ఫలితంగా 2050 నాటికి భారత్, చైనాలు ప్రపంచంలో అత్యధిక జి.డి.పి.లు కలిగిన దేశాలుగా నిలుస్తాయి.

ఆ స్థాయికి ఆ రెండు దేశాలు చేరటానికి ఆ యా దేశాలకు ఉన్న జనాభా, సంపదతోపాటు అనేక ఇతర అంశాలు భారత్, చైనాలకు కలిసివస్తాయి అన్నది అంచనా. అంతర్జాతీయ తాజా నివేదికలన్నీ చైనాకన్నా భారతదేశాన్ని ముందు ఉంచుతున్నాయి.

భారతదేశంలోని యువజనాభానేకాక ఆ దేశం అనుసరిస్తున్న నైపుణ్యాల నిర్మాణాల విధానాలూ భారత్‌కి కలిసివస్తాయన్నది ఆ నివేదిక సారాంశం.

నరేంద్రమోడీ ప్రధానిగా అధికారం చేపట్టిన తొలినాళ్ళలో తీసుకున్న పలు ముఖ్యమైన నిర్ణయాలలో నైపుణ్య భారత నిర్మాణం ఒకటి.

భారతదేశంలో విద్యార్హత, ఉద్యోగనైపుణ్యత ఉద్యోగ సంసిద్ధతల మధ్య ఊహాకందనంత ఎడం ఏర్పడింది. అయితే ఇది కొత్తగా వచ్చినది కాదు. గత నలభై సంవత్సరాలుగా కనిపిస్తున్నదే.

విద్యార్థులు ఏ విద్యనయితే అభ్యసించారని సర్టిఫికెట్లు ఇచ్చి పంపుతున్నారో, ఆ విద్యార్థుల్లో ఆ అర్హతకు తగినవిధంగా వుండవలసినటువంటి నైపుణ్యాలు కనిపించటంలేదని ఉద్యోగాలు ఇద్దామనుకునే సంస్థలు వాపోతున్నాయి.

పూర్తి నైపుణ్యాలతో ఉద్యోగంలో చేరే యువతీ యువకుల సంఖ్య పరిమితంగా వుంటున్నది. అటువంటివారిని బహుళజాతి సంస్థలు,ఇతర పెద్దసంస్థలు భారీ జీతాలకు తీసుకువెళ్ళిపోతున్నారు. లేదా ఆ విద్యార్థులు విదేశాలకు వలసవెళుతున్నారు.

ఫలితంగా భారతదేశంలో నైపుణ్యత అంతగా ముందుకు వెళ్ళటంలేదు. ఒకదశలో ఇంజనీరింగ్ గ్రాడ్యుయేట్స్‌లో ముప్పై



ఇక ముందు ఎన్నికల్లో పోటీ చేయను... పార్టీ నేతలకు మార్గదర్శనం చేస్తా.
-సిద్ధరామయ్య, కర్ణాటక సి.ఎమ్.

ఆంధ్రప్రదేశ్ ఈ అంశంలో మిగిలిన రాష్ట్రాలకన్నా ముందున్నది. కేంద్రం నుండి వచ్చే సూచనలు, శిక్షణా అంశాలనేకాక రాష్ట్రస్థాయిలో స్వతంత్ర ఆలోచనలతో ముందడుగు వేయగలిగిన నాయకత్వం ఆంధ్రప్రదేశ్ సంపాదించింది.

ఇతర రాష్ట్రాల నైపుణ్యాభివృద్ధి సంస్థలు ఆంధ్రప్రదేశ్ చేపట్టిన యత్నాలను నమూనాగా తీసుకున్నాయి. గడచిన నాలుగేళ్ళలో భిన్న రాష్ట్రాలు, జాతీయస్థాయిలో స్కిల్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్‌ల మధ్య సమన్వయం ఏర్పడింది.

2014 సంవత్సరం తర్వాత భారతదేశం చేపట్టిన నైపుణ్యాభివృద్ధి విషయం నేడు అంతర్జాతీయంగా గుర్తింపు పొందింది.

సరైన సమయంలో సరైన పథకాలను అమలుచేశారన్న పొగడ్త అందుకుంది భారతదేశం. దేశ జనాభాలో 54 శాతం పాతిక సంవత్సరాలలో వున్నారు. దేశ జనాభాలో 62 శాతం మంది తమ సమర్థతను ప్రదర్శించగలిగిన వయసులో వున్నారు.

కాని కేవలం ఐదుశాతం మందికి మాత్రమే నైపుణ్యాల శిక్షణ లభిస్తుండేది. ఆ పరిస్థితిని చక్కదిద్దివుండకపోతే ఉద్యోగాలకోసం ఎదురుచూసే యువతీ యువకులు నిరాశానిస్పృహలకు గురైవుండేవారు.

నిరాశకు గురైన యువత దారితప్పి ప్రవర్తిస్తే దేశ పరిస్థితి ప్రమాదకరంగా తయారయ్యేది.

1960ల్లో మనదేశంలో నక్సలైట్ల ఉద్యమానికి యువత ఆకర్షింపబడటానికి ముఖ్యకారణం నాటి నిరుద్యోగం. సరైన ఉపాధి లభించని, చదివిన చదువుకు తగిన ఉద్యోగం లభించకపోతే యువత పెడదోవ పడుతుందనేదానికి 1980ల్లో

వచ్చిన ఖలిస్తాన్ ఉద్యమం కూడా ఉదాహరణ.

ఈ ప్రమాదం నుండి యువతను చదువు,ఉపాధి, నైపుణ్యాలవైపు మళ్ళించిన ఘనత మాత్రం వివిధ రాష్ట్రాలలోని నైపుణ్యాభివృద్ధి కార్పొరేషన్లు వాటి బాధ్యతలను సవాలుగా తీసుకున్న అధికార, అనధికార బృందం సభ్యులది.

భారతదేశపు స్కిల్ డెవలప్‌మెంట్ ప్రయత్నాలు ఆ దేశానికేకాక ప్రపంచం మొత్తానికీ ఉపయోగపడనున్నాయని తాజాగా విడుదలైన కోర్న్ ఫెర్రీ కన్సల్టింగ్ నివేదిక పేర్కొన్నది.

1969 సంవత్సరంలో ప్రారంభమైన ఈ సంస్థ ప్రధాన కార్యాలయం లాస్ ఏంజిల్స్ నగరంలో వుంది. గ్లోబల్ లీడర్‌షిప్, వ్యక్తులు, సంస్థలకు సలహాను అందించే ప్రముఖ సంస్థ ఇది.

ఆ సంస్థ ఇరవై వర్ధమాన, అభివృద్ధి చెందిన దేశాలలోని మానవవనరులు, నైపుణ్యాలు, వాటి ప్రస్తుత పరిస్థితి, భవిష్య అవసరాలమీద అధ్యయనం చేసింది. వారి అధ్యయనం ప్రకారం నైపుణ్యాల అభివృద్ధిలో భారతదేశం అద్భుతమైన ప్రగతిని గత నాలుగు సంవత్సరాలలో సాధించిందని తేలింది.

ప్రపంచంలో మారుతున్న సాంకేతికత, ప్రజల ఆశలు, ఆశయాలు, అవసరాలు, ఆ యా దేశాలలోని యువత సమర్థత, విద్య, అవకాశాలు వంటివాటినన్నింటినీ అధ్యయనం చేసి ప్రపంచవ్యాప్తంగా నైపుణ్యాల కొరత తీవ్రమవుతుందని అంచనావేశారు.

ఈ పరిస్థితిలో నైపుణ్యాల వృద్ధిమీద దృష్టిపెట్టిన భారతదేశం సమీప భవిష్యత్తులో యావత్ ప్రపంచానికీ నైపుణ్యాల దిక్సూచిగా నిలుస్తుందని పేర్కొన్నారు. 2030 నాటికి పనిచేసే సమర్థతతో కూడిన మానవ వనరులు భారతదేశంలో మాత్రమే పుష్కలంగా వుంటాయి. దేశ అవసరాలను మించిన నైపుణ్యాభివృద్ధి మనదేశంలో తయారవుతున్నది.

దీనికి భిన్నంగా ఇతర వర్ధమాన, అభివృద్ధి చెందిన దేశాలలో మానవవనరులు క్రమంగా అడుగంటుతున్నాయి.కారణాలు ఏమైనప్పటికీ నైపుణ్యాలు కలిగిన సిబ్బంది ఆ యా దేశాలలో తగినంతగా లభించరు. ఆ యా దేశాలు మానవవనరుల మీద పెట్టుబడి పెట్టకపోవటం ఒక కారణమైతే,ఆ యా దేశాలలో తగ్గుతున్న జనాభా కూడా ఒక కారణం.

పాశ్చాత్య దేశాలలో విచ్ఛిన్నమైన కుటుంబవ్యవస్థ, వివాహబంధపు ప్రభావం దేశంలోని యువతసంఖ్యను తగ్గిస్తున్నది. శాశ్వత ప్రాతిపదికన సంసారాలు నడపని మనస్తత్వం ఐరోపా,అమెరికా ఖండాలలోకి ప్రవేశించి మూడు నాలుగు దశాబ్దాలు దాటింది.

ఎప్పుడు తెగిపోతుందో తెలియని సంసార బంధంలో పిల్లలను కనటం, పెంచటం ఆర్థికపరమైన ఇబ్బందులతో కూడుకున్నది. విడాకుల తర్వాతపిల్లల పెంపకం కూడా సమస్య అవుతోంది వారికి.

అలాగే మరో వివాహానికిఅడ్డంకిగా పిల్లలు నిలుస్తున్నారు.ఈ సమస్యకు పరిష్కారంగా ఆ యా దేశాలలో పిల్లలు లేని కుటుంబాలు పెరుగుతున్నాయి. కొత్త తరానికి జన్మనివ్వటానికి ఇష్టంలేని దంపతులు తమ తమ జాతి ప్రయోజనాలను దెబ్బతీస్తున్నామని భావించటంలేదు.

కోర్న్ ఫెర్రీ సంస్థ అమెరికా, రష్యా, బ్రిటన్, జపాన్, జర్మనీ, ఆస్ట్రేలియా వంటి అభివృద్ధి చెందిన దేశాలతోపాటుగా వర్ధమానదేశాలైన దక్షిణాఫ్రికా, చైనా, భారత్, సింగపూర్, థాయ్‌లాండ్, మలేషియా వంటి 20 దేశాలలో అధ్యయనం చేసింది.

జపాన్, జర్మనీలలో సరాసరి వయసు నలభై ఏడుని దాటింది. అంటే వృద్ధదేశంగా తయారవుతున్నాయి. ఐరోపా యూనియన్ దేశాలలోనూ ఆ వయసు సరాసరిన నలభైకి చేరింది.

అమెరికాలో ఆ వయసు 38గా వుంది. అయితే అమెరికాలోకి ఆసియా ఖండ దేశాలవారు అధికంగా

- హిమాలయదేశాలదే ఆధిపత్యం
- భవిష్యత్తులో భారత్ నైపుణ్య దిక్సూచి
- నిపుణుల గనిగా భారత్
- భారత్‌కి అనుకూలంగా అంతర్జాతీయ నివేదిక

వలసవచ్చి స్థిరపడినందున, వారి కుటుంబవ్యవస్థ స్థిరంగా వున్నందున సరాసరి వయసు తక్కువగా వుందేమో! లేకుంటే ఆ దేశ జనాభా సరాసరి వయసు 40లకు చేరివుండేది. 2030 నాటికి భారతదేశంలో సగటు వయసు 27గా వుంటుంది.

ఇటువంటి సామాజిక వాతావరణంలో 2030 నాటికి అభివృద్ధి చెందిన, వర్ధమానదేశాలలో ఎనిమిది కోట్లకు పైచిలుకు నిపుణులైన కార్మికుల కొరత ఏర్పడుతుందన్నది ఒక అంచనా.

ఆ కొరతవల్ల ఆ యా దేశాలలో 567 లక్షల కోట్ల రూపాయలమేర నష్టంవాటిల్లుతుందని లెక్కకట్టారు. అది జర్మనీ, జపాన్‌దేశాల సంయుక్త స్థూల ఉత్పత్తికి సమానం. దీనినిబట్టి ఆ యా దేశాల ఆర్థికవ్యవస్థ ఎంత తీవ్రంగా నష్టపోనున్నది అర్థంచేసుకోగలం.

నైపుణ్య భారత నిర్మాణానికి నిర్మించిన పునాది భారతదేశానికి భరోసా ఇవ్వనున్నది. 2030 నాటికి ప్రపంచవ్యాప్తంగా పదికోట్లపై చిలుకు నైపుణ్య కార్మికుల కొరత ఏర్పడుతుంటే భారతదేశంలో దాదాపు ఇరవై ఐదు కోట్లమంది నైపుణ్య కార్మికులు అదనంగా అందుబాటులో వుంటారు.

రాబోయే కాలంలో దేశాల అవసరాలు, కొత్తగా పుట్టుకువచ్చే వైజ్ఞానికరంగాలు ప్రపంచ ముఖచిత్రాన్ని సమూలంగా మార్చివేయనున్నాయి. అన్ని రంగాలలో యాంత్రిక వినియోగం వస్తుంది.

రోబోటిక్స్ విస్తృతమవుతుంది. కృత్రిమమేధ రంగం పెరుగుతుంది. జెనెటిక్ ఇంజనీరింగ్ రంగం కీలకమవుతుంది. భారీ పరిశ్రమల స్థానంలో అంతా సూక్ష్మ ఉత్పత్తి సూక్ష్మ వినియోగత పెరుగుతుంది. వ్యవసాయరంగంలోనూ విప్లవం తప్పదు. ఆటోమేషన్ వల్ల ఉద్యోగాలు తగ్గుతాయన్న భయం అనవసరం. కొత్త రంగాలలో ఉద్యోగాలు వస్తాయి.

మానవ,యాంత్రికబంధం మరింతగా పెరుగుతుంది.భారతదేశం అటువంటి ఒడుదుడుకులను తట్టుకుని ఆర్థిక, వ్యాపార రంగాలలోకి విస్తరించే అవకాశాలు మెండుగా వున్నాయి.

నేటికే ఇంటర్నెట్ వినియోగంలో, కంప్యూటర్స్ నిర్వహణలో అనేక నైపుణ్యాలు పొందివున్న భారతీయ యువత ఆ యా రంగాలలో పూర్తిగా ఆధిపత్యం సంపాదించగలుగుతారు.

నేటివరకు ప్రపంచానికి అవసరమైన ఐ.టి.నిపుణులను అందించిన భారత్ ఆర్థికసేవల రంగంలో, సాంకేతికత, మీడియా, టెలికమ్యూనికేషన్ రంగాలలో, తయారీరంగంలో కూడా నిపుణులను అందిస్తుంది. ఒకవైపు జనాభాపరంగా చైనాను దాటిపోనున్న భారత్, నైపుణ్యపరమయిన రంగంలో కూడా చైనాను అధిగమిస్తుంది.

నేటివరకు నైపుణ్యాలను ఆకర్షించిన అమెరికావంటిదేశాలు ఇకముందు నైపుణ్యాలను కల్గిన మానవవనరులను వెతుక్కుంటూ భారత్‌వైపుకు రాక తప్పదన్నది అంచనా.

భారతదేశంలోకి పలు ప్రముఖ అంతర్జాతీయ సంస్థలు తమ ప్రధాన కార్యాలయాలను తరలించక తప్పదు. నేటివరకు తయారీరంగంలో వెనకబడివున్న భారతదేశానికి అది కూడా ఆశాజనకరంగమేనన్నది కోర్న్ ఫెర్రీ నివేదిక. తయారీరంగంలో కూడా భారతదేశం నిపుణుల తయారీలో ముందుంటుందని ఆ నివేదిక తెలియజేసింది.

అంతర్జాతీయంగా భారత్‌మీద పెరుగుతున్న విశ్వాసానికి అనుగుణంగా మన విద్యావ్యవస్థను బలోపేతం చెయ్యాలి. నాణ్యతతోకూడిన విద్యాలయాలు తయారవ్వాలి. ఆషామాషీ డిగ్రీలతో యువతను బయటకు పంపే పద్ధతి మారాలి.

విద్యను వ్యాపారంగాకాక మానవవనరుగా పెంపొందింపచేసేదిగా విద్యాలయాల నిర్వాహకులు చూడాలి. అటువంటి నిరుద్యోగులను భరించాల్సిన అవసరం ప్రభుత్వాలమీద పడుతోంది.

ఉపాధి రూపకల్పనలో తమ వైఫల్యాలను కప్పిపుచ్చుకునేందుకు నిరుద్యోగభృతిని ప్రభుత్వాలు ప్రకటిస్తున్నాయి. ఓట్లను ఆకట్టుకునేందుకు ఇచ్చే ఆ భృతి మొత్తాన్ని ప్రభుత్వాలు నైపుణ్యాల పెంపుదల మీద, నాణ్యమైన విద్యాలయాల నిర్మాణంమీదపెడితే యువతకు మరింత లాభం చేకూరుతుంది.

డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు



డాక్టర్ జె.భాగ్యలక్ష్మి
E-mail: jbhagyalakshmi43@yahoo.in

# ఒక చిన్నమాట

"మచ్ అడో అబౌట్ నథింగ్" అనే షేక్స్‌పియర్ నాటకం కామెడీగా ప్రసిద్ధి పొందింది. ఇందులో కథాంశం రెండు ప్రేమ జంటలకు సంబంధించింది. ఒక జంటను కలపటానికి కొందరు నాటకమాడితే మరో జంటను విడదీయటానికి మరికొందరు నాటకమాడతారు.

అపార్థాలు,విషాద సంఘటనల తర్వాత మబ్బులు వీడుతాయి. రెండు జంటలు హాయిగా పెళ్ళిచేసుకుంటారు. ఈ కథను కథగా వదిలేస్తే మనకు మిగిలింది ఈ నాటకం పేరు. ఏమీలేనిదానికి చాలా హడావుడి, చాలా హంగామా అని అనుకోవచ్చు. ఇది ఒక సామెతగా, నానుడిగా ఎప్పటినుండో స్థిరపడింది.

కొండను తవ్వి ఎలకను పట్టటమనే సామెత మనకుంది. ఇందులో కనీసం ఎలుకనయినా పడతారు. 'మచ్ అడో అబౌట్ నథింగ్'లో ఏమీ ఉండదు. ఉత్త గ్యాస్ అంటుంటామే అదే ఉంటుంది.

ఈ మధ్య అలీఘడ్ ముస్లిమ్ యూనివర్సిటీలో జిన్నా చిత్రపటం గురించి చెలరేగిన దుమారం, చర్చలు, ఆందోళనలు, వెలిబుచ్చిన అభిప్రాయాలు జస్ట్ హాట్ ఏర్‌గా మిగిలిపోయాయి.

దేశంలోని సమస్యలు ఎన్నో. ప్రజలు, ప్రభుత్వం పూనుకుని, చర్చించి పరిష్కారాలు వెతకవలసిన విషయాలు అలా ఉండగా ఇక్కడ ఈ ప్రతిమ, అక్కడ ఆ ఫోటో, మరొకచోట ఏదో కార్టూను అంటూ రాత్రింబవళ్ళు చర్చించటం, విరోధించటం, అది జననమరణ సమస్య అయినట్టు విశ్లేషించటం అర్థంలేనిహంగామా కాకపోతే మరేమిటి?

భారతదేశం రెండుగా మతప్రాతిపదికపై చీలటానికి కారణమైన మహమ్మద్ అలీ జిన్నా ఇంత హఠాత్తుగా వార్తలలోకి ఎక్కడమెందుకు, ఆయన మంచి చెడులను పునర్వీక్షించటమెందుకు.

భారతదేశానికి ఆయనను హీరోగా గౌరవించవలసిన అవసరమేమొచ్చింది అని ఎవరైనా అడగవలసిన ప్రశ్నే. ఈ టీకప్పులో తుఫానుకు కారణం అలీగడ్ ముస్లిమ్ యూనివర్సిటీలో స్టూడెంట్‌యూనియన్ హాలులో ఉన్న జిన్నా ఫోటో లోకల్ బి.జె.పి. ఎమ్.పి. సతీష్ గౌతమ్ దృష్టికి రావటం.

"విద్యార్థుల కౌన్సిల్‌హాలులో జిన్నాఫోటో ఏమిటి?" అని ఆయన అభ్యంతరం తెలిపారు.

మానవ వనరుల అభివృద్ధి మంత్రిత్వశాఖ యూనివర్సిటీనుండి ఈ విషయమై ఒక నివేదికను కోరింది. ఎ.ఎమ్.యు. వైస్ ఛాన్సలర్ ప్రొఫెసర్ తారిఖ్ మన్సూర్ పరిస్థితిని తెలియజేశారు.

"ఇది ఈనాటి విషయం కాదు. ఈ చిత్రపటం 1938 నుండి విద్యార్థుల హాలులో ఉంది"

యూనివర్సిటీ ప్రవక్త షఫీ కిద్వాయ్ జిన్నా పటం అక్కడ ఉండటానికి కారణాలు తెలిపారు.



జిన్నా యూనివర్సిటీకి స్థాపక సభ్యుడని,స్టూడెంట్స్ యూనియన్‌లో ఆయనకు జీవితకాల సభ్యత్వం ఉందని, ఆ చిత్రం దేశవిభజనకు ముందు అనగా 1938 నాటిదని చెప్పారు.

యూనివర్సిటీలో విద్యార్థుల సంఘం స్వతంత్రమైనదని,దాని వ్యవహారాలలో యూనివర్సిటీ సాధ్యమైనంతవరకు కలగజేసుకోదనీ చెప్పారు.

మహాత్మాగాంధీ,మౌలానా ఆజాద్, జవహర్‌లాల్ నెహ్రూ, సి.వి.రామన్, సర్వేపల్లి రాధాకృష్ణన్, వి.వి.గిరి, ఎ.పి.జె.అబ్దుల్ కలామ్ వంటి వారి చిత్రాలు యూనివర్సిటీ స్టూడెంట్‌యూనియన్‌లో శాశ్వతసభ్యులుగా విద్యార్థులసంఘానికి చెందిన హాలులో ఉన్నాయి.

ప్రముఖులకు ఎ.ఎమ్.యు. శాశ్వత సభ్యత్వం 1920 నుండి ఇస్తోందని మహాత్మాగాంధీ మొదటి శాశ్వతసభ్యుడని తెలియపరచారు.గొప్ప వారసత్వాన్ని ఈ ఫోటోలు ప్రతిఫలిస్తున్నందున అవి అక్కడ ఉండటం సముచితమని, ఇదివరకు ఎవరూ ఇటువంటి ప్రశ్న లేవనెత్తలేదని, అభ్యంతరం చెప్పలేదని కూడా ప్రవక్త తెలియజెప్పారు.

స్టూడెంట్ యూనియన్ ప్రెసిడెంట్ మక్సూర్ అహమ్మద్ ఉస్మానీ ఈ తగాదా కేవలం దృష్టి మళ్ళించటానికే వచ్చిందని ప్రభుత్వం చట్టంచేస్తే తప్ప (1947లో భారతదేశం వదిలినవారెవరి పేరునా ఏ స్మారకమూ ఉండకూడదని) ఆ చిత్రపటాన్ని తొలగించేదిలేదని చెప్పారు.

ఇంతలో విద్యార్థులఆందోళన పెద్దఎత్తున సాగింది. "ఆజాదీ, ఆజాదీ" అంటూ నినాదాలు చేశారు.ఇక్కడ మరొక జె.ఎన్.యు. (ఢిల్లీ) తరహా ఆందోళన ప్రారంభమా అని అందరూ విస్తుపోయారు.

హిందూ యువవాహిని యూనివర్సిటీలోకివెళ్ళి జిన్నా చిత్రపటాన్ని తొలగించమని ఒత్తిడి తెస్తే విద్యార్థులకు, వారికి మధ్య జరిగిన ఘర్షణవల్ల పోలీసులతో సహా కొందరు గాయపడ్డారు.

దీంతో యూనివర్సిటీప్రాంగణంలోకి ప్రావిన్షియల్ ఆర్మ్‌డ్ కాన్‌స్టేబులరీ (పి.ఎ.సి), రాపిడ్ యాక్షన్ ఫోర్స్ (ఆర్.ఎ.ఎఫ్.) ప్రాంతీయపోలీసులు రావలసి వచ్చింది.ఈ గొడవలన్నిటివెనుక ఏదో కుట్ర ఉందని వదంతులు వచ్చాయి.

విద్యార్థుల ఆందోళనకు, చిత్ర పటానికి సంబంధలేదని, అసలు చిత్రపటం సమస్యే కాదని వైస్ ఛాన్సలర్ చెపుతారు. కొన్ని మాధ్యమాలు,ముఖ్యంగా కొన్ని టీ.వీ.చానెళ్ళు అబద్ధాలు ప్రచారం చేస్తున్నాయి,

అర్ధ సత్యాలు చాటుతున్నాయని, యూనివర్సిటీ గురించి వ్యతిరేకభావం సృష్టిస్తున్నాయని కూడా వైస్ ఛాన్సలర్ అంటారు.

మహమ్మద్ అలీ జిన్నా భారతదేశ స్వాతంత్ర్యపోరాటంలో ఉన్నారు.బ్రిటీషువారి జీవనశైలి కల్గిన ఈయన పార్శీయువతిని వివాహం చేసుకున్నారు.

మతంపట్ల కూడా స్వయంగా భక్తిశ్రద్ధలు లేవని అంటారు. ఎల్.కె.అద్వాని పాకిస్తాన్ సందర్శించిన ఒక సందర్భంలో జిన్నా సెక్యులర్ వ్యక్తి అని ప్రశంసించినందుకు ఎన్నో విమర్శలు ఎదుర్కోవలసివచ్చింది.

జిన్నా ఎంతో ముచ్చటగా కట్టించుకున్న గృహాన్ని బొంబాయిలో వదిలి వెళ్తూ పాకిస్తాన్‌కు ఇండియన్ హైకమిషనర్‌తో "జవహర్‌ను నా గుండెబద్దలు చేయవద్దని చెప్పండి" అని అన్నారట.

తన ఇల్లు బ్రిటీష్‌వ్యక్తికో, మంచి పార్శీ కుటుంబానికో ఇవ్వాలనేది తన కోరిక.

చివరకు జిన్నా కుమార్తె ఆ ఇంటిమీద తన హక్కును నిరూపించుకున్నారు. "పాకిస్తాన్‌కోసం మేమెంతో పోరాడాము"అని ఎవరూ అనటానికి వీలు లేనట్లు "ముగ్గురే పాకిస్తాన్‌కు బాధ్యులు- నేను, నా టైపిస్టు, నా టైప్‌రైటరు" అని అన్నారట.

జిన్నా కీడు చేసినా అది చరిత్ర. ఆయన పటం ముంబై హైకోర్టులోనూ ఉంది. షేక్స్‌పియర్ "పేరులో ఏముంది?" అన్నట్టు చిత్రపటంలో ఏముంది? దానిని చూస్తేనే ఆయన భక్తులయిపోతారా? ఆ పటం ఉంటే ఉండనీ. తీసేస్తే తీసెయ్యనీ. ఇట్ మేక్స్ నో డిఫరెన్స్. అనవసరమైన ప్రాముఖ్యం వద్దు.

# అల్సర్‌కి క్యాన్సర్‌కి తేడా తెలుసుకోండి!

నీరు తక్కువ తాగటం వల్లనో, లేక పెరుగుతున్న మానసిక ఒత్తిడి వల్లనో ప్రతి ఒక్కరు జీవిత కాలంలో ఏదో ఒక దశలో అల్సర్స్‌కు గురవటం సహజమే. అందుకనే విద్యార్థులలో పరీక్షలప్పుడు ఎక్కువగా నోటిపూతను గమనిస్తూ ఉంటాము. సాధారణంగా మూడు, నాలుగు రోజులలో తగ్గిపోయే అల్సర్స్ అంతకంటే ఎక్కువగా ఉండి తరుచుగా బాధిస్తూ ఉంటే ఎవ్వరికైనా అనేక అనుమానాలు వేధిస్తూ ఉంటాయి. నోటి పూతతో పాటు, పెప్టిక్ అల్సర్స్, గ్యాస్ట్రిక్ అల్సర్స్, ఈసోఫీగల్ (అన్నవాహిక) అల్సర్స్, కదలలేని పరిస్థితులలో మంచానికే పరిమితమైనప్పుడు ఏర్పడే పుండ్లు, సిఫిలస్, హెర్పిస్ వంటి STD లవలన, ఈస్ట్, ఫంగల్ ఇన్‌ఫెక్షన్స్ వలన జెనిటల్ మర్మవయమాలలో అల్సర్స్, డయాబెటిక్స్‌లో కాళ్లలో వచ్చే న్యూరోపతిక్ అల్సర్స్ ఎక్కువగా కన్పిస్తూ ఉంటాయి.

జీర్ణవ్యవస్థకు సంబధించిన అల్సర్స్ పెప్టిక్ అల్సర్స్ ఎక్కువగా చూస్తూఉంటాము చిన్న ప్రేగు మొదట్లో ఉండే ఈ అల్సర్స్ ఎక్కువ చూస్తూ ఉంటాము చిన్న ప్రేగు మొదట్లో ఉండే ఈ అల్సర్స్ ను డుయోడినల్ అల్సర్స్ అనికూడా అంటారు జీర్ణవ్యవస్థలో ఎక్కువగా కన్పించే ఈ పూత 1% వరకు క్యాన్సర్ గా మారే ప్రమాదం ఉంటుంది. జీర్ణాశయంలో వచ్చే అల్సర్స్‌ను గ్యాస్ట్రిక్ అల్సర్స్ అంటారు. పెప్టిక్ అల్సర్స్ కంటే ఇవి తక్కువగా కన్పించినా గ్యాస్ట్రిక్ (Gastriccllars) అల్సర్స్ క్యాన్సర్‌గా మారే ప్రమాదం ఎక్కువ. అన్నవాహికలో అల్సర్స్ చాలా అరుదుగా కన్పిస్తాయి. నోటిపూత కు స్ట్రెస్, విటిమిన్స్‌లోపం, బి విటమిన్ లోపం ప్రధాన కారణాలైతే. జీర్ణావ్యవస్థకు సంబంధించిన మిగతా అల్సర్స్‌కు హెలికోబాక్టరీ పైలోరి (H. Pyiori) అనే బ్యాక్టిరియల్ ఇన్‌ఫెక్షన్ ప్రధాన కారణం.

1980 వరకు అల్సర్స్‌కు మసాలా ఆహారం, కారం, ఒత్తిడి అనుకునేవారు, ఆల్కహాల్ త్రాగటం పొట్ట, ప్రేగులుకు సంబంధించిన పూతకు కారణాలు అనుకునేవారు. దాదాపు వంద సంవత్సరాలవరకు అల్సర్స్‌కు కారణాలు అదే అనుకుని వీలైనంత వాటికి దూరంగా ఉండమని సలహాలు ఇచ్చేవారు. 1982లో టారీమార్షల్ మరియు రాబిన్ వారెన్ అనే ఇద్దరు డాక్టర్లు జీర్ణవ్యవస్థ సంబంధించిన అల్సర్స్‌కు కారణం హెలికోబాక్టర్‌పైలోరీ (H.పైలోరి) అనే బ్యాక్టీరియా అని కనుగొన్నారు. దీనికి వారికి నోబెల్ బహుమతి ప్రదానం కూడా జరిగింది. మన జనాభాలో 90% మంది ఎప్పుడో ఒకప్పుడు ఈ బ్యాక్టిరియా కు గురవుతూ ఉంటారు. కాని ఒత్తిడి, ఎసిడిటి, స్మోకింగ్, ఆల్కహాల్ వంటి కారణాలవల్లనో లేకవారి శరీరతత్వాన్ని బట్టి జీర్ణవ్యవస్థ లైనింగ్ దెబ్బతిని ఉన్నప్పుడు వారికి ఈ బ్యాక్టిరియా వలన అల్సర్స్ ఏర్పడటం జరుగుతుంది. పెయిన్ కిల్లర్స్ ఎక్కువగా తీసుకునే వారికి ఈ బ్యాక్టిరియాకు గురయ్యే ప్రమాదం ఉంది. జీర్ణవ్యవస్థ అల్సర్స్ ఉన్నవారికి కడుపులో నొప్పితో పాటు

1. ఆకలి తగ్గటం, ఎసిడిటి
2. వికారం, ఎక్కిళ్లు, త్రేన్పులు
3. రక్తపువాంతులు, మలంతో రక్తం పడటం వంటి లక్షణాలు కన్పిస్తాయి.

ఈ లక్షణాలు అల్సర్స్ స్టేజ్ మీద ఆధారపడి ఉంటాయి. మొదటి దశలో కడుపులో మంటగా ఉండటం ఏమైనా తినగానే కొంచెం సేపు తగ్గి, తరువాత కొద్దిసేపటికి మళ్లీ కడుపులో ఇబ్బందిగా ఉండటం జరుగవచ్చు. యాంటాసిడ్, తీసుకున్నప్పుడు కొంచెం సేపు ఉపశమనం కన్పించవచ్చు. రెండు వారాలు యాంటి బయాటిక్స్ RKP PPL వంటి మందులు ఈ అల్సర్స్‌కు పూర్తిగా నయం చేస్తాయి.

దాదాపు గ్యాస్ట్రిక్ అల్సర్స్ లాగానే పొట్టకు సంబంధించిన క్యాన్సర్స్ లక్షణాలూ ఉంటాయి. స్టమక్ (గ్యాస్ట్రిక్) క్యాన్సర్స్‌కు ప్రధాన కారణం కూడా దీర్ఘకాలికంగా ఉన్న అల్సర్స్. అందుకనే ఒకసారి అల్సర్ వచ్చి తగ్గినవారు రెండోసారి అలాంటి లక్షణాలు కన్పించినా అల్సర్స్ వాడిన మందులు వాడి. తర్వాత తగ్గటం లేదని డాక్టర్‌ను సంప్రదించటం జరుగుతు ఉంటుంది. అందుకనే ఇలాంటి లక్షణాలు కన్పించినప్పుడు ఎండోస్కోప్, బయాప్సి పరీక్షలు చేసి అనుమానంగా ఉంటే CT స్కాన్, అల్ట్రాసౌండ్ ఎండోస్కోపి పరీక్షలు చేసి స్టేజ్‌ను నిర్ధారిస్తారు.

పొట్టకు సంబంధించిన క్యాన్సర్స్ ట్రీట్‌మెంట్స్ కూడా కణితి వచ్చిన ప్రదేశం, స్టేజ్, వయస్సు, ఇతర ఆరోగ్యవిషయాలపై ఆధారపడి ఉంటాయి. పొట్టలో కణితి వచ్చిన ప్రదేశాన్ని బట్టి పొట్టలో కొంత భాగాన్ని తీసివేసి గ్యాస్ట్రెక్టమీ లేక పొట్టని మొత్తంగా తీసివేయటంతో పాటు చుట్టూ ఉన్న లింఫ్‌నాడ్స్, చిన్నప్రేగుల్లో కొంతి భాగాన్ని, అన్నవాహికలో కొంతి భాగాన్ని తీసివేయటం జరుగుతుంది. క్యాన్సర్‌ను కొంచెం లేటుగా గుర్తించినప్పుడు పొట్ట మొత్తాన్ని తీసివేసి అన్న వాహికను చిన్న ప్రేగులతో కలిపి వేస్తారు. సర్జరీ తర్వాత ఆహారం తీసుకోలేక పోవటం, వాంతులు, వికారం, మలబద్ధకం, విరోచనాలు వంటి లక్షణాలు కన్పిస్తాయి. సర్జరి ముందు చేసి తర్వాత కీమో, రేడియోథెరఫీ ఇచ్చినా లేక కీమోథెరఫీ, రేడియోథెరఫిలతర్వాత సర్జరీ చేసినా ఈ లక్షణాలు ఎక్కువగానే ఉంటాయి. పొట్టకు సంబంధించిన క్యాన్సర్స్ విషయంలో ఆహారంపట్ల ఇంకా చాలా జాగ్రత్తగా వ్యవహరించాల్సి ఉంటుంది.

ఈ సర్జరీ తర్వాత సప్లిమెంట్స్, విటిమీన్ డి, కాల్షియం, ఐరన్, విటమిన్ బి 12 (Vitamin B12) ఇంజక్షన్ల అవసరం చాలా ఎక్కువ. పొట్టని తీసివేసినప్పుడు ఆహారం నేరుగా చిన్న ప్రేగులలోకి వెళ్లటం వలన "డంపింగ్ సిండ్రోమ్" వస్తుంది. ఆహారం తక్కువగా, ఎక్కువసార్లు తీసుకోవటం, ఆహారం ముందు తర్వాత ద్రవపదార్థలు తీసుకొవటం వంటి అనేక జాగ్రత్తలు పాటించాల్సి ఉంటుంది.

క్యాన్సర్స్‌ను మరీ లేటుగా గుర్తించటం జరిగి కణితి ఆహారం తీసుకోవటానికి అడ్డంకుగా ఉన్నప్పుడు, లేజర్ థెరఫి, రేడియోషన్ థెరఫిలలో కణితిని చిన్నగా చేసి ప్రేగులలో స్టెంట్‌ను అమరుస్తారు. మెటల్ లేక ప్లాస్టిక్‌తో తయారయిన ఈ ట్యూబ్ ద్వారా ఆహారం జీర్ణవ్యవస్థలోకి




**Dr. Ch. Mohana Vamsy**
Chief Surgical Oncologist
Omega Hospitals, Hyderabad.
Ph : 98480 11421
Kurnool : 08518 273001
Guntur : 0863 2223300


వెళుతుంది. కాని ఇలాంటి పరిస్థితులు ఏర్పడినప్పుడు, క్యాన్సర్ మరీ ముదిరి ఇతర అవయవాలకు కూడా వ్యాప్తి చెంది ఉంటుంది అని అర్థం చేసుకోవాల్సి ఉంటుంది.

స్టమక్ క్యాన్సర్స్ లక్షణాలు మొదటి దశలో అంత ప్రస్ఫుటంగా ఉండవు. అనుమానించేంత స్థాయిలో లక్షణాలు బయట పడ్డాయి అంటే అప్పటికే క్యాన్సర్ స్టేజ్ ఎక్కువగా ఉండే ఉంటుంది. ప్రతి సంవత్సరం ప్రపంచవ్యాప్తంగా దాదాపు 8,00,000 మందిని ఈ క్యాన్సర్ పొట్టన పెట్టుకుంటుంది.

హెలికో బ్యాక్టర్‌పైలోరి (H.Pytori) బ్యాక్టిరియా దాదాపు 65-80% వరకు ఈ క్యాన్సర్‌కు కారణం. ఇంకా స్మోకీంగ్, మద్యం, జన్యుపరమైన కారణాలు దోహదపడ్తాయి. కాబట్టి అల్సర్స్‌కు సరిఅయిన ట్రీట్‌మెంట్స్ తీసుకొవటం, తేలిగ్గా జీర్ణమయ్యే ఆహారం తాజాగా ఉండే ఆహారం, పరిశుభ్రమైన నీరు తీసుకోవటంతో పాటు దురలవాట్లను దూరంగా ఉంచటం చాలా ముఖ్యం. కడుపుఉబ్బరం, మంట, త్రేన్పులు లాంటి లక్షణాలు ఎక్కువగా కన్పిస్తే ఎవ్వరికి తోచిన యాంటాసిడ్స్‌వారు అలా దీర్ఘకాలికంగా వాడకుండా, ఒకసారి డాక్టర్ సలహామేరకు ఎండోస్కోపి చేయించటం మంచిది.

కడుపులో మంట, ఉబ్బరం, పుల్లటి త్రెన్పులు, అజీర్తి ఇలాంటి లక్షణాలు ఎప్పుడో ఒకప్పుడు అందరూ ఎదుర్కొనేవే అయితే ఈ లక్షణాలు తరుచుగా కన్పిస్తున్నా యాంటాసిడు విరివిగా వాడటం, తోచిన చిట్కాలు పాటించటం ద్వారా అల్సర్స్‌ను ముదరబెట్టుకోవటమో లేక క్యాన్సర్స్‌ను నిర్లక్ష్యం చేయటమో జరుగుతూఉంటుంది. కాబట్టి ఇలాంటి లక్షణాలు మన రోజూవారి జీవనాన్ని దెబ్బతీస్తున్నాయి అంటే సరియైన పరీక్షలు అవసరమైన మందులు వాడటం తప్పనిసరి అని అర్థం చేసుకోవటం మంచిది.

(సశేషం)

# మారాకు

పి.ఎస్.నారాయణ

**"పబ్‌లకెళ్ళటం, పాత స్నేహితులతో తిరగటం మానేయమన్నాను... ఇంకెప్పుడూ అలా వెళ్ళనంటూ ఒక్క మాటంటే ఎంత సంతోషించేవాడిని?" అన్నాడు అతను. "నీ సంతోషంకోసం నేను ఆత్మగౌరవాన్ని చంపుకోవాలా... నేనెప్పుడూ పరిధి దాటను" అంటూ విసురుగా లేచి గదిలోకి వెళ్ళి తలుపేసుకున్నది ఆమె. ఇంతలో...**

విశాఖపట్నంనుంచి సికింద్రాబాద్‌కు వచ్చే గోదావరి ఎక్స్‌ప్రెస్ ఇంకో ఐదునిముషాల్లో వస్తుందనగా ఎస్ సెవన్ బోగీ వచ్చి ఆగేప్రదేశంలో నిలబడ్డాడు శ్యామ్. మొన్నరాత్రి పదిగంటలప్పుడు వైజాగ్‌నుంచి సుందరమ్మత్తయ్య ఫోన్‌చేసింది.

"మా మేడమీద అద్దెకున్నవారమ్మాయి మంజరికి అక్కడ ఏదో ఇంటర్వ్యూ ఉన్నదట.

హైదరాబాద్ మొదటిసారి వస్తున్నదిగాని స్టేషన్‌కు వచ్చి మీ ఇంటికి తీసుకువెళ్ళు. నాలుగురోజులు ఉంటుంది అక్కడ!" అంటూ.

బండి ఆగిన రెండునిమిషాల్లోనే ఎటునుంచి వచ్చిందోగాని, ఆ అమ్మాయి తన పక్కగా నిలబడి "మీరు శ్యామసుందర్‌గారే కదూ... సుందరమ్మత్తయ్యగారు ఫోన్‌చేసి చెప్పిన మంజరినండి... నమస్కారం!" అన్నది నవ్వుతూ.

ఉలిక్కిపడ్డట్లుగా చూశాడు తలతిప్పి అందంగా మెరిసిపోతున్న ఆ అమ్మాయి వంక కన్నార్పకుండా. సరిగ్గా అప్పుడే కాలినడక బ్రిడ్జి మెట్లమీదనుంచి దిగుతూ పదిగజాలదూరంలోకనబడింది దివిజ! కంగారుపడిపోతూ చూపుమరల్చుకున్నాడు శ్యామ్!

ఆమె, తనూ సంవత్సరంపాటు సహజీవనం చేసి అభిప్రాయభేదాలతో నెలక్రితమే దూరమయ్యారు.

మంజరిని తీసుకుని ఇంటికి వచ్చేటప్పటికి గంట పట్టింది. "నాకు ఎనిమిదిన్నరకు ఆఫీసుకు వెళ్ళేందుకు క్యాబ్ వస్తుంది. సాయంత్రం ఆరుకల్లా వచ్చేస్తాను. ఇదే రోడ్డుమీద ఫర్లాంగు దూరంలో మంచి హోటల్ ఉన్నది.

మీ టిఫిను, భోజనం అక్కడే కానిచ్చేయండి ఈ పూటకి. రాత్రి సంగతి నేను వచ్చిన తర్వాత ఆలోచిద్దాం!" అని సలహా ఇచ్చి హడావుడిగా స్నానం చేసి క్యాబ్ రాగానే ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

ఆఫీసులో అడుగుపెట్టిన అరగంటలోనే దివిజ కాల్‌చేసింది. "ఏమిటీ ఎవతోకొత్తదాన్ని పట్టినట్లున్నావ్ మీ ఊరిదేనా... నన్ను ఇంట్లోనుంచి వెళ్ళగొట్టి ఇంకా మండలంకూడా కాలేదు. అప్పుడే అంతతొందరా?"

"నేను నిన్నేం వెళ్ళగొట్టలేదు... నీకే ఒళ్ళు కొవ్వెక్కి వెళ్ళిపోయావ్!" రోషంగా అన్నాడు శ్యామ్.

"నాకు అక్కడే కోపమొచ్చేది...కలిసి ఉండలేనంతగా తంపటం పెట్టి మళ్ళా అదో అభాండమా? ఇంతకీ ఆ పిల్ల ఎవరో చెప్పనేలేదు! దాంతో ఎన్నాళ్ళు కాపురం వెలగబెట్టాలనేం!"

"నేను నీలాగా నిబద్ధత లేనివాణ్ణి కాదు!" విసురుగా అన్నాడు. "విశాఖపట్నంనుంచి మా అత్తయ్య చెబితే ఏదో ఇంటర్వ్యూకి వచ్చిన ఆ అమ్మాయిని రిసీవ్ చేసుకోవటానికి స్టేషన్‌కు వచ్చాను!"

రెండు సంవత్సరాల క్రితం తను పనిచేసే ఆఫీసులోనే కొత్తగా ఓ అమ్మాయి జేరగా, ఏమ్డీ పిలిచి 'ఈమెను సాయంగా ఇస్తున్నాను.. చేతిలోని ప్రాజెక్ట్ త్వరగా పూర్తిచేయాలి... బాగా ఒత్తిడి వస్తోంది!"

"తప్పకుండా, సార్!" అన్నాడు ఆ అమ్మాయిని చూస్తూ. చూడచక్కని పిల్ల. బిటెక్ చేస్తూనే క్యాంపస్ సెలక్షన్‌లో విజయం సాధించి, ట్రైనింగ్ తర్వాత మొదటిసారిగా ఉద్యోగంలో చేరిందట.

ఆ అమ్మాయిదీ తనదీ విశాఖపట్టణం అవ్వటం కాకతాళీయమే అయినా తరువాత ఆరునెలలకే తన ఇంటికి తనతో సహజీవనానికి అంగీకరించి రావటానికి కారణం ఇద్దరిలోనూ ఉన్న చొరవే!

వారంరోజులు తనింట్లోనిరెండుపడకగదులనూ విడివిడిగా వాడుకున్నా... చెరో లైటు, చెరో ఫ్యాను వేసుకుని కరెంటును దండగ చేయటం దేనికి అనుకుంటూ ఓ గదిలోకే చేరిపోయారు!

"ఈ ఇంట్లో ఇంతకుముందు ఆడవాళ్ళు ఎవరైనా ఉన్నారా?" శ్యామ్ ఆఫీసునుంచి రాగానే మంజరి అడిగింది.

"ఎందుకొచ్చిందా అనుమానం...?" నుదురు చిట్లిస్తూ అడిగాడు శ్యామ్.

"వంటింట్లో వంటకు కావాల్సిన సామాగ్రి అంతా ఉన్నది... ఆపైన గ్యాస్ సిలిండర్‌మీద చేయి తుడుచుకోవటానికి పాత జాకెట్టుంటేను!" నవ్వుతూ అన్నది.

గతుక్కుమన్నా, మరో అమ్మాయితో సహజీవనం చేసింది నిజమైనప్పుడు అబద్ధమాడవలసిన అవసరం ఏమున్నది? విడిపోవటంలో కూడా తన తప్పేం లేదు కాబట్టి, సంవత్సరంపాటు తను దివిజతో ఎలా కలిసి ఉన్నదీ, ఎలా విడిపోయిందీ చెప్పుకుంటూ వచ్చాడు.

"ఆమె నాకు దూరంగా వెళ్దామనుకున్నదంటే నా అభిప్రాయాలు ఆమెకు నచ్చలేదన్నమాట... మనకు కొన్ని సంప్రదాయాలున్నాయి. వాటిని అనుసరించాలి అన్నాను. అదో తప్పులా భావించినట్లున్నది!"

మంజరి పకపకా నవ్వింది "సహజీవనమే సంప్రదాయం కాదు!" అంది.

"మగవాడికి ఆడది గౌరవమివ్వాల్సిన అవసరం లేదా? అది సహజీవనమైనా కానీ, పెద్దలు ఏర్పరిచిన వైవాహిక జీవితమైనా కానీ... ఆ అవగాహన లోపించే ఆమె నానుండి వెళ్ళిపోయింది!" గుర్రుగా అన్నాడు.

"అయితే ఆడదానికి మగవాడు గౌరవమివ్వాల్సిన అవసరం లేదంటారా?" అతనివైపు కొంటెగా చూస్తూ అడిగింది మంజరి.

"అయినా ఆఫీసులో బుర్ర చెడగొట్టుకుని వచ్చిన మీకు ఇప్పుడు నా మాటల్తో మరింత ఇబ్బందిపెట్టటం దేనికిగాని, ఇంట్లో



అన్నీ ఉన్నాయి కాబట్టి రాత్రికి నేను వంట చేస్తాను. ఇంట్లోనే భోజనం చేయవచ్చు!"

"మీరు నాకు అతిథి... మీ చేత వంట చేయించటమేమిటి... వద్దు. హోటల్‌కే వెళ్దాం!"

మంజరి ఎంత చెప్పినా వినకుండా హోటల్‌కే తీసుకువెళ్ళాడు. పదిగంటలప్పుడు భోజనం చేసి వచ్చి తన గదిలో మంచంమీద చేరిన మరుక్షణంలోనే దివిజ కళ్ళముందు మెరిసింది.

ఎంత పొగరుంటేనేం పంచదార చిలకే... ఆమెతో కలిసి స్వర్గానికి బెత్తెడు క్రిందగా గడిపేవాడు సమయాన్నంతా.

'నువ్వు నన్ను రాత్రి నిద్రపోనీయటంలేదు!' కవ్విస్తున్నట్లుగా అనేవాడు పొద్దున్నే నిద్రలేస్తూ. ఒక రోజు అలా అంటూ మంచం దిగుతున్న దివిజ చేయి పట్టుకుని, 'నాకు అర్థమైంది నీలోని ఆకర్షణకు కారణమేమిటో!' అన్నాడు పకపకా నవ్వుతూ.

'నేను రోజూ పెడుతున్న నల్లనేరేడు, జామపండు ముక్కలే మిమ్మల్ని ఆ భ్రమలో పడేస్తున్నాయి!' మూతిని మెలికలు తిప్పుతూ అన్నది. "వాటిశక్తి తెలుసుకోవటానికి మీకిన్నాళ్ళు పట్టిందన్నమాట!"

ఆమె సాహచర్యంలో రోజులు క్షణాల్లా గడిచిపోతున్నాయి. ఓ రోజు రాత్రి తనకు డ్యూటీ అయి ఇంటికొచ్చేసరికి తలుపుకు తాళం వేసి ఉంది. మహా చికాకు వేసింది. తరువాత పావుగంటకు వాకిటి ముందు క్యాబ్‌లో నుంచి దిగింది దివిజ.

ఒత్తయిన జుట్టును చుట్టచుట్టుకున్నది. అంత పొద్దుబోయినా వాడనిముఖం అంతకుముందే ఎక్కడో తీర్చిదిద్దుకున్నట్లే అనిపిస్తోంది. క్యాబ్‌దిగుతూనే అందులోవున్న ఎవరో బయటకుజాపిన చేతికి తనచేయి కలిపి, 'బై' చెప్పేసి లోపలకు వడివడిగా వచ్చింది.

"సారీ శ్యామ్! కలకత్తానుంచి నాతో చదువుకున్న భాను వచ్చాడు... నువ్వొచ్చేటప్పటికి ఎలాగూ లేటవుతుంది కదా అని ముత్యాలు కొనటానికి సాయంగా రమ్మంటే వెళ్ళాను. తరువాత పబ్‌లో మాట్లాడుకుంటూ కూర్చోవటంతో ఆలస్యమైంది!"

గులాబీ రంగు పెదవులను కవ్విస్తున్నట్లుగా కదిలిస్తూ, తలుపుకున్న తాళం తీసింది.

"ఇంటిని కూడా మర్చిపోయి అర్ధరాత్రిదాకా తిరిగేంత గొప్ప స్నేహితుడా అతడు?" అసహనంగా అన్నాడు శ్యామ్. కళ్ళు చికిలించి చికాగ్గా చూసింది దివిజ. "అంటే నీ ఉద్దేశ్యం?"

"సహజీవనం అంటే వివాహజీవితం వారిదేకాదు. కొన్ని నిబంధనలూ పాటించాలి!"

"మనంపెట్టుకున్న నిబంధనల్లో ఒకళ్ళ విషయాల్లో మరొకళ్ళుజోక్యం చేసుకోగూడదనికూడా ఉన్నది!"





"అంటే దానర్థం ఎవరికి ఇష్టమొచ్చినట్లు వాళ్ళు విచ్చలవిడిగా తిరగొచ్చనా?"

"నాకక్కడే కోపమొస్తుంది... నేను చెడు తిరుగుళ్ళు తిరుగుతున్నాననా నీ ఉద్దేశ్యం?"

ఆమె సమాధానానికి శ్యామ్ శరీరం వేడెక్కి కుతకుతలాడిపోయింది!

మంజరి వచ్చిన మూడోరోజు ఉదయాన్నే వాకిట్లో ఆఫీసుక్యాబ్ హారన్ మ్రోగుతుండటంతో పరుగెడుతున్నట్లుగా బయటకు వచ్చాడుశ్యామ్. మంజరితో కలిసి క్రితంరాత్రి బయట కబుర్లుచెప్పుకుంటూ తిరిగి, హోటల్లో భోజనం చేసివచ్చి పడుకుంటే దివిజ మంచంమీద చేరి ముక్కుతో కాకి పొడుస్తున్నట్లుగా పొడుస్తూనే, ఆ పుండుమీద వెన్న రాస్తున్నట్లుగా గిలిగింతలూ పెట్టింది.

దాంతో నిద్రచెట్టెక్కేయటంతో పొద్దున్నే ఆలస్యంగా లేచాడు.

"నన్నుముట్టుకోవద్దు దూరంగా పడుకో. లేకపోతే ఆ కలకత్తావాడు ఏదో హోటల్లో దిగివుంటాడుగా అక్కడికే పో!" కోపంతో అరుస్తూ మనసును చల్లార్చుకో ప్రయత్నించాడు శ్యామ్.

చటుక్కున మంచంమీద లేచి కూర్చున్నది దివిజ బుసలు కొడుతూ. "కలకత్తా వాడి దగ్గరకే వెళ్తానో... కన్యాకుమారి వాడి దగ్గరకు వెళ్తానో నా ఇష్టం.

ఇక ఇక్కడ చచ్చినా ఉండను. అనుమానపు మగాడితో సంసారం చేయటమంత బుద్ధితక్కువ మరొకటి లేదు. ఎందుకు వెళ్ళాల్సివచ్చిందో చెప్పినా దాన్నే పట్టుకుని పదేపదే పీకుతుంటే..." కంఠం హెచ్చించి అరవటం మొదలుపెట్టింది.

కసినంతా వెళ్ళగక్కుతూ, "అప్పనంగా దొరికే స్వేచ్ఛే అన్ని అనర్థాలకూ మూలం!" అన్నాడు.

## బ్యాలెన్స్ చేసుకుంటా

'భరత్ అనే నేను' సినిమా తర్వాత కైరా అద్వానికి తెలుగు ఆఫర్లు బావున్నాయి.

రామ్‌చరణ్‌తో ఓ సినిమాకు సంతకాలు చేసింది. తెలుగు పరిశ్రమకు షిఫ్టయ్యే ఆలోచన ఉందా? అని అడిగితే నవ్వుల జడివాన కురిపించింది.

"నేను నా పని షెడ్యూల్‌ను బ్యాలెన్స్ చేసుకుంటూ హిందీలోనూ, దక్షిణాదిలోనూ కూడా నటిస్తాను. సినిమాల విషయంలో భాషా హద్దులు లేవన్నది ప్రత్యేకంగా చెప్పుకోనవసరంలేదు.

ఉత్తరాది, దక్షిణాదిల్లో ఎక్కువమంది ప్రేక్షకుల ముందుకు వెళ్ళగలగడం నా అదృష్టం.ఓ ఆర్టిస్టుగా నాకిదో వరం" అని చెప్పింది.

"స్వేచ్ఛకోసమే వివాహమంటూ బంధాలేర్పరచుకోకుండా కలిసి బ్రతుకుతున్నది!" అంత విసురుగానూ అన్నది దివిజ.

"మరి.. నువ్వు నా ఇంట్లో కాలుపెట్టిన మరునాడే నన్ను సిగరెట్లు మానేయాల్సిందేనని ఎందుకు ఆంక్షలు పెట్టావ్!... అది నా స్వేచ్ఛ హరించటం కాదా?" ఉక్రోషంగా అన్నాడు శ్యామ్.

"అక్కడే నాకు కోపమొచ్చేది. అది ఆంక్షగాదు... నీ ఆరోగ్యం బాగుండటంకోసమే చెప్పిన మాట!"

"చూడు దివిజా! నీమీద ప్రేమతో నీ మాట నేను వింటున్నట్లుగా నువ్వూ నా మాటను గౌరవించాలి! పబ్‌లకెళ్ళటం, పాత స్నేహితులతో తిరగటం మానేయమని చెప్పాను... ఇంకెప్పుడూ అలా వెళ్ళనంటూ ఒక్కమాటంటే ఎంత సంతోషించేవాడిని?"

"నీ సంతోషంకోసం నేను ఆత్మగౌరవాన్ని చంపుకోవాలా...నేనెప్పుడూపరిధి దాటను. అయినా నన్నేదో నీతిలేనిదానిలా చేసి మాట్లాడుతుంటే ఇక్కడే ఉండి నా గౌరవాన్ని నాశనం చేసుకోను!"

విసురుగాలేచి ఆ ఇంట్లోకి వచ్చిన మొదటిరోజుల్లో పడుకున్నగదిలోకి వెళ్ళి తలుపేసుకున్నది. తెల్లవారుతూనే మాటమాత్రంకూడా చెప్పకుండా పెట్టె తీసుకుని క్యాబ్‌ఎక్కేయటం అతడిని బాధించింది.

పన్నెండు గంటలప్పుడు కాల్ చేసింది మంజరి. "రాత్రికి నేను డిన్నర్ ఇస్తున్నాను... ఎక్కడో మీరే నిర్ణయించాలి!" అంది.

"సెలక్ట్ అయ్యారన్నమాట... అభినందనలు!"

"మీరు ఇంటికి వచ్చి ఫ్రెషప్ అవ్వగానే కాసేపు అలా బైట తిరిగి, మంచి హోటల్లో డిన్నర్‌చేసివద్దాం!"

అనుకున్నట్లుగానే రెండు గంటలపాటు ఇద్దరూ తిరిగి, రవీంద్రభారతి పక్కగా ఉన్న ఏసీ హోటల్‌కు వెళ్ళారు.

"భోజనమా? టిఫినా?" అడిగింది మంజరి ఓ ఖాళీ టేబుల్ దగ్గర కూర్చున్న తరువాత.

సరిగ్గా ఆ సమయంలోనే దివిజ లోపలకు వస్తూ కనబడటంతో గుడ్లప్పగించి చూస్తూ ఉండిపోయాడు శ్యామ్. ఆమెను చూడగానే గుండెల్లో కోపం చివ్వున లేచింది 'ఇక్కడికీ తయారయిందా తన మూడ్‌ను చెడగొట్టేందుకు'. దివిజ ఎక్కడ కూర్చుందామా అన్నట్లుగా నలువైపులా చూస్తుంటే ఎదురెదురుగ్గా కూర్చున్న శ్యామ్, మంజరి కంటబడ్డారు.

మరుక్షణంలోనే ఆమె విసురుగా వాళ్ళ టేబుల్ దగ్గరకు వచ్చి పక్కనున్న ఖాళీ కుర్చీని బర్రున లాక్కుని కూర్చుంటూ-

"చాలాకాలానికి కలకత్తానుంచి వచ్చిన స్నేహితుడు కనబడితే, మీరు ఆఫీసునుంచి ఆలస్యంగా వస్తారుగదా అని పబ్బుకెళితే ఎంత అసభ్యంగా మాట్లాడారు. ఇప్పుడు మీరు చేస్తున్నదేంటి.

ఎర్రగా బుర్రగా ఉందికదా అని ఈవిడగారితో తిరుగుతారా... నేనుచేసింది అంత ఘోరమైన తప్పు అయితే మీరు చేస్తున్నది ఒప్పా?" గొంతు పెద్దది చేసి అరవటం మొదలుపెట్టింది దివిజ.

శ్యామ్ ముఖం ఆమె మాట తీరుకు నల్లగా మాడిపోయింది. మంజరి అయితే కలవరపడుతున్నట్లుగా ఆమె వంకచూస్తూ, అనునయంగా ఆమెచేతిని పట్టుకుని "మీరెందుకు అలా మాట్లాడుతున్నారో తెలియటంలేదు...కానీ ఒకవిషయం గుర్తుంచుకోండి.

మనం పబ్లిక్‌ప్లేస్‌లో ఉన్నాం. నలుగురూ మనల్నే చూస్తున్నారు!" అన్నది చాలా చిన్నగా.

దివిజ ఆ మాట వింటూనే కాస్తంత ఇబ్బందిగా నలువైపులా చూసి, లోగొంతుకతో, సారీ... సారీ... ఈ మహానుభావుణ్ణి చూసిన తరువాత నన్ను నేను అదుపులో పెట్టుకోలేకపోయాను!" అన్నది తలవంచుకుని.

వీరి మేనత్తగారు నాకు తెలిసిన వారవ్వటంతో వారి సూచన మీద



**అమెరికా 'ఐరోపా రక్షకుడు' అనే ఆలోచన వదిలి ఐరోపా దేశాలు తమదారి తాము చూసుకోవాలి.**

-ఏంజిలా మార్కెల్, జర్మన్ ఛాన్స్‌లర్

వీరింట్లో దిగటం జరిగింది. ఈ రోజున ఇంటర్వ్యూలో సెలక్ట్ అయ్యాననే ఆనందంలో వారికి డిన్నర్ ఇద్దామని తీసుకువచ్చాను... అంతే!" అన్నది.

శ్యామ్ తలవంచుకుని కూర్చున్నాడు అసహనంతో మాట్లాడకుండా. భోజనాలు వచ్చాయి.

ముగ్గురికీ భోజనం లోపలకు పోవటంలేదు.

"ఏ సమస్యకూ పరిష్కారం ఇలాంటిచోట దొరకదు. ఇంటికి వెళ్దాం... ప్రశాంతంగా మాట్లాడుకోవచ్చు!" అని భోజనాలు అయిన తరువాత మంజరే దివిజను బలవంతాన చేయిపట్టుకుని తీసుకెళ్ళి ఆటోలో శ్యామ్‌పక్కన కూర్చోబెట్టి తరువాత తను కూర్చున్నది.

సంవత్సరంపాటు గడిపిన ఆ ఇంట్లో కాలుపెడుతుంటే దివిజకు గుండెల్లో ముల్లులా గుచ్చుకుంటున్నా లోపలకు వెళ్ళటానికి మనసు మొరాయించటంలేదు. "ఇప్పుడు చెప్పండి... మీరు అపోహలతో విడిపోయారనేదే నిజం... వాటిని వదిలించుకుని తిరిగి ఒకటి అవ్వలేరా?"

అడిగింది మంజరి తలుపులు వేసుకుని హాల్లో కూర్చున్న తరువాత మొదటిసారిగా నోరు తెరిచి. 'ఖాళీగా కూర్చోలేక స్నేహితులతో బయటకు వెళ్ళటమంత చిన్నది కూడా తప్పులా కనబడితే ఆ సంసారం నిలబడేదేనా?" రోషంగా అన్నది దివిజ.

> అగ్రవర్ణాలలోని నిరుపేదలకు రిజర్వేషన్లు కల్పించాల్సిందే.
> -రామవిలాస్ పాశ్వాన్, కేంద్రమంత్రి



"స్నేహితురాళ్ళతో కాదు, మగవాళ్ళతో తిరిగినప్పుడే అభ్యంతరం చెప్పింది!"

ఆ కంఠంలో తీవ్రత చాలా తగ్గినట్లనిపించగా మంజరి తృప్తిగా చూసింది అతడి వంక.

"అక్కడే నాకు కోపమొచ్చేది... సహజీవనంలోనే కాదు, మొగుడూ పెళ్ళాలకూ ఒకళ్ళమీద ఒకళ్ళకు నమ్మకముండాలి! అలా అనుకుంటే మగవాడు బయటకెళ్ళినప్పుడల్లా ఆడదీ అనుమానిస్తూనే ఉండొచ్చుకదా!"

"నేను నా కళ్ళతో చూశాను కాబట్టి" అతను మాట పూర్తిచేయనేలేదు-

"నాలో నిజాయితీ ఉన్నంతకాలం నన్ను ఎవరూ ఏమీ చేయలేరు!" అంటూ లేచింది దివిజ కుర్చీలోంచి విసురుగా.

మంజరి వెంటనే ఆమె చేయిపట్టుకున్నది.

"తెలిసో తెలియకో నేను మీ నడుమ కాలు పెట్టాను. నాకొక్క అవకాశమివ్వండి...

జరిగినదానికి ఇద్దరూ ఒకరికొకరు సారీ చెప్పుకుని కలిసి ఉంటే ఎంతో ఆనందిస్తాను.

మరోసారి మీ విషయాల్లో నేను కల్పించుకోను. మీకు సర్దిచెప్పను!" అన్నది అనునయంగా ఇద్దరివంక చూస్తూ.

దివిజ, శ్యామ్ ఇద్దరూ పట్టుమీద వున్నమాట వాస్తవమే అయినా అంతరాంతరాల్లో ఒకరికొకరు దూరం అవ్వటం మనసుకు వెలితిగానే ఉన్నదని తెలుసు. అయినా భేషజమే అడ్డ వస్తూ బయటపడటానికి సుముఖల్ని చేయలేకపోతోంది. "ఈరోజు చాలా మంచిరోజు. మీరు వెళ్ళి ముగ్గురికీ టీ కలపండి...మీరు అలాచేస్తే ఈ ఇంట వారితోకలిసి ఉండటానికి అంగీకరించినట్లు...

దాన్ని ఆయనతాగితే మిమ్మల్ని తిరిగి ఈ ఇంటికి ఆహ్వానిస్తున్నట్లు!" అన్నది మంజరి వాతావరణాన్ని తేలికపరుస్తున్నట్లుగా నవ్వుతూ.

దివిజ ఏమనుకున్నదో ఏమో మంజరి చేతినుంచి తన చేతిని విడిపించుకుని వంటింట్లోకెళ్ళిపోయింది.

"మా కంటే చిన్నవారైనా మీరుచేసిన ఈ సాయానికి మా కృతజ్ఞతలు!" అన్నాడు శ్యామ్ తృప్తిగా సాయంత్రం నాలుగు గంటలప్పుడు మంజరిని ఫలక్‌నామాలో ఎక్కిస్తూ పక్కన దివిజ లేకుండా చూసి.

"నాకు కాదు చెప్పాల్సింది. నేను హైదరాబాద్‌లో ఇంటర్వ్యూకు వెళ్తున్నాను అంటే మీ సుందరమ్మత్తయ్యగారు, అక్కడ మా శ్యామ్‌ఎక్కిన రైలుఎందుకో పట్టాలు తప్పినట్లుంది, దాన్ని మళ్ళా దారిలో పెట్టటానికి వీలౌతుందేమో చూడమ్మా అన్నారు. ఆమెకు చెప్పండి!" అన్నది నవ్వుతూ.

రైలు వెళ్ళిపోయిన తరువాత దివిజ, శ్యామ్ అటూ ఇటూ తిరిగి, మోండా మార్కెట్‌లో కావాల్సినవి కొనుక్కుని హోటల్లో భోజనం చేసి ఇంటికి వచ్చేటప్పటికి రాత్రి పదిగంటలయింది.

లోపలకు వచ్చి లైట్లు వేస్తూనే "టైమెంతయిందో చూడండి.. నేను నేరేడుపళ్ళు కడిగి, జామకాయ ముక్కలు తరుగుతానుగాని ఈలోగా మంచాల మీద దుమ్ముదులిపి చలవచేసిన దుప్పట్లువేయండి!" అన్నది శ్యామ్ వంక కొంటెగా చూస్తూ.

"నాకు నలిగిన దుప్పట్లమీద పడుకోవటమంటే మహా చికాకు!" అన్నాడు శ్యామ్.

అలా వాళ్ళ సహజీవనం మారాకు వేసిన మూడు నెలలకు పెద్దల సమక్షంలో పెళ్ళిగా మారుతుండగా శ్యామ్ కళ్యాణమండపంలో కాలుపెడుతున్న సమయంలో మెరుపులా మెరిసి

"నమస్కారం బావగారూ!" అన్న మంజరిని చూస్తూనే అవాక్కయ్యాడు!

"ముందు లోపలకు పద!" అంది పక్కనే ఉన్న సుందరమ్మత్తయ్య అతడి చేయి పట్టుకుని లోపలకు తీసుకువెళ్తూ,

"నీ కాబోయే భార్యా,మంజరి స్వంతఅక్కాచెల్లెళ్ళ బిడ్డలేలే!" అన్నది ముసిముసినవ్వులతో.



## గొంతు బావుంది

ఇంతకుముందయితే నటించడంవరకే తమ డ్యూటీ అన్నట్లుండేవాళ్ళు నటీమణులు. కాని ఇప్పటి పరిస్థితి మారిపోయింది.

భాషా సరిహద్దులు చెరిగిపోయి బాలీవుడ్ భామలు దక్షిణాదికి చేరుతున్నారు. మలయాళ బ్యూటీలు తెలుగు తెరపై హవా చేస్తున్నారు.

ఈ నేపథ్యంలో స్వంతగళంవిప్పడం ఓ అదనపు అర్హతగా మారింది. స్వంతంగా డబ్బింగ్ చెప్పుకుంటే తమపాత్రకు పూర్తి న్యాయం జరిగినట్లుగా భావిస్తున్నారు.

'సమ్మోహనం' సినిమాకు అదితిరావ్ హైదరి డబ్బింగ్ చెప్పింది. తెలుగు మూలాలున్న అదితి రావ్ తెలుగు నేర్చుకుని మరీ డబ్బింగ్ చెప్పింది. గొంతు బావుందంటూ సినీ యూనిట్ ప్రశంసలు కురిపించింది కూడా. ప్రేక్షకుల మాట ఎలా వుంటుందో ఓ నెలాగితే కాని తెలియదు.

# అంతా రాజకీయమే

## పోటా పోటీ యాత్రలు

ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రంలో అప్పుడే ఎన్నికల మూడ్ వచ్చేసింది. 15 ఏళ్ళుగా తమ చేతిలో ఉన్న అధికారం వదులుకునేందుకు బి.జె.పి. సిద్ధంగా లేదు.

మరోసారి అధికారం చేపట్టి రికార్డు సృష్టించాలన్నది బి.జె.పి. ఆలోచన. చాలా కాలంగా అధికారంకి దూరంగా ఉన్న కాంగ్రెస్ ఎలాగైనా ఈసారి బి.జె.పి.ని ఓడించి రాయపూర్‌లో పాగా వెయ్యాలనుకుంటున్నది. అందుకే ఆరునెలల ముందుగానే రెండు పార్టీలవారు యాత్రలు మొదలుపెట్టారు.

బి.జె.పి. వికాస్ యాత్ర పేరుతో మావోయిస్టుల ప్రభావిత దంతేవాడ జిల్లానుండి ప్రచారం మొదలు పెట్టింది. 15 ఏళ్ళ పాలనలో తమ విజయాల గురించిన ప్రచారం ఆ యాత్రలో చేస్తారు.

దీనికి పోటీగా కాంగ్రెస్ పార్టీ 'వికాస్ ఖోజో యాత్ర'ని ప్రతిపాదించింది. బి.జె.పి. పాలనలోని లోపాలను ఎత్తిచూపుతూ యాత్ర నిర్వహిస్తారట. చివరికి రాహుల్‌గాంధీ వచ్చి అమేథీలో తాను ఎంత గొప్ప అభివృద్ధి సాధించింది వివరించి అటువంటి అభివృద్ధి ఛత్తీస్‌ఘడ్‌లో ఎక్కడని ప్రశ్నిస్తాడట. ◆

## సేమ్ ఫార్ములా

సాగినంత కాలం విన్నింగ్ ఫార్ములాని కొనసాగించటం చాలా ఆటల్లో చాలామంది క్యాప్టెన్స్ చేసే పని. అటువంటి ఫార్ములానే ఇప్పుడు రాజకీయాలలో పార్టీ అధ్యక్షులు కొనసాగిస్తున్నారు.

అందుకు సాక్ష్యం బి.జె.పి. అధ్యక్షుడు అమిత్‌షా అనుసరిస్తున్న విన్నింగ్ ఫార్ములా. బి.జె.పి.లో విధేయతతో పనిచేసే కార్యకర్తలున్నారు.

కాని ఆ కార్యకర్తలను కదిలించి, నడిపించగలిగిన ప్రజాకర్షిత నాయకులు కరువయ్యారు.

అందుకే నాయకులను దిగుమతి చేసుకుని వారి సారథ్యంలో పార్టీ గెలుపులకు ఎత్తుగడలు వేస్తున్నారు. నేడు ఆంధ్రప్రదేశ్‌లోనూ అదే ఫార్ములా ప్రయోగిస్తున్నారు.

కాంగ్రెస్‌లో నుండి బి.జె.పి.లోకి వచ్చి అక్కడ ఇమడలేక వై.కా.పా.లోకి జంప్ అవటానికి ముహూర్తం పెట్టుకున్న కన్నాని అర్ధరాత్రి కాల్‌తో ఫిరాయింపు ఆపటమేకాక ఇప్పుడు ఏకంగా రాష్ట్ర అధ్యక్ష పదవిని అప్పగించటం అమిత్‌షా చతురత.

ఇక ఇప్పుడు కాపులకు పెద్దపీట వేసి ఆంధ్రప్రదేశ్‌లో మూడు (కులాల) స్తంభాలాటకు రంగం సిద్ధంచేసింది భారతీయ జనతా పార్టీ. ◆

## కాంగ్రెస్‌లో కంగారు

ఉత్తరాది నుండి దక్షిణాదికి విస్తరించాలన్న బి.జె.పి. యత్నంలో తొలి విజయం కర్ణాటకలో అందింది. ఈలోగా కె.సి.ఆర్. ఫెడరల్ ఫ్రంట్ పేరుతో డి.ఎమ్.కె. నేతలు కరుణానిధి, స్టాలిన్‌లను కలిసి వచ్చాడు. ఇదంతా ఎటుపోతుందో తెలియదు.

నేటివరకు మిత్రులుగా ఉన్న డి.ఎమ్.కె., తృణమూల్ కాంగ్రెస్‌లు చేజారిపోతాయేమోనన్న భయం కాంగ్రెస్ అధిష్టాన వర్గానికి పట్టుకుంది.

తమిళనాడులోకి ప్రవేశించే యత్నం బి.జె.పి. ముమ్మరం చేసింది. రజనీకాంత్ భారతీయ జనతా పార్టీకి అనుకూలంగా వ్యవహరిస్తున్నాడు.

కమలహాసన్ పార్టీ ముందుకు వెళుతోంది. ఈ దశలో డి.ఎమ్.కె. కూడా రాలిపోతే కాంగ్రెస్‌కి తమిళనాడులో శూన్యం మిగులుతుంది. అందుకే అర్జెంటుగా డి.ఎమ్.కె.తో సత్సంబంధాలున్న చిదంబరాన్ని తమిళనాడు కాంగ్రెస్ అధ్యక్షుడిగా పంపాలని కాంగ్రెస్ అధిష్ఠానం భావించింది.

చెన్నై కేంద్రంగా చేసుకుని దక్షిణాది వ్యవహారాలన్నింటినీ చిదంబరం నడిపించాలన్నది రాహుల్ గాంధీ కోరిక. మరి ఢిల్లీ వదిలి చెన్నై చేరేందుకు చిదంబరం అంగీకరిస్తాడా! ◆

## ఫ్రంట్... ఫట్

కె.సి.ఆర్. ప్రతిపాదిత ఫెడరల్ ఫ్రంట్‌కి ఆదిలోనే హంసపాదు పడింది. కె.సి.ఆర్. బెంగళూరు వెళ్ళి దేవెగౌడ, కుమారస్వామిలను కలసి ఫెడరల్ ఫ్రంట్ అవసరం గురించి వివరించి-

జె.డి.(ఎస్)కి తన మద్దతు ప్రకటించి, కర్ణాటకలోని తెలంగాణ వాసులను జెడి(ఎస్)కి ఓటు ఇయ్యమని పిలుపు ఇచ్చి, హైదరాబాద్ వచ్చి కాంగ్రెస్, బి.జె.పి.లు రెండూ ఒకలాంటివేనని భారీప్రకటన చేసి పదిరోజులు తిరగకుండానే కర్ణాటకలో జె.డి.(ఎస్). కాంగ్రెస్‌తో జతకట్టి ప్రభుత్వం ఏర్పాటుకు సిద్ధమైంది.

దీనితో ఫెడరల్ ఫ్రంట్ ప్రారంభమే 'ఫట్' అంది. కెసిఆర్‌కి జాతీయస్థాయిలో ఉన్న పలుకుబడి ఏమిటి! ఆయన వెళ్ళినచోటల్లా ప్రాంతీయ పార్టీల నాయకులు ఎదురు పాఠాలు చెప్పి పంపించారే కాని "ఆహా... ఏమి ఆలోచన" అని స్వాగతించినవారు లేరు.

పైగా కె.సి.ఆర్, బి.జె.పి.తో మోడీతో రహస్య ఒప్పందంలో ఉన్నాడన్న సందేహం ఇతర పార్టీలలో ఉంది. ఇటువంటి రాజకీయ వాతావరణంలో ఫెడరల్ ఫ్రంట్‌కి పురిటిలోనే సంధి కొట్టినట్టే. ◆

## ఆట మొదలైంది

ఆంధ్రప్రదేశ్‌లో కొత్త ఆట మొదలయింది. ఇందులో తనకు తానుగా స్టార్ బ్యాట్‌మన్‌గా చెప్పుకునే చంద్రబాబునాయుడు అన్నివైపుల నుండి బౌన్సర్లు ఎదుర్కోవాల్సివస్తుంది.

కర్ణాటకలో గెలుపుతర్వాత బి.జె.పి. దక్షిణాది విస్తరణలో ఆంధ్రకే ప్రాధాన్యత. నిన్న మొన్నటివరకు మిత్రుడిగా వ్యవహరించి, తర్వాత శత్రువుగా మారి, కర్ణాటకలో బి.జె.పి. ఓటమికి పిలుపు ఇచ్చిన టి.డి.పి., తిరుమల వచ్చిన అమిత్‌షామీద దాడికి ప్రోత్సహించిన టి.డి.పి.ని భయానికి గురిచేయటమే లక్ష్యంగా బి.జె.పి. ఎత్తుగడలు వేస్తుంది.

జనసేన అధినేత పవన్‌కళ్యాణ్, ఇటీవలే ఐపిఎస్ వదులుకుని ప్రజాక్షేత్రంలోకి వచ్చిన లక్ష్మీనారాయణ వంటివారి సహకారం తమకు ఉంటుందన్నది బిజెపి నమ్మకం. ఇక్కడనుండి రాబోయే ఆరునెలల కాలం చంద్రబాబుమీద విసరగలిగినన్ని రాజకీయ బౌన్సర్లు తాము విసురుతూ, జగన్‌చేత విసిరింపచేస్తారు.

ఒకే ఒక్క బ్యాట్స్‌మన్‌మీద ఆధారపడిన జట్టులా తయారైంది టి.డి.పి. చంద్రబాబును బౌన్సర్లతో టార్గెట్‌చేస్తే తెలుగు తమ్ముళ్ళు కకావికలం అవుతారన్నది బి.జె.పి. భావన. ◆

## కులతేనా

రాహుల్‌గాంధీని ప్రధాని పదవిలో చూడాలన్నది కాంగ్రెస్‌వాదుల కల.

2009 నుండి ఆ కల అలా కొనసాగుతూనేవున్నది. ఇటీవల కర్ణాటక ప్రచారంలో భాగంగా రాహుల్‌గాంధీ తాను ప్రధానిని అవుతానని, 2019 ఎన్నికల్లో పార్టీ ప్రచార బాధ్యత తీసుకుంటానని ప్రకటించాడు.

కాంగ్రెస్‌వారి కల నిజమవుతుందని నేతలు అనుకుంటుండగానే కన్నడ షాక్ తగిలింది. రాహుల్‌గాంధీ ముందుండి ప్రచారం చేసినా, అన్ని మతాల ప్రార్థనా మందిరాలు విడవకుండా దర్శించినా చివరికి కాంగ్రెస్‌కి దక్కింది రెండంకెల సీట్లుమాత్రమే.

ఓట్ల శాతంలో నంబర్ ఒన్‌గా నిలవటమే కాంగ్రెస్‌కి కన్సోలేషన్. రాహుల్‌గాంధీ కాంగ్రెస్ అధ్యక్షుడిగా చొరవ తీసుకుని జె.డి.(ఎస్.)తో మాట్లాడలేక తల్లి సోనియాని రంగంలోకి దించాల్సివచ్చింది.

జె.డి.(ఎస్)కి భరోసా కల్పించలేని రాహుల్‌గాంధీ ప్రధాని ఆశలు 2019లో తీరటం కష్టమే. 2009లో మొదలైన కలను వాస్తవం చేసుకునేందుకు 2024 దాకా ఎదురుచూడాల్సిన పరిస్థితి రాహుల్‌గాంధీది, ఆయన కలను పంచుకునే కాంగ్రెస్‌వారిది.



## శ్రీ లక్ష్మీనృసింహ స్తుతి

**శ్రీమత్పయోనిధి నికేతన చక్రపాణే**
**భోగీన్ద్ర భోగమణి రాజిత పుణ్యమూర్తే ।**
**యోగీశ శాశ్వత శరణ్య భవాబ్ధిపోత**
**లక్ష్మీనృసింహ మమదేహి కరావలమ్బమ్ ॥**

పాలసముద్రము స్థానముగా కలవాడా! సుదర్శనచక్రము చేతియందు కలవాడా! ఆదిశేషుని పడగలయందలి మణులచే ప్రకాశింపజేయబడిన పవిత్రశరీరము కలవాడా! యోగులకు ప్రభువా! శాశ్వతమైన రక్షకుడా! సంసారమను సాగరము దాటుటకు ఆధారమైనవాడా! లక్ష్మీనృసింహా! నాకు చేయూతనిమ్ము. ❐

## భక్తి ప్రపత్తులు

జనక మహారాజు పొలాన్ని దున్నుతుంటే సీతమ్మ కన్పించిందని శ్రీమద్రామాయణం చెప్తుంది.

దానికి కారణం ఆమెకి సరిపోయినంత భక్తిప్రపత్తుల్ని జనకుడు చూపించాడు కాబట్టీ- భక్తిశ్రద్ధలతో పూజిస్తూ వస్తున్నాడు కాబట్టీ.

ఈ అనుభవాన్నే మనసులో భావించిన ఆంజనేయుడు కూడా తనకి కన్పించాలని అనుకోవలసిందిగా' అమ్మని ప్రార్థిస్తూ'నమోస్తు రామాయ సలక్ష్మణాయ...' అనే శ్లోకం ద్వారా అమ్మని ప్రార్థించాడు. దాంతో ఆమె తన ఉనికిని తెలియజేసింది. కేవలం మన ప్రయత్నం సరిపోదు. అమ్మకి తనకి తాను కనిపించాలనే ఆలోచన కూడా కలగాలి. అలా కలిగేంత భక్తిప్రపత్తుల్ని మనం ఆమెపట్ల చూపించాలి. ❐

## శాంతిభద్రతలు

రామచంద్రుణ్ణి అయోధ్యకి తిరిగి రప్పించాలని భరతుడు బయల్దేరుతుంటే ఆయనతో ఎందరెందరు బయల్దేరారో వివరించాడు వాల్మీకి.

వంతెనలని కట్టగలవారినీ, క్షణాల్లో వేదికని నిర్మించగలవారినీ, వైద్యుల్నీ, రథాలకి మరమ్మతులు చేయగలవారినీ, సైనికుల వస్త్రాలని ఉతికేవారినీ- వెళ్ళబోయే మార్గంలో ఎక్కడ జలాశయాలు,

హింసామృగాలు, ఊబినేలలు, కీడును చేసే పక్షులు, మహా విషతీవ్రత ఉన్న సర్పాలు... ఎలా, ఎక్కడ ఉంటాయో తెలిసినవాళ్ళనీ, గూఢచారుల్నీ, ఆయుధాలకి పదునుపెట్టేవారినీ, వంటవారినీ, గుర్రాలూ, ఏనుగులకీ వైద్యాన్ని చేయగలవారినీ... ఇలా తీసుకెళ్ళాడు భరతుడు.

ప్రాచీనమన్నంతమాత్రాన చేదస్తం హేతుబద్ధతకి నిలువనితనం ఉంటుందని అనేస్తారు అల్పబుద్ధులు. ఇలాటి ఘట్టాలని చదివితే నాటివాళ్ళెంత శాంతి భద్రతలకి ప్రాముఖ్యాన్నిచ్చారో తెలుస్తుంది. ❐

{ అన్నదానం ఆకలిని తీర్చగలుగుతుంది.
అక్షరదానం అజ్ఞానాన్ని తొలగించగలుగుతుంది. }

## కలిధర్మం

పెళ్ళికిముందు అమ్మాయి- తనకి కాబోయే భర్త తనకంటె వయసెక్కువవాడూ- తనకంటె అందమైనవాడూ-తనకంటె ఆస్తిపరుడూ-

తనకంటె ఎక్కువ సంపాదనపరుడూ-తనకంటె తనని ప్రేమించేవాడూ... అని ఇలా అన్ని విషయాల్లోనూ తనకంటె ఎక్కువగా ఉన్నవాడినే వరించాలని అనుకుంటుంది.

తీరా పెళ్ళయినతర్వాత నువ్వూ నేనూ సమానం అనే రాగాన్ని ప్రారంభించి కొంతకాలమయ్యాక నువ్వు నువ్వంటూ సంబోధిస్తూ నాకంటె నువ్వేమాత్రమూ గొప్పకా'వన్నట్లు ప్రతినిత్యం ప్రవర్తిస్తుందిట.

ఇది కలిధర్మమని లక్షల సంవత్సరాల క్రితం వ్యాసమహర్షి చెప్పాడు. ఎంత నిజమో కదా! ❐

## దైవవిశ్వాసం

దేవాలయాలకి వెళ్ళే ఎందర్నో 'ఆ దేవుడి గురించి చెప్పండి' అని అడిగితే ఆ దేవాలయం వెడల్పూ గోపురం ఎత్తూ భక్తుల సంఖ్య- ఇటీవల- దానికి తోడుగా ఆదాయం... ఇలా చెప్పుకుపోతున్నారే తప్ప ఆ దైవం చేసిన ఘనకార్యాలని వందలో తొంభై తొమ్మిదిమందికి చెప్పాలని తెలియదు.

చెప్పదలిస్తే విషయం తెలియదు కూడా.

ఎన్నడుగుల ఎంతెత్తు విగ్రహాన్ని ప్రతిష్ఠించామనేది కాదు, ఆ దైవం గురించి ఎంత ఎందరికి తెలిసిందనేది ప్రధానం. నూరు రూపాయల కాగితాన్ని ఎంతో ఎత్తుగా ఎవరూ ప్రతిష్ఠించరు.

దాన్ని సంపాదించగల తీరుతెన్నుల్ని లోతుగా ఆలోచిస్తారు కదా! కాబట్టి దైవతత్త్వాన్ని తెలిసినట్లైతే దైవవిశ్వాసం శాశ్వతమౌతుంది భక్తుల్లో. ❐

## గొప్పవాళ్ళు

**సువర్ణపుష్పాం పృథివీం చిన్వంతి**
**పురుషాస్త్రయః**
**శూరశ్చ కృతవిద్యశ్చ యశ్చ జానాతి**
**సేవితుమ్॥**

లోకంలో గొప్పవాళ్ళు కావాలంటే అది మూడు జాతులవారికే సాధ్యం అంటోంది శ్లోకం.

శూరత్వం కలవాడూ, బాగా చదువుకుని మెప్పించగలవాడూ- అందర్నీ పొగుడుతూ వాళ్ళని బాగా మచ్చికచేసుకుంటూ దాస్యాన్ని చేస్తూ తన పబ్బాన్ని గడుపుకునేవాడున్నూ- ఈ ముగ్గురికే లోకంలో సర్వం సాధ్యం. ❐

# మంచి తల్లిదండ్రులు



Courtesy : SANANDA

పిల్లలు పదహారేళ్ళకు చేరేసరికి వారి ఆలోచనలన్నీ మారిపోతాయి. అందాక అమ్మ కొంగుపట్టుకుని తిరిగి, నాన్న వెనుక నిలబడే పిల్లలు తాము చాలా పెద్దయిపోయామని భావిస్తారు.

తల్లిదండ్రులు మరింత జాగ్రత్తతో వారి స్నేహితుల వివరాలు, ఎక్కడకు వెళ్తుంది, ఫోన్‌లో ఏం మాట్లాడుతుంది వంటి విషయాల్లో ఇంకొంచెం నిఘా పెంచడం వారికి అస్సలే నచ్చదు.

పిల్లలవయస్సులో, మనస్సులో వచ్చిన ఎదుగుదల అమ్మ గుర్తించినా ఆమెకు వాళ్ళు ఏమీ తెలియని పసిపిల్లలే.

నాన్న గమనించినా వారు తన చాటు బిడ్డలే. తమలోని అయిష్టతను టీనేజర్లు నెమ్మదిగా వెల్లడిచేస్తుంటారు.

టీనేజీలోకి చేరాక చిరాకు, ఊరికే కోపం వచ్చేయడం, అయిష్టత, అంగీకారంవంటి లక్షణాలు వ్యక్తం చేస్తుంటారు. ఒంటరిగా వుండేందుకు ఇష్టపడతారు. స్నేహితులతోనే కబుర్లు చెప్పడానికి మొగ్గుచూపుతారు తప్ప, ఇంట్లో వాళ్ళతో ముచ్చట్లకు సుముఖత చూపరు. వ్యక్తిగత శ్రద్ధ పెరుగుతుంది. అందంపట్ల అదేపనిగా ఓ కన్నేస్తుంటారు. ఇవన్నీ ఇంట్లోని పెద్దలకు రుచించవు.

చిన్నపిల్లల స్థాయి నుంచి టీనేజర్ల స్థాయికి పెరగడమన్నది ఎంత సహజ ప్రక్రియో, ఈ ప్రక్రియలో మానసిక మార్పులూ అంతే సహజం. వారిలోని మార్పుకు అనుగుణంగా పెంపకం టెక్నిక్స్ మారాలి. ప్రీటీనేజ్‌లో తల్లిదండ్రులు చూపే ప్రత్యేక శ్రద్ధ టీనేజీలో వారిని ఓ పద్ధతిలో వుంచేందుకు సహకరిస్తుంది. టీనేజర్ పిల్లలున్న తల్లిదండ్రులు తప్పనిసరిగా కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి.

### ఆప్యాయత

పిల్లల విషయంలో ఆప్యాయత ప్రదర్శించడానికి మించిన మంచి మందు మరొకటి లేదు. మనుగడకు రోజుకో నాలుగు కౌగిలింతలు, మెయిన్‌టెనెన్స్‌కు ఎనిమిది, ఎదుగుదలకు పన్నెండు కౌగలింతలు అవసరమన్నది మానసిక శాస్త్రవేత్తల అభిప్రాయం.

అయితే మరీ చిన్నవయస్సు కాదు వాళ్ళది.

పిల్లలు ప్రీటీన్లలోకి, టీనేజిలోకి వచ్చేశాక వారిని స్పృశించడానికి కొత్త మార్గాలు చూడాలి. వెన్నుపై చేయివేసి నిమరడం, భుజాలపై చేతులు వేయడం వంటి చర్యలు బాగా పని చేస్తాయన్నది సైకాలజిస్టుల అభిప్రాయం.

### కలసి భోజనాలు

టీనేజీలో సక్సెస్ పేరెంటింగ్‌లో తొలిజాగ్రత్త పిల్లలతో వీలయినంత టచ్‌లో వుండడం. ఫోన్లు, ఇతర సామాజిక మాధ్యమాలు, స్నేహితుల ప్రభావం టీనేజర్లపై ఎక్కువగా వుంటుంది.

ఇవన్నీ పిల్లల దృష్టిని ఇతరత్రా మళ్ళింపజేస్తుంటాయి. రోజు మొత్తంలో కుటుంబ సభ్యులందరూ కలసి కూర్చుని చేసే భోజనాలు పెద్దలతో కనెక్ట్ కావడానికి ఉపయోగపడతాయి.

అయితే భోజనాల టైమ్ లెక్చర్ టైమ్ కాదని గుర్తుంచుకోవాలి. భోజనం చేసే సమయంలో స్కూళ్ళు, కాలేజీలు, పరీక్షలు, ఆకుకూరలు తిను,

చిరుతిండ్లు, ఫాస్ట్ ఫుడ్స్ వద్దులాంటి సలహాలు, సూచనలు చెయ్యవద్దు.

ఎదిగే పిల్లలు ఇటువంటి సూచనలు, సిఫార్సులను స్వాగతించలేకపోతారు. డిన్నర్ టేబుల్ వద్ద చెప్పుకునే కబుర్లు తేలిగ్గా, ఫ్రెండ్లీగా సాగాలి.

రాత్రి భోజనం తర్వాత అంతా కలసి కూర్చుని ఏ షోనో చూస్తూ, పిల్లల యాంగ్జయిటీలను అడిగి తెలుసుకుని, అవసరం అయిన సూచనలు,సలహాలు ఇస్తుండాలి. వారి పగటి కార్యక్రమాల గురించి క్యాజువల్‌గా ఎంక్వయిరీ చేయాలి. వారి రొటీన్‌ను యథాలాపంగా అడిగి తెలుసుకోవాలి.

## మంచి పనులు

పిల్లలు తమ తల్లిదండ్రులను పరిశీలిస్తూ, వారిని అనుకరించే యత్నాలు చేస్తుంటారు.

పెద్దలు తమ పిల్లలకు ఏం చేయాలి, ఏం చేయకూడదు అన్న విషయాలు బాగానే చెప్తుంటారు. అవన్నీవారికి బోర్ కొట్టేస్తాయి. వినీ వినీ విసుగనిపించి, ఇక వినడానికే సుముఖత చూపరు.

కాబట్టి విషయాలను పదేపదే వారి ముందు ఏకరువుపెట్టే బదులు తామే ఏం చేయాలో తమ చర్యలద్వారా తెలియజెప్తూ ఓ ఉదాహరణగా నిలవాలి. డ్రైవ్ చేస్తున్నప్పుడు ఫోన్‌కు దూరంగా వుండడం, పిల్లలు ఏది చెయ్యకూడదనుకుంటారో, అవే పనులు తాము చేయకపోవడంలాంటి చర్యలతో ఓ ఉదాహరణగా నిలవాలి.

ఇతరులతో మాట్లాడే తీరుకూడా వారిని ప్రభావితం చేస్తుంటుంది. మంచి పేరెంటింగ్ అంటే మైండ్‌ఫుల్ పేరెంటింగ్ అని గుర్తుంచుకోవాలి.

## స్వతంత్రత

పిల్లలు ఎదుగుతున్నకొద్దీ వారిని స్వతంత్ర వ్యక్తులుగా గుర్తించే ప్రయత్నం చేస్తుండాలి.

పిల్లల ఫ్రెండ్స్‌ను సరదాగా ఇంటికి ఆహ్వానించడంవల్ల పిల్లలసంక్షేమం, సేఫ్టీవిషయాల్లో శ్రద్ధ తీసుకున్నవారవుతారు. వారిని కొద్దిసేపు వీడియోగేమ్‌లు ఆడుకోవడానికి అనుమతించడం, స్నాక్స్ ఇవ్వడం చేస్తుంటే కూల్ పేరెంట్ జోన్ కనపడుతుంది.

అయితే స్నేహితుల్ని ఇంట్లోనే, తమ పర్యవేక్షణలోనే కలవాలనడంవల్ల పిల్లల్లో వ్యతిరేకత ఏర్పడుతుంది. సరదాగా అప్పుడప్పుడు పిలవమని చెప్పాలి. ఇతర పద్ధతుల్లోనూ వారి కార్యకలాపాలను షేర్ చేసుకుంటుండాలి. అది ఫిట్‌నెస్ కావచ్చు, ఇంకేదైనా కావచ్చు. జనరేషన్ గ్యాప్‌ను బ్రిడ్జ్ చేసుకోవడమే ఇక్కడ ప్రధాన విషయం.

పిల్లలు టీనేజీకి చేరాక ఇంట్లో వాదనలు, ఆగ్రహాలు, ఆవేశాలు అడపాదడపా కనపడుతుంటాయి. ప్రీటీనేజీ నుంచి వీటి విషయంలో జాగ్రత్తలు వహిస్తుండాలి. కొన్నిసార్లు వారిని తప్పులు చేయనిస్తేనే, వాటినుంచి నేర్చుకోవడానికి వీలవుతుంది. అంతేకాని తప్పులుచేస్తారన్న భయంతో అనుక్షణం నియంత్రణల చట్రం విధిస్తుంటే, వారిలో ప్రతికూల, వ్యతిరేక భావాలు మరింత పెరుగుతాయి.

## ఓర్పు, సహనం

ప్రతిసారీ తల్లిదండ్రులు తమ అభిప్రాయాలను వారిపై రుద్దాలని ప్రయత్నించకూడదు. వారి అభిప్రాయాలను వెల్లడిచేసే స్వేచ్ఛను వారికి ఇస్తుండాలి. వారిని ఇంతకుముందు మాదిరి మరీ చిన్నపిల్లలుగా చూడవద్దు.

ఇంటికి వచ్చి, ఏ విషయం అయినా స్వేచ్ఛగా మాట్లాడగల భావాలను వారిలో నింపడం అనివార్యం. పిల్లలు ఎదిగేకొద్దీ వారి భావాలకు, వారి వ్యక్తిత్వానికి గౌరవం ఇవ్వడం అవసరం. ఎవరికి అయినా కొన్ని బలాలు, బలహీనతలు వుంటాయి.

ఇష్టాయిష్టాలుంటాయి. వీటన్నింటినీ నాన్-జడ్జిమెంటల్ ధోరణిలో ఎదుర్కోవాలి.

అంటే పెంపకంలో ప్రజాస్వామ్యం అవసరం అన్నమాట. పిల్లలు మంచి నిర్ణయాలు తీసుకునే విధంగా వారిలో కాన్ఫిడెన్స్ పెంచాలి. అప్పుడే వారి వికాసం ఆరోగ్యవంతంగా వుంటుంది.

ఎస్.అనుపమ

సీరియల్

# మనిషి లోని మనిషి

వెనక్కి వచ్చిన చింపాంజీ సాదూభాయ్ శవాన్ని కాళ్ళుపట్టి లాక్కొంటూ గుహలోకి వెళ్ళింది. అది చాలా పెద్ద గుహ.

ఒకప్రక్కగా ఆయుధసామాగ్రి చాలా డంప్ చేసివుంది. పోలీసులుగాని మిలిటరీ గాని కూంబింగ్ ఆపరేషన్‌కొస్తే ఎదిరించడానికి అవసరమైన సామాగ్రి అంతా ఉందక్కడ. రాకెట్ లాంఛర్స్ కూడా ఉన్నాయి. మరోపక్క అనేక అట్ట పెట్టెలు కన్పిస్తున్నాయి. గుహలో చాలా ఫ్యాన్లు తిరుగుతున్నాయి. గుహమధ్యలో విశ్రాంతికి అనువుగా మంచాలు చాలా ఉన్నాయి.

చింపాంజీ శరీరంలోకి పరకాయ ప్రవేశం చేసిన కార్తికేయ అక్కడ ఎక్కువ సమయం వేస్ట్ చేయలేదు. ఆగ్రహంతో మండిపోతూ రంకెలేస్తున్నాడు. గుహ బయటికొచ్చాడు. పక్కన వెహికిల్స్ కోసం నిలువ వుంచిన కొన్ని ఆయిల్ డ్రమ్స్ కన్పించాయి.

తనకు మెషిన్‌గన్ ఇచ్చిన సెంట్రీ శవంవద్ద మూడు బుల్లెట్స్ మేగజైన్స్ దొరికాయి. వాటితోబాటు కొన్ని హ్యాండ్ గ్రనేడ్స్‌ని సంచిలో వేసుకుని భుజానికి తగి లించుకుంది. ఒక ఆయిల్ డ్రమ్‌ని గుహలోపలికి



దొర్లించింది. మరోటి శవాల మీదకు దొర్లించింది.

ఆదే సమయంలో కొండ వెనకపక్క వున్న అరడజను మంది ప్రేలుడు శబ్దాలు విని ఏం జరుగుతుందో తెలుసు కోడానికి వాళ్ళంతా గన్స్ ఊపుకుంటూ పరుగెత్తు కొస్తున్నారు. వాళ్ళు షెడ్డులోకి వస్తూండగా చెట్ల వెనక దాక్కున్న నలుగురికీ ప్రాణం లేచివచ్చినట్ట యింది. "కాల్చేయండి. ఆ చింపాంజీని కాల్చి చంపండి" అనరుస్తూ హెచ్చరించారు వాళ్ళని.

అప్పుడే వస్తున్న ఆరుగురికీ చింపాంజీ ఏంటో కాల్చి చంపటం ఏంటో అర్థంగాక షెడ్‌లోకి వచ్చేశారు. వాళ్ళను చూసీచూడగానే మెషిన్‌గన్‌తో కాల్చి చంపే సింది. అదే వేగంలో గన్‌ని నేలపై దొర్లేసిన ఆయిల్ డ్రమ్స్‌వైపు తిప్పింది.

ఒక్కసారిగా ఆయిల్ అంటుకుని భగ్గున లేచాయి మంటలు. అంతే తిరిగి చూడకుండా చెట్లలోకి దూరంగా పరుగు ఆరంభించింది చింపాంజీ.

మంటలు గుహలోకి వ్యాపించగానే ఏం జరుగు తుందో అక్కడ బ్రతికున్న నలుగురికీ తెలుసు. ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకుని మరో దిక్కుగా పారి

E-mail: Suryadevaranovelist@gmail.com

సూర్యదేవర రామ్‌మోహనరావు





పోనారంభించారు. వాళ్ళు నదీతీరం వెంట దక్షిణంగా పరుగుతీస్తున్నారు. కాని చింపాంజీ చెట్లపైకెక్కి కొమ్మల వెంట దూకుతూ పశ్చిమంగా కొండ వెనక తట్టు దూసుకుపోతోంది.

మంటలు లేచిన రెండో నిమిషంలో మొదటి ప్రేలుడు సంభవించింది. మరో నిమిషంలో తర్వాత రెండో ప్రేలుడు శబ్దం విన్పించింది.

ఇక ఆ తర్వాత వరస ప్రేలుడు శబ్దాలతో ఆ ప్రాంతం హోరెత్తిపోనారంభించింది. సరిగ్గా అయిదో నిమిషంలో సంభవించింది అతిపెద్ద విస్ఫోటనం.

కొన్ని కిలోమీటర్ల దూరం వరకు విన్పించే భయంకరమైన ప్రేలుడు. భూమి కంపించింది. కొండ గుహ ప్రేలిపోయింది. రాళ్ళు కుప్పగా మారుతోంది.

గుహ ముందు షెడ్డు నిర్మాణం కూలిపోయింది. దట్టమైన పొగలు మంటలు సుడులు తిరుగుతూ ఆకాశానికి ఎగశాయి. అక్కడపడున్న శవాలు కాలిన బూడిదయినా మిగులుతుందో లేదో తెలీదు. సాదూభాయ్ శవం ఐడెంటిటీ మిగలకుండా పాస్‌పోర్ట్‌తోసహా దగ్ధమైపోయినట్టే.

మొదటి భారీ విస్ఫోటనం శబ్దం దిక్కులవెంట మారుమ్రోగటం ఆగకముందే అలాంటిదేదో మరో విస్ఫోటనం. గుహ పైభాగం మొత్తం కూలిపోగా ఎగసిన కొండరాళ్ళు దుమ్ముధూళి ఒడిసేలతో విసిరి కొట్టినట్టు అడవిలో చాలాదూరం వచ్చి పడుతున్నాయి. ప్రేలుడు శబ్దాలతో అడవి దద్దరిల్లుతోంది.

అడవి జంతువులు కకావికలై దిక్కులుపట్టి పారిపోతున్నాయి. అసలే చింపాంజీ తోకలేని జాతి కోతి. అందులోకి పరకాయ ప్రవేశం చేశాడు కార్తికేయ.

మనిషి బుద్ధితోబాటు కోతి బుద్ధికూడా కలగలసిన పరిస్థితి. కోతి జీవితం అంతా కొత్తగా ఉంది. చెట్లకొమ్మల వెంట వేలాడుతూ దూకుతూ ప్రేలుళ్ళకు దూరంగా కొండ వెనక ప్రాంతం అడవిలోకి

## జరిగిన కథ 28

సుదీపకు బలవంతంగా నిమ్మరసం ఇచ్చి నిరాహారదీక్షను విరమింపచేస్తారు పోలీసులు. పాబ్లోరైట్‌హ్యాండ్ పీటర్,సాదూభాయ్ రూపంలో వున్న కార్తికేయను కలుస్తాడు.

పీటర్ భార్య లూసీ సాదూభాయ్ మీద మోజుపడుతుంది. దట్టమైన కొలంబియా అడవుల్లోని పాబ్లో స్థావరానికి పీటర్‌తో సహా బయల్దేరతాడు సాదూభాయ్ వేషంలో వున్న కార్తికేయ. పాబ్లోని అతని అనుచరులందర్నీ కాల్చి పారేస్తాడు కార్తికేయ.

సాదూభాయ్ శరీరాన్ని వదిలేసి అక్కడ చచ్చిపడివున్న ఓ చింపాంజీ శరీరంలోకి ప్రవేశించి ఫైరింగ్ మొదలుపెడతాడు కార్తికేయ. చాలామందిని చంపేయడంతోపాటు అక్కడ వున్న మోటరుబోట్లను కూడా పేల్చేస్తుందా చింపాంజీ. ఇక జరిగేది చదవండి.



# చిలిపి

**గతించినదానికోసం ఎందుకు? భవిష్యత్తు గురించి ఆలోచించమని చెప్పినా వినవివారెవరు?**
చిత్రకారులు.

**కాపురం చల్లగా ఉండాలంటే?**
ఇంట్లో ఐస్‌ఫ్యాక్టరీ పెట్టుకుంటే సరి.

**అతిజాగ్రత్తపరుడంటే ఎవరు?**
దినపత్రికకు అట్ట వేసేవాడు.

**ప్రేయసీప్రియులు ఎందుకు చాటుమాటుగా కలుసుకుంటారు?**
వాళ్ళ పెద్దలు చూస్తే తక్షణం వారికి పెళ్ళి జరిపించేస్తారని.

**ఆకాశవాణిలో మాట్లాడాలంటే ఎక్కువమంది ఇష్టపడతారు. దేనికి?**
ఏం మాట్లాడినా చెప్పులు, రాళ్ళు పడే అవకాశం లేదుగనక.

**మన దేవతలు, దేవుళ్ళు కొండలపైనా, అడవులలోనా వెలుస్తారెందుకు?**
వాతావరణ కాలుష్యానికి భయపడి.

**మొగుడికి నచ్చనిది, పెళ్ళానికి నచ్చేది ఏది?**
పక్కింటావిడ చీర.

పారిపోతోంది. అటుగా ఎదురైన పాబ్లో మనుషుల్ని నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపేస్తోంది.

కొంతదూరం వెళ్ళేసరికి బాటమీద పీటర్ కన్పించాడు. భారీ విస్ఫోటనాలకు బెదిరి జీప్ ఆపి పక్కన నిలబడి కొండ వంక చూస్తున్నాడు. అదే జీప్‌లో తను పీటర్ వెంట ఇక్కడికొచ్చాడు.

పీటర్‌ని వదిలేయాలని మనసులో ఉంది. వారం రోజులు న్యూవేలీలో అతడి ఆశ్రయంలో ఉన్నాడు. కాని వదిలేస్తే పాబ్లో స్థానంలోకి పీడొస్తాడు. మరో మాఫియా డాన్ తయారవుతాడు. తుడిచేయక తప్పదు. మొత్తం తుడిచేయాలి.

నోటితో సేఫ్టీ పిన్ పీకి వెంట వెంటనే రెండు హ్యాండ్‌గ్రనేడ్స్‌ను జీప్‌మీద ప్రయోగించింది. గ్రనేడ్స్ తాకిడికి జీప్ తునాతునకలుగా ప్రేలిపోగా గడ్డిబొమ్మలా గాల్లోకి ఎగిరిన పీటర్ శరీరం గింగిరాలు తిరుగుతూ పోయి ఒక కొండరాయిని గుద్దుకుంది. తల పగిలి ప్రాణాలు వదిలేశాడు.

వెనకే ఎగువనుంచి పరుగెత్తుకొస్తున్నవాళ్ళు పీటర్ జీప్ పేలిపోవటం చూశారు. అరుపులు కేకలు హెచ్చరించుకుంటూ వచ్చేస్తున్నారు.

ఒకరు కాదు, ఇద్దరు కాదు చాలామంది. గుంపులు గుంపులుగానూ వెహికిల్స్ మీద వచ్చేస్తున్నారు. ఇక మొదలైంది చింపాంజీ వీరవిహారం.

దొరికినవాడిని దొరికినట్టు తన మెషిన్‌గన్‌కు బలిపెడుతోంది. చెట్లపైనుంచి కాల్పులు ఏమిటో ఎవరు జరుపుతున్నారో అర్థంగాక వాళ్ళు గన్స్ ఎక్కుపెట్టేలోపే లైట్‌మెషిన్‌గన్ నుంచి వర్షంలా దూసుకొస్తున్న బుల్లెట్లకు నేలకొరిగిపోతున్నారు.

నాలుగు వందల మీటర్ల దూరం వరకు బుల్లెట్ల రేంజ్ ఉండటంతో చింపాంజీని చూసే అవకాశం కూడా లేకపోయింది వాళ్ళకి. బైక్‌మీద వస్తున్న ఒకడ్ని కాల్చి చంపి వాడి బైక్ ఎక్కిన చింపాంజీ ఎదురుపడిన వాళ్ళని నిర్దాక్షిణ్యంగా అంతం చేస్తూ నేరుగా డ్రగ్స్ తయారీ యూనిట్లవైపు బయలుదేరింది.

కొలంబియా నుంచి యూఎస్ఎ మిలటరీ హెలికాప్టర్ ఒకటి వాషింగ్‌టన్‌కు బయలుదేరి వెళ్తోంది. మొదటిసారిగా ప్రేలుడు శబ్దం వింది హెలికాప్టర్‌లోని మిలటరీ జవాన్లు. అడవిలోకి చూస్తుండగానే రెండో ప్రేలుడు శబ్దం భీకరంగా వినవచ్చింది.

దూరంగా కొండ ప్రేలి అగ్ని పర్వతం పగిలి లావా పొగమంటలు ఆకాశానికి వెదజల్లుతున్నట్టు పైకి లేచిన మంటలు చూసి ఆశ్చర్యచకితులయ్యారు.

**భారత ఆక్రమిత కాశ్మీర్... అనే ప్రాంతం భారతదేశ పటంలో ఎక్కడా లేదు.**
-సుష్మాస్వరాజ్, కేంద్రమంత్రి



ఆ కొండ ఎందుకు ప్రేలిపోతోందో అక్కడ ఏం జరుగుతోందో మొదట ఏమీ అర్థంకాలేదు. అయితే ఆ ప్రాంతపు అటవీభాగం ఆ కొండలు అంతా డ్రగ్ కింగ్‌గా ప్రసిద్ధిపొందిన పాబ్లోసామ్రాజ్యమనితెలుసు. కాని వాడిమీద ఇంతవరకు ఒక్క కేసుకూడా నమోదు గాకపోవటం విశేషం. ఆధారాలు దొరక్కుండా అంత జాగ్రత్త వహిస్తాడు. వందలాదిమంది వాడి చేతికింద పనిచేస్తున్నారు.

ఆ కొండల్లోనే ఎక్కడో వాడి స్థావరం ఉండొచ్చని ఎప్పట్నుంచో ఊహిస్తున్నారు. మిలటరీగాని కొలంబియా పోలీసులుగాని ఇంతవరకు వాడి ఆట కట్టించలేకపోయారు. దాడికి వ్యూహరచన చేసిన ప్రతిసారీ ఆ విషయం ముందుగానే వాడికి తెలిసిపోతుంది.

ప్రతివ్యూహంతో రెడీగాఉంటాడు.దాడుల్లో చాలామంది చనిపోవటం జరిగింది.అలాంటి చోటప్రేలుళ్ళు సంభవించటం ఆశ్చర్యపరిచింది.

ఏం జరుగుతుందో చూడాలనే ఉద్దేశంతో హెలికాప్టర్ దారి మళ్ళించి వెంటనే కొలంబియా మిలటరీ బేస్‌ని కాంటాక్ట్ చేసి రిపోర్ట్ చేశారు.

మరుక్షణం బయలుదేరాయి మిలటరీ హెలికాప్టర్లు అనేకం. వారికి పోలీసులు కూడా తోడయ్యారు. ఈలోపల - ప్రేలుళ్ళు సంభవిస్తున్న కొండ సమీపంలోకి పోకుండా అరకిలోమీటరు దూరంలో చక్కర్లు కొడుతున్న హెలికాప్టర్‌లో జవాన్లకు పశ్చిమ దిక్కు నుంచి పరుగులెత్తుకొస్తున్న అనేకమంది కన్పించారు. వాళ్ళ చేతుల్లో గన్స్ మాత్రమే ఉన్నాయి.

ఒకచోట తగలబడుతున్న జీప్ కన్పించింది. ఆ ప్రాంతాల్లో చెల్లాచెదురుగా అనేక శవాలు కన్పిస్తున్నాయి. ఇంతలో -

"ఓ మై గాడ్... సీ దేర్" అనరిచాడో జవాను.

మెషిన్‌గన్‌తో ఎదురైనవాళ్ళని కాల్చి చంపుతూ మోటార్ బైక్‌మీద వేగంగా పోతున్న చింపాంజీని చూశాడు వాడు. అది ఎగువ కొండవైపు పోతోంది. దాని సాహసం చూసి నోరు వెళ్ళబెట్టేశారంతా.

చూస్తోంది కలోనిజమో అర్థంకాలేదు.

ఈ విధ్వంసానికి ఓ చింపాంజీ కారణమంటే నమ్మలేకపోతున్నారు. దాన్ని ఫాలో చేస్తూ వీడియో కెమెరాతో షూట్ చేయనారంభించారు.

సర్కస్‌లో ఫీట్స్ చేసిన చింపాంజీలు తమకు తెలుసు. కాని ఇలా ఒక హీరోలా బైక్ నడుపుతూ కాల్పులు జరిపే చింపాంజీని చూడ్డం ఇదే తొలిసారి. అదినేరుగావెళ్ళి మాదకద్రవ్యాల తయారీ యూనిట్స్ వున్న షెడ్లమీద గోడౌన్ల మీద పడింది.

గ్రనేడ్స్ విసిరి మెషిన్‌గన్‌తో కాల్పులు జరిపి విధ్వంసం సృష్టించింది.

కోట్లవిలువ చేసే స్టాక్‌వున్న గోడౌన్స్‌తో పాటు యూనిట్స్ తాలూకు షెడ్లు అగ్ని కీలలకు ఆహుతికాసాగాయి.

మిలటరీ హెలికాప్టర్ రాకను గమ

నించటంతో ఇక తన డ్యూటీ ముగిసినట్టు భావించింది చింపాంజీ. అంతటితో శాంతించింది. బైక్‌మీద కొంతదూరం వెళ్ళి దాన్నక్కడ వదిలేసి చెట్లకొమ్మల్లోకి వెళ్ళిపోయింది. తర్వాత అది ఏమైందో హెలికాప్టర్‌లో వాళ్ళకి కనిపించలేదు.

చెట్లకొమ్మల వెంట దూకుతూ ఆ చింపాంజీ దక్షిణంగా చాలాదూరం వెళ్ళిపోయింది. అంతలో పేలుళ్ళ శబ్దాలకి భయపడి పారిపోతున్న చింపాంజీల గుంపు ఒకటి దాని కంటబడింది. తనూ ఆ గుంపులో కలిసిపోయి మరికొంత దూరం వెళ్ళిపోయింది.

ఈలోపల -

కొలంబియా ఎయిర్‌బేస్ నుంచి బయలుదేరిన పాతిక హెలికాప్టర్లు సంఘటనా ప్రాంతానికి చేరుకున్నాయి.కిందకుదిగిన జవాన్లు పోలీసులుగుంపులు గుంపులుగా పారిపోతున్న పాబ్లో మనుషుల్ని తరిమి తరిమి రౌండప్ చేసి బంధించనారంభించారు. ఎదురుతిరిగినవాళ్ళని కాల్చి చంపారు.

అందివచ్చిన అవకాశాన్ని వదులుకునే ఉద్దేశం భద్రతా బలగాలకు లేదు. వీళ్ళమూలంగా ఎందరో పోలీసులు, జవాన్లు వీరమరణం పొందారు. డ్రగ్ మాఫియా డాన్ సామ్రాజ్యం కూలిపోయినట్టే.

సుమారు ఏడువందలమంది వివిధశాఖల్లో పని చేస్తున్నారు. వాళ్ళలో ప్రాణాలతో చిక్కింది కేవలం నూట నలభైమంది మాత్రమే. వాళ్ళలో కట్టెలు కొట్టిన నలుగురూ కూడా ఉన్నారు.

వాళ్ళ సెల్‌ఫోన్లు స్వాధీనం చేసుకున్నారు. వాళ్ళిచ్చిన సమాచారం కూడా చాలా అమూల్యమైంది. ఇంకా తొలిసారిగా సాదూభాయ్ జరిపిన కాల్పుల్లోంచి తప్పించుకున్న ముగ్గురు దొరికారు. వాళ్ళిచ్చింది కూడా చాలా కీలకమైన సమాచారం.

వాస్తవానికి సాదూభాయ్ మరణించటంతో పోరు నిలిచిపోవాలి. కాని నాలుగ్గంటలక్రితం వచ్చినమూడు చింపాంజీల్లో ఒకటి బ్రతికొచ్చి ఇంత విధ్వంసం సృష్టించిందంటే నమ్మలేకపోతున్నారు.

సాయంత్రానికి ఇరవై ట్రక్కుల్లో పోలీసుబలగాలు అదనంగా వచ్చి చేరాయి. హెలికాప్టర్లలో చుట్టి చూస్తుంటే ఎటుచూసినా శవాల గుట్టలు కన్పిస్తున్నాయి. ఎగువన కొండవాలు వెంట లోయల్లోనూ అనేక ఎకరాలు సాగుచేయబడిన గంజాయి నల్లమందు ఇతర విషపుమొక్కలు ఏపుగా పెరిగిన దృశ్యం కన్పించింది.

వాటన్నిటినీ ధ్వంసంచేయాల్సివుంది. ప్రేలుళ్ళు ఆగితేగాని శిథిలాల కింద ఏమన్నా సమాచారం దొరుకుతుందేమో చూడాలి. రాత్రికి మైదాన ప్రాంతంలో నెగళ్ళు మండించి గుడారాలు లేపి విడిది చేశారంతా. కూలిన కొండ శిథిలాల్లోంచి ఆగి ఆగి రాత్రంతా ప్రేలుడు శబ్దాలు విన్పిస్తూనే ఉన్నాయి.

కార్తికేయ పర్లాకిమిడి జైలునుంచి పారిపోయి నెలరోజులు దాటింది. పోలీసులు ఇంకా అతడికోసం గాలిస్తూనే ఉన్నారు. అదే సమయంలో ప్యాలెస్‌లోని రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్ తనమేనల్లుడు కార్తికేయ రాక కోసం వేయికళ్ళతో ఎదురుచూస్తున్నాడు.కార్తికేయ ప్రాణప్రదమైన మరదలు రాకుమారి మేఘనా సౌందర్యానంద సహనాదేవి ఉరఫ్ సంజనాలో ఎలాంటి మార్పులేదు. చిక్కి సగమైంది.

ద్రవాహారం ఇస్తూ కోమాలోని రాకుమారిని కాపాడుకుంటూ వస్తున్నారు డాక్టర్స్. కార్తికేయ నుంచి ఫోన్ లేదు. ఎక్కడ ఉన్నాడో ఏమయ్యాడో తెలీక రాజావారు ఆందోళన చెందుతున్నారు.

ఇక్కడిలా ఉండగా అక్కడ ఢిల్లీలోని మేడమ్‌సుదీప కూడా సాదూభాయ్ రాకకోసం ఎదురుతెన్నులు చూస్తోంది. మందాకిని ఇచ్చిన ఐడియా ప్రకారం డ్రైవర్ దీనారామ్‌ని నిలదీయగానే అసలు తామంతా పర్లాకిమిడి ఎందుకెళ్ళారో ఏం జరిగిందో అన్ని విషయాలూ పూసగుచ్చినట్టు వివరించాడు.

దాంతో ఒక సందేహం ఆమెను పీడిస్తోంది. సాదూభాయ్ తిరిగివస్తేగాని తన ప్రశ్నలకు సమాధానాలు దొరకవు. అందుకే ఆమె కూడా ఆత్రంగా చూస్తోంది. ఈ ఇద్దరూగాక మరో వ్యక్తి కూడా కార్తికేయ సమాచారం కోసం ఎదురుచూస్తున్నాడు.

అతను వేరెవరో కాదు, శ్రీ కుమారశక్తి పీఠాధిపతి స్వామి సత్యానంద. అల్పునికి అన్నీ అల్పబుద్ధులే అన్నట్టుగా ఒక పవిత్ర పీఠానికి అధిపతి అయివుండి, భక్తిమార్గంకన్నా రక్తిమార్గం అనుసరిస్తూ ధనదాహంతో ఉన్న సత్యానంద కంటిమీద కునుకు లేకుండా గడుపుతున్నాడు. అందుకు కారణం కార్తికేయ. కార్తికేయ తప్పించుకు పారిపోకుండా జైల్లోనే ఉండుంటే ఇంతగా ఆలోచించేవాడు కాదేమో.

కాని అతను పారిపోవడంతో సందేహాలు

## మేకప్‌కు మూడేసిగంటలు

సావిత్రిగా కీర్తిసురేష్ నటించలేదు, జీవించింది అంటూ ప్రశంసల జల్లు కురుస్తోంది. దీనిపై కీర్తి స్పందిస్తూ, తన షూటింగ్ అనుభవాలను గుర్తుచేసుకున్నది. "నాకు మేకప్ టెస్ట్ చేసినప్పుడే సావిత్రి పోలికలకోసం ఏమేంచేయాలో మా మేకప్ ఆర్టిస్టులకు అర్థం అయింది. మేకప్ వేయడానికి మూడు గంటలు సమయం పట్టేది.

తిరిగి తీయడానికి మరో మూడుగంటలు పట్టేది. కేవలం కనుబొమ్మలకోసమే అరగంట పట్టేది. మేకప్ చేసే మూడుగంటల్లో ఏదైనా తినడానికి కూడా నోరు తెరవడానికి వీలయ్యేది కాదు. సెట్ మీదకు వెళ్ళగానే కష్టం అంతా మర్చిపోయేదాన్ని" అంటూ మెరిసే కళ్ళతో చెప్పింది కీర్తి.





మొదలై నిలవనీయటంలేదు. తన చేతులకు మట్టి అంటకుండా, ఒకరు తనను వేలెత్తి చూపకుండా పర్లాకిమిడి సంస్థానాన్ని ఆక్రమించుకోవాలను కున్నాడు. కార్తికేయ అరెస్ట్ వరకు అంతా సవ్యంగానే జరిగింది. సమస్య అతను జైలునుంచి ఎస్కేప్ అయి నప్పట్నుంచి మొదలయింది.

ఏమో... వాడు సాధిస్తాడేమో.... రాకుమారిని బ్రతికిస్తాడేమో.... ఇదే శంక సత్యానంద అంతరంత రాల్లో పీడిస్తూనే ఉంది. నిలువనీయటంలేదు.

అక్కడికీ వేలంచేరి వెళ్ళి ప్రయోగం చేసిన మంత్ర వాది భైరవేశ్వర్‌ను కలిశాడు. కాని అతడి ధైర్యవచ నాలు ఊరటనివ్వటంలేదు. ఏదోటి చేయాలి. లేక పోతే సంస్థానం చేజారిపోయేలా ఉందనిపిస్తోంది.

మనిషిచేసే ఒక తప్పు అనేక తప్పులు చేయటానికి దారితీస్తుంది. సత్యానంద విషయంలోనూ అదే జరిగింది. అతను ఆలోచించగా తన సమస్యకు ఒకటే పరిష్కారమనిపించింది.

అది రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్‌మరణం. ఆయనే పోతే అక్కడ మిలటరీ ప్రొటెక్షన్ ఉండదు. ఆలనా పాలనా సరిగా చూసేవారు లేక రాకుమారి ఈలోపలే మరణిస్తుంది. కార్తికేయ తిరిగి పర్లాకిమిడిలో కాలుపెట్టేసరికి తండ్రీ కూతుళ్ళు ఇద్దరూ ఉండకూడదు. అప్పుడిక తనకు అడ్డుండదు.

ఇలా ఆలోచించిన స్వామి సత్యానంద - సమర్థులని భావించి ఆ రోజు సూర్యప్రకాశవర్మ, కృష్ణశాస్త్రిలను హతమార్చిన ఇద్దరికీ తలో పదిలక్షల రూపాయలు ఇచ్చి పవర్‌ఫుల్ గన్ విత్ బైనాక్యులర్ ఇచ్చి పర్లాకిమిడి పంపించాడు. వాళ్ళు ప్రయాణమై వెళ్ళాక గాని ఆ రాత్రి ప్రశాంతంగా నిద్రపోలేకపోయాడు.

స్వామి సత్యానంద తీసుకున్న ఈ నిర్ణయం ఏ పరిణామాలకు దారితీస్తుందో వేచిచూడాల్సిందే

గుంపులో గోవిందా అన్నట్టుగా - చింపాంజీల మందలో కలిసిపోయి అడవిలో తిరుగుతున్న కార్తికేయ చాలా ఆత్రపడుతున్నాడు. ఈ చింపాంజీ బ్రతుకునుంచి త్వరగా బయటపడాలనుంది.

పాబ్లోని, వాడి డ్రగ్ మాఫియా సామ్రాజ్యాన్ని నేల మట్టం చేయటంతో అక్కడ తమ పనులు ముగిశాయి. ఇక మిగిలింది తన సంజనాను కాపాడుకోవటం. తను త్వరగా నికరాగ్వా దేశం చేరుకోవాలి.

కాని అంతదూరం ఇలా చింపాంజీ కాయంతో ప్రయాణం చేయలేడు. అర్జంటుగా తనకు కావలసింది సలక్షణమైన ఒక మానవశరీరం. దిక్కూమొక్కూ లేని కీకారణ్యంలో తనకి అనువైన శవం ఎక్కడ దొరుకుతుంది?

పళ్ళు కాయ కసర్లు తిని చెట్లకొమ్మలమీద కాల క్షేపం చేస్తూ వారంరోజులపాటు అడవి చింపాంజీ మందతో గడిపాడు. అసలే ప్రమాదాలకు నిలయమైన ఘోరాడవి అనుకుంటే అంతకన్నా ప్రమాదంముంచు కొచ్చే సూచనలు కన్పించాయి.

గుంపులో పోతరించిన మూడు ఆడచింపాంజీలు తనతో జతకట్టాలని వన్నెచిన్నెలు చూపుతూ వెంట బడుతున్నాయి. అది గమనించిన గుంపులోని మగ చింపాంజీలు తన వంక గుర్రుగా చూస్తున్నాయి. మరో అంతర్యుద్ధం మొదలయ్యే ప్రమాదం ఉంది. అవన్నీ తనమీద దాడిచేయకముందే వాటికి దూరంగా వెళ్ళిపోవటం మంచిదనిపించింది.

అంతే చెట్లపైన కొమ్మల్ని కౌగిలించుకుని నిద్ర పోతున్న చింపాంజీ తండా లేకవముందే అక్కడ్నుంచి బయటపడింది.

తూర్పుదిక్కుగా ఒంటరిగానే రెండు దినాలు ప్రయాణం చేసి నదీతీర ప్రాంతానికి చేరుకుంది. ఏపుగా పెరిగిన వటవృక్షం దిగువ కొమ్మమీదకూర్చుని సుడులు తిరుగుతూ ప్రవహిస్తున్న నదిలోకి చూస్తూ తీవ్ర ఆలోచనల్లో కూరుకుపోయింది. చింపాంజీలోని కార్తికేయ ఆందోళన చెందుతున్నాడు.

ఏమి జీవితం ఇది?

ఒకే జన్మలో ఏడేడు పధ్నాలుగు జన్మల అనుభవాలను చవిచూసినవారు ప్రస్తుతకాలంలో ఎవరన్నా ఉన్నారురా అంటే అది తానేనని చెప్పుకోవాలి. ఎవరితో చెప్పినా కూడా నమ్మని సత్యం ఇది.

గురుదేవుడు మణిసిద్ధులవారు దయతో పర కాయ ప్రవేశవిద్యను అనుగ్రహించినప్పట్నుంచి ఎన్ని సార్లు శరీరాలు మారాడు.

ముందుగా కప్పలో, తర్వాత పాములో ప్రవేశించాడు. మూడోసారి చిరుతపులిలో ప్రవేశించాడు. తర్వాత సాదూభాయ్‌లో ప్రవేశించి ఢిల్లీ చేరాడు.

పోలీసుల నుంచి తప్పించుకోడానికి చచ్చిన బల్లిలో ప్రవేశించాడు. తర్వాత తిరిగి సాదూభాయ్‌లో ప్రవేశించి అమెరికా చేరుకున్నాడు.

ఇప్పుడు చింపాంజీలో చేరాడు. ఇంకా నికరాగ్వా చేరుకోలేకపోయాడు. ఇంకా ఎన్ని శరీరాలు మారిస్తే తను లక్ష్యాన్ని చేరుకోగలడో అర్థంగావటంలేదు.

అటుచూస్తే ప్రాణసఖి మంచానపడి రెండోనెల నడుస్తోంది. ఆమెకు త్వరగా విడుదల కల్పించాలి... ఎలా....? ఏం చేయాలి?

ఏం చేస్తే ఇక్కడ్నుంచి త్వరగా తను బయటపడ గలడు?వెదికితే అడవిలో చచ్చిన జంతుజాలం చాలా కన్పిస్తుంది. కాని అవి తనకు పనికిరావు.

ఆ రూపంలో మానవసమాజాల్లోకి పోలేడు. ఇంకేదో కావాలి. కష్టాలనుంచి గట్టెక్కించే ప్రాణి శరీరం. అది ఎక్కడ లభిస్తుంది?

దిక్కుతోచని పరిస్థితిలో కళ్ళుమూసుకుని మన సులోగురుదేవుడు మణిసిద్ధుని తలుచుకుని ఏకాగ్ర చిత్తంతో తనకోదారి చూపమని ప్రార్థించింది.

అప్పుడు....సరిగ్గా అప్పుడు.... దబ్బున ఏదో కిందపడ్డ చప్పుడు విన్పించింది. కళ్ళు తెరిచి చూస్తే అదో చచ్చిన కొంగ. పెద్ద కొంగ - తెల్లటి కొంగ.

రెక్కల వెంట బూడిదరంగు చారలు ఉన్నాయి. తనకో మార్గం చూపించమంటే కొంగను చూపించాడు గురుదేవుడు. అంటే కొంగ శరీరంలోకి పర కాయప్రవేశం చేయమనా. గబగబా చెట్టు దిగి దగ్గరకి వెళ్ళి చూసింది చింపాంజీ.

**ఇంకా ఉంది**

## ఇక్కడివారంటే ఇష్టం

**బా**లీవుడ్ వెళ్ళి మళ్ళీ తిరిగి వచ్చేసిన పూజా హెగ్డెను ఎందుకిలా? అని అడిగితే తెలుగు చిత్ర పరిశ్రమ అంటే ఎనలేని అభిమానం అంటూ నవ్వేస్తున్నది. "నేను తెలుగు సినీపరిశ్రమను వదల్లేను. ఇక్కడి ప్రేక్షకులు ప్రత్యేకమైన వాళ్ళు.

సినిమాలు ఇష్టపడతారు. నేను బాలీవుడ్ వెళ్ళక ముందు ఇక్కడ రెండు సినిమాలు మాత్రమే చేశా. అయినా ఎక్కడకు వెళ్ళినా నా గురించి, నా సినిమాల గురించి మాట్లాడుకునేవారు.

ఇంతటి అభిమానం కోసమే నేను తిరిగి వచ్చేశా" అని చెప్పింది పూజా హెగ్డె.

**నా తల్లి పుట్టింది ఇటలీలో అయినా జీవితంలో త్యాగాలు చేసింది భారతదేశంలోనే.**

-రాహుల్‌గాంధీ, కాంగ్రెస్ అధ్యక్షుడు



పర్సనల్ ఎజెండా

# ప్రియాబెనర్జి

హిందీ, తెలుగు, తమిళ పరిశ్రమల్లో పరిచితురాలైన ప్రియాబెనర్జి తన వ్యక్తిగత విశేషాలు, అభిప్రాయాలను చెప్పింది.

▸ **ఫోటో షూట్‌లలో నచ్చనిది :** పోజింగ్. సెల్ఫీల గురించి మాట్లాడడం బావుంటుంది. కెమెరాముందు నటించడం బావుంటుంది. కాని, ఫోటోషూట్‌ల విషయానికి వస్తే ఏం చేయాలో తెలియదు

▸ **ఎటువంటి పార్టీలు ఎంజాయ్ చేస్తానంటే :** క్రేజీ లౌడ్ పార్టీలు నచ్చవు. సరదాగా వుండే సంగీతం వింటూ, మంచి కబుర్లు చెప్పుకునే పార్టీలు ఇష్టం. రాత్రంతా డ్యాన్స్ చేయాల్సివస్తే, నా బాలీవుడ్ పాటల్ని అందుకు ఎంజాయ్‌చేస్తుంటా

▸ **శరీరాన్ని అందంగా ఉంచుకోవడానికి :** నేనంతగా ఫిట్‌నెస్ ఫ్రీక్ కాదు. ప్రతిరోజూ వర్కవుట్లు చెయ్యను. నేను ఇష్టపడేవి తినేస్తుంటా. డైటింగ్ చెయ్యను. అయితే, మరీ ఎక్కువతిన్నానని ఫీలయినప్పుడల్లా రన్నింగ్ చేస్తుంటా.

వేపుడు పదార్థాలు, చిరుతిండ్లు నచ్చవు. కాబట్టే అదనపు క్యాలరీలనుంచి కాపాడుకుంటున్నానేమో. ఇంట్లో తయారుచేసే పదార్థాలే ఇష్టం

▸ **నేను చేసిన సాహసాలు :** ఎన్నో. నాలుగేళ్ళక్రితం కెనడానుంచి ఇండియా వచ్చేసి మొదటిసారి ఇంటికి దూరంగా, పర్యవేక్షణలేకుండావుండడం ఓ సాహసం. కొన్ని పరిస్థితుల్లో అందరం ఏవో ఒక సాహసాలు చేసేస్తుంటాం. అవన్నీ నేనిక్కడ చెప్పలేను

▸ **నా దృష్టిలో రిలేషన్‌షిప్‌లో చేసే వరస్ట్ విషయం:** అబద్ధాలు చెప్పి, మోసం చేయడం. నిజాయితీ తప్పనిసరి. మోసం, అబద్ధాలు అస్సలు వుండకూడదు. అదృష్టవశాత్తూ నాకు అటువంటి అనుభవాలు లేవు. భవిష్యత్‌లో అలాంటివి జరగవనే ఆశిస్తున్నాను

▸ **సహనటులతో క్రష్ :** ఏదీ లేదు

▸ **కలసి పనిచేయాలనుకునేది :** ఏదో ఒకరోజు షారుక్‌ఖాన్‌తో. నేను పుట్టినప్పటినుంచి అభిమానించే వ్యక్తి. రణవీర్‌సింగ్‌కూడా ఇష్టం

▸ **నాలోని ఉత్తమ ఎసెట్ :** నా పర్సనాలిటీ. నేను అనుకోవడమే కాదు, చాలామంది చెప్తుంటారు. శారీరకంగా చూస్తే, నా కళ్ళు

▸ **నా తత్వం :** సరదాగా వుంటాను. సరదాగా మాట్లాడతాను. వాస్తవిక దృక్పథంతో వుంటాను. ఎవరితోనైనా, ఎక్కడైనా కలసి పోగలను

▸ **సెక్సీగా ఫీలయ్యేది :** కాన్ఫిడెంట్‌గా ఉన్నప్పుడు. ఎప్పుడూ ఉంటాననుకోండి

Photo : FAIZI ALI

# అ ని ల్

## రాత్రిపూటే ఎందుకు పూస్తాయి?

కొన్నిరకాల మొక్కలు రాత్రివేళ మాత్రమే పువ్వులు పూస్తుంటాయి. అటువంటి మొక్కల్లో నైట్‌క్వీన్ ప్రధానమైనది. ఈ మొక్క పగటివేళ ఉండే ఉష్ణోగ్రతను, కాంతిని తట్టుకోలేదు. అందువల్లనే రాత్రిపూట మాత్రమే పువ్వులు పూస్తుంటుంది.

రాత్రుళ్ళు పూసే ఈ పూలు మంచి సువాసన కలిగివుంటాయి.

తుమ్మెదలు ఈ వాసనకు ఆకర్షితమై పూలమీద వాలతాయి. అలా వాలినప్పుడు వాటి కాళ్ళకు, రెక్కలకు పుప్పొడి అంటుకుని అవి ఎగిరినప్పుడు పుప్పొడి వాటిమీద రాలుతుంది. దీన్నే 'పరాగ సంపర్కం' అంటారు.

నైట్‌క్వీన్ పూలు ఇటువంటి పరాగ సంపర్కంకోసమే రాత్రిపూట పూస్తాయి. వీటికి ఇతర రంగులు వుండవు.

తేలికపాటి క్రీమ్ కలర్‌లో పూసేటువంటి ఈ పూలు కీటకాలను మరింతగా ఆకర్షిస్తుంటాయి.



## ఆపుకోవచ్చా?

చాలామంది పిల్లలు ఆటల్లోపడో, లేక క్లాస్‌రూమ్‌లో ఇబ్బందిగా వుండో మూత్రాన్ని ఆపుకుంటుంటారు. ఇలా ఆపుకోవడంవల్ల అనేక అనారోగ్యాలకు ఆస్కారం ఉంటుంది.

శరీరంలోని మలినాలను మూత్రం పరిశుభ్రపరుస్తుంది. మన బ్లాడర్‌లో నాలుగొందలనుంచి ఆరొందల మిల్లీ లీటర్ల మూత్రం ఉండగలదు.

ఆ పరిధి దాటితే మెదడుకు మూత్రాన్ని విసర్జించాలన్న సంకేతాలు అందుతాయి. అలా చెయ్యకుండా బంధించి ఉంచినట్లయితే బ్లాడర్‌లో మార్పులు వచ్చి, మెదడుకు సంకేతాలు తక్కువగా అందుతాయి.

దీనివల్ల మూత్రవిసర్జన జరగాల్సిన సమయంలో జరగదు.

మలినాలు ఎక్కువసేపు శరీరంలోనే వుండిపోతాయి. దానివల్ల బ్లాడర్‌పైన ఒత్తిడి పెరుగుతుంది.

ఇలా ఒత్తిడి పెరగడంవల్ల మూత్రంలోని కొన్ని పదార్థాలు బంకలా మారి, అవే క్రమంగా రాళ్ళుగా మారతాయి. ఇన్‌ఫెక్షన్లు కూడా వస్తాయి.

## కోపానికి హద్దులు

ఏడవడం, అరవడం, చిరాకు పడడం, చేతిలో వున్న వస్తువులు విసిరికొట్టడంలాంటివి పిల్లలు ప్రదర్శించే కోపతాపాల లక్షణాలు.

కొంతమంది కోపంలో తమకు తామే కొట్టుకోవడం, గిచ్చుకోవడం, పళ్ళు కొరకడం, ఊపిరి బిగపట్టడం చేస్తుంటారు. వారు ప్రదర్శించే ఆగ్రహం మితిమీరుతుంటే తప్పనిసరిగా చర్యలు తీసుకోవాలి.

ముఖ్యంగా వారి కోపానికి కారణాన్ని, వారి తీవ్రస్పందన తీరును గుర్తించి వాటిని నియంత్రించే దిశగా ప్రయత్నించాలి. కోపం 'తప్పు' అని తరచూ చెబుతుంటే ఉపయోగం వుండదు. తగిన చర్యలతో వారిలో మార్పుకు ప్రయత్నించాలి.

పిల్లలే కదా అనుకుంటూ వారు కోపాన్ని ప్రదర్శించిన ప్రతిసారీ పెద్దలే సర్దుకుపోతూవున్నా, వారడిగినవన్నీ ఇచ్చేస్తున్నా ఎదిగేకొద్దీ వారిలో తీవ్రత పెరుగుతుంది. ఇది అంత వాంఛనీయమైన పరిణామం కాదు.

## ఆరుబయట ఆటలు

పిల్లల శారీరక, మానసిక ఎదుగుదలకు ఆటలు చాలా అవసరం.

మైదానాల్లో ఆడుకునే పిల్లలు చాలా చురుగ్గా వుంటారని వివిధ అంశాలపై పట్టు సాధించగలుగుతారని, వారిలో మానసిక స్థైర్యం పెరిగి, చదువు కూడా త్వరగా వంటబడుతుందని పిల్లల మానసిక నిపుణులు ప్రపంచవ్యాప్తంగా నిర్వహించిన సర్వేలో గుర్తించారు.

ఆటల్లో పాల్గొనడంవలన పిల్లలలో సామాజిక నైపుణ్యం పెరుగుతుంది. మిగతా పిల్లలతో కలివిడితత్వం మెరుగవుతుంది. ఆరుబయట ఆటలవల్ల మెదడు అభివృద్ధి చురుగ్గా, వేగంగా వుంటుంది.

ఏ విషయాన్నయినా త్వరితంగా నేర్వగలుగుతారు.

జ్ఞాపకశక్తి మెరుగు అవుతుంది. జయాపజయాలు సహజమని గ్రహిస్తారు. ఒత్తిడిని జయిస్తారు.

## బొమ్మల పజిల్

గ్రహాల పేర్లను పూరించండి.




**Ans :** Mercury, Venus, Earth, Mars, Jupiter, Saturn, Pluto, Moon, Sun, Neptune, Uranus.

## ఆంక్షల పద్దు

పిల్లలు ఓ వయస్సుకు చేరాక వాళ్ళకు పదేపదే అది చెయ్యొద్దు, ఇది చెయ్యొద్దు, ఇలా వుండాలి, అలా ఉండకూడదువంటి ఆంక్షలను అనుక్షణం పెడుతుంటే వాళ్ళు మొండిగా మారిపోయే అవకాశాలుంటాయి.

ప్రీ టీనేజి వయసుకి వచ్చినదగ్గర నుంచి పిల్లలతో వీలయినంత స్నేహపూర్వకంగా, సరదాగా వుండాలికాని నియంత్రణలు పెట్టకూడదు.

ప్రతి చిన్న విషయాన్నీ అతిగా పట్టించుకుంటూ, క్రమశిక్షణగా ఉంచుతున్నామని అనుకుంటూ వారిచుట్టూ చట్రం పేర్చేస్తే లాభంకంటే నష్టం ఎక్కువగా వుంటుంది. కాస్త వయస్సు పెరిగాక స్నేహితులు, ఫోన్లు, ఛాటింగ్‌లు మామూలే. వద్దంటూ కట్టుదిట్టం చేస్తే, అబద్ధాలు అలవడతాయి.

ఇంట్లోనివాళ్ళకు తెలియకుండా చేసే పనులు పెరిగిపోతాయి. ఇది ఎంతమాత్రం వాంఛనీయం కాదు. వారిపట్ల కఠినంగా వ్యవహరించకూడదు.

వారు ఏదైనా తప్పుచేస్తే అది తప్పు అని, అది ఎందుకు చేయకూడదో వారికి వివరంగా అర్థమయ్యేలా, స్నేహపూర్వకంగా చెప్పాలి.

వారిపై అజమాయిషీ చేయకూడదు. ఏదైనా పని చెప్పినప్పుడు అజమాయిషీ చేస్తున్నట్లు చెప్పకూడదు.

# మినుముల బ్రాహ్మడు

అనగా అనగా ఒక ఊళ్ళో ఒక బీదబ్రాహ్మణుడు ఉండేవాడు. ఆ బ్రాహ్మణుడు ప్రతిరోజూ పొద్దున్నేలేచి స్నానం జపంచేసి, రాగిచెంబు తోముకుని ఊళ్ళో యాయవారానికి బయలుదేరేవాడు. ఇల్లిల్లూ అడుక్కుని పన్నెండు గంటలయ్యేటప్పటికి భుజాన బియ్యంమూట వేసుకుని ఇల్లు చేరుకునేవాడు.

బ్రాహ్మణుడి భార్య గయ్యాళిగంప. ప్రొద్దస్తమానమూ భర్తను ఎందుకో ఒకందుకు వేధిస్తూనే ఉండేది. ఇలా కొంతకాలం జరిగేటప్పటికి ఏమయిందంటే రోజూ వచ్చే బ్రాహ్మణుడేకదా ఇతనికి బియ్యం ఎందుకని ఆ ఊళ్ళోవాళ్ళు ఒకరిని చూసి ఒకరు అందరూ మినుములు బిచ్చంవెయ్యడం ప్రారంభించారు.దాంతో బ్రాహ్మణదంపతులు మినుముల్ని కుడుములుచేసుకుని తింటూ కాలక్షేపంచేసేవారు.

ఒకరోజు ఆ బ్రాహ్మణుడి పెళ్ళానికి అరిసెలు తినాలని మనసైంది. మామూలుగా బ్రాహ్మణుడు యాయవారానికి బయలుదేరుతుండగా 'ఏమండోయ్! ఇవాళ నాకు అరిసెలు తినాలని మనసైంది. కాబట్టి మినుములు మానేసి బియ్యం తీసుకురండి. లేకపోయారంటేనా..." అంది. సరేనని బ్రాహ్మణుడు ఊళ్ళోకి బయలుదేరాడు. అందరూ మినుములు వేసేవారే కాని బియ్యం ఒక్కరూ వెయ్యలేదు.

ఏ ఒక్కళ్ళనీ బియ్యం వేయమని అడగలేక ఆ బ్రాహ్మణుడు మినుములమూట పుచ్చుకుని ఇంటికి చేరాడు. వచ్చీరాకుండానే అరిసెలు చేసుకోవచ్చుగదా అని అతని భార్య గబగబా మూటవిప్పి చూస్తే రోజూలాగా మినుములే, దానితో ఆవిడ నరసింహావతారం అయిపోయి పళ్ళు పటపట కొరుకుతూ మూలనున్న రోకలి పుచ్చుకుని "బియ్యం తెమ్మంటే తేలేనివాడవు ఏం మగాడివయ్యా! నామాటఅంటే నీకు అంత చులకనా, ఎవరు తింటారు ఇవన్నీ" అంటూ మండిపడడం మొదలుపెట్టింది. పాపం బ్రాహ్మణుడు గుడ్లు మిటకరించి చూడ్డంతప్ప మరేమీ చెయ్యలేకపోయాడు.

"ఎన్నాళ్ళనుండో అరిసెలు తినాలని ఉండి ఇవాళ బియ్యం తెమ్మంటే తేక, నాకు అరిసెలు చేసుకుని తినే భాగ్యం లేకుండా చేశావుగదా! సరే నీ పని ఏం చేస్తానోచూడు. ఇవన్నీ వండి నీ మొహాన పడేసి తినేదాకా ఈ రోకలి పుచ్చుకొని నీ ఎదుట కూర్చుంటాను. తినకపోయావంటే గుండుపగలగొడతాను చూడు" అంది. "పోనీ ఎలాగో అలాగ తింటే రోకలిదెబ్బలు తప్పుతాయి గదా అనుకుని బ్రాహ్మణుడు "అలాగే తింటాను, వండి పట్టుకుని రా" అన్నాడు.

ఆవిడ ఆ మినుములన్నీ వండి పెద్ద విస్తరేసి దాన్నిండా ఆ వండిన మినుములన్నీ పోసి, తినమని రోకలి పుచ్చుకుని దగ్గరకూర్చుంది. "ఓరిదేవుడా ఇవన్నీ తినడం ఎలా? నాది కడుపా చెరువా! ఇవన్నీ ఎక్కడ పట్టించనూ..."అనుకుంటూ గట్టిగా మాట్లాడితే రోకలితో పెళ్ళాం ఏంపెళ్ళిచేస్తుందో అన్న భయంకొద్దీ బ్రాహ్మడు ఆ విస్తరిదగ్గర కూలబడి ఒక్కొక్క గింజే తినడం మొదలెట్టాడు. ఇలా సగం మినుములు తినేసరికి అయ్యగారికి గుడ్లెళ్ళుకొచ్చినాయి.

"ఒసే గొంతుక దిగడంలేదు, మంచినీళ్ళు ఇద్దూ" అన్నాడు. నీళ్ళు తేవడానికని రోకలి అక్కడ పడేసి ఆమె లోపలికి వెళ్ళింది. ఇదే సమయం అనుకుని బ్రాహ్మణుడు ఇల్లువదిలి వీధివెంట బడ్డాడు.



పెళ్ళాం ఎక్కడ తరుముకుంటూవస్తుందో అన్న భయంకొద్దీ బ్రాహ్మడు పరిగెత్తి, పరిగెత్తి, సాయంత్రానికి ఒక అడవిలోకి చేరుకున్నాడు.

నాలుగు ప్రక్కలా చూసి, గుండె స్థాయిపరుచుకొని, రోకలిపోట్లు తప్పాయిగదా అని సంతోషించి అలసిఉండటం చేత ఒక మర్రిచెట్టు క్రింద పడుకొని నిద్రపోయాడు. ఇది ఇలా ఉండగా నలుగురుదొంగలు ఒక వర్తకుడి ఇంట్లో పడి సర్వం దోచుకొని అర్ధరాత్రి అయ్యేసరికి బ్రాహ్మణుడు పడుకొన్న అడవిలో ఆ మర్రిచెట్టు ప్రక్కనే చేరారు.

అక్కడ కాసేపు ఆగి మళ్ళీ వెళ్దామనుకుని తమ సామానంతా అక్కడ దింపారు. వాళ్ళకి చాలా ఆకలేసింది. తినడానికి ఏదైనా దొరుకుతుందేమోనని వాళ్ళు తమ సామానంతా కలియ వెదికారు.

వెతకగా వాళ్ళకో కొబ్బరికాయ దొరికింది. కాయ పగలకొట్టటానికి ఏదన్నా రాయి వెతకండ్రా అంటూ ఆ చీకట్లో నలుగురూ నాలుగు ప్రక్కలా తడమటం మొదలెట్టారు. తడమగా, తడమగా, ఒకడి చేతికి బ్రాహ్మణుడి గుండు నున్నగా తగిలింది.

దొరికింది రండ్రా, అంటూ మిగతావాళ్ళని అందరినీ పిలిచాడు.నలుగురూ చేరారు. అది బ్రాహ్మణుని తల అని వాళ్ళకేం తెలుసు!

బలంకొద్దీ బ్రాహ్మణుడి గుండుకేసి ఆ కొబ్బరికాయకొట్టారు! నిద్రపోతున్న బ్రాహ్మణుడు, ఆ దెబ్బకి హడలిపోయి లేచి, తన పెళ్ళామే తనని వెతుక్కుంటూ వచ్చి కోపంకొద్దీ రోకలి పుచ్చుకుని కొట్టిందనుకుని, "వస్తున్నా, వస్తున్నా తింటాను తింటాను ఆగు" అని వెర్రికేకలెయ్యడం మొదలుపెట్టాడు.

ఆ అరుపులు వినగానే దొంగలు అది దయ్యమో, భూతమో అని వాళ్ళు దోచుకుని తెచ్చిన సామానంతా అక్కడే వదిలేసి అదే పరుగు తీశారు.

ఇంతలో తెల్లవారొచ్చింది. బ్రాహ్మణుడు జరిగినదంతా తెలుసుకుని దొంగలు వదిలి వెళ్ళిన పెట్టెలన్నీ నెమ్మదిగా తెరిచిచూశాడు.

వాటిల్లో బోలెడన్ని నగలు,నాణాలు వున్నాయి."భలే అదృష్టం. గుండుచితికేలా దెబ్బతింటే తిన్నాను కాని, ఎంతటి అదృష్టం కలిసివచ్చిందో" అనుకున్నాడు. సరే అవన్నీపుచ్చుకొని ఇంటికి బయలుదేరాడు.

ఇక అక్కడ ఇంటిదగ్గర ఏమయిందంటే మంచి నీళ్ళు తెద్దామని లోపలికి వెళ్ళి పట్టుకొచ్చేలోగా, మొగుడులేకపోయేసరికి "అమ్మ గడుసువాడా, ఎంత మోసంచేశావు! కాని రాని, ఎప్పటికైనా రాకపోతావా. చూడురాగానే నీపని పట్టిస్తా"నంటూ దుడ్డుకర్రపుచ్చుకుని తలుపు వేసుకొనికూర్చుంది. మరికాస్సేపటికి బ్రాహ్మణుడు ఇంటికొచ్చి తలుపు బాదాడు.

"ఆ, వచ్చావా! నీ పని అయిపోయింది వస్తున్నా ఉండు" అంటూ ఆవిడ తలుపు తెరిచింది. తలుపు తెరవగానే బోలెడన్ని పెట్టెలు, బేడలు, సామానుచూసేసరికి ఆవిడకోపమంతా సంతోషంగామారిపోయింది. ఆనందంతో భర్తని లోపలకాహ్వానించింది. భర్త పెట్టెలు తెరిచి చూపించాడు. దరిద్రం వదిలిందంటూ ఆనాటినుంచీ ఆ బ్రాహ్మణ దంపతులు సుఖంగా జీవించారు.

యన్.సి.సీతమ్మాళ్






# అనవసర ఖర్చులు

చేతిలో డబ్బులున్నాయికదా అని వాడేస్తే రేపటిరోజున అవసరం అయినప్పుడు అగచాట్లు తప్పవు. ఎంత సంపాదిస్తున్నా దానినుంచి ఎంతోకొంత తప్పని సరిగా పొదుపు చేయాల్సిన అవసరం చాలా ఉంది.

రః పొదుపు కలలు సాకారం చేసుకోవడానికీ లక్ష్యాలను మరింత బాగా అందుకోవడానికి ఈ పొదుపు ప్రక్రియ ఎంతగానో ఉపకరిస్తుంది.

ఏవో ఒక అంశాలు అనవసర షాపింగ్‌కు పురి కొల్పుతుంటాయి. అనవసర ఖర్చులు పొదుపుకు విఘాతం కలిగిస్తాయి. ఎంతోకొంత పొదుపు చేయాలన్నమాట కొంత భారాన్ని పెంచుతుంది.

కాని, కొద్దికొద్దిగా పొదుపు చేయడాన్ని కొనసాగిస్తుంటే పోగైన మొత్తం ఆత్మవిశ్వాసాన్ని, ధైర్యాన్ని, స్థైర్యాన్ని ఇనుమడింపజేస్తుంది. అవసరంవస్తే ఎలా అన్న ఒత్తిడికి అస్సలు తావుండదు.

ఆర్థిక స్థితిగతి అటూ ఇటూ తప్పినా, పొదుపుతో పోగైన మొత్తం భయాన్ని దూరంగా ఉంచుతుంది. అయితే, ఇక్కడ కావాల్సిన ముఖ్య విషయం ఏమిటంటే పొదుపుకు చోటు ఇవ్వడం. భవిష్యత్ అవసరాలకోసం ప్రతి నెలా తప్పనిసరిగా ఎంతో కొంత పొదుపు చేయడాన్ని అలవరచుకోవాలి.

కొన్నాళ్ళు కష్టపడి అయినా కొనసాగిస్తే, తర్వాత క్రమంగా అదే అలవాటయిపోతుంది.

## చిన్న మొత్తం

మొదట్లో కొద్దిమొత్తాన్ని క్రమంతప్పని పద్ధతిలో పొదుపుచేయడాన్ని మొదలుపెట్టాలి. వేతనంలో కొద్దిమొత్తాన్ని నేరుగా పొదుపు ఖాతాలోకి వెళ్ళేవిధంగా, బ్యాంకర్ల సాయంతో ఏర్పాటు చేసుకోవాలి లేదా తప్పనిసరిగా కొంత మొత్తాన్ని తీసి పక్కన పెట్టాలి.

ఓ నెలలో వుంచడం, మరో నెలలో మానే యడం కాకుండా క్రమంతప్పకుండా అలవరచుకోవాలి. ఈ దశలో పొదుపుచేయడం ఒక్కటేకాదు, ఆ అలవాటును చేసుకునే క్రమంలో ఉన్నారని అర్థం.

## కొనుగోళ్ళు

ఏదో ఒకటి కొనేయాలన్న తత్వాన్ని మానుకునే అలవాటుకూ శ్రీకారం చుట్టాలి. అలాగే కనిపించినవన్నీకొనాలనిపించటానికి వెనకున్నకారణం తెలుసుకోవాలి. ఏవి మిమ్మల్ని ప్రోత్సహిస్తున్నాయో వాటికి దూరంగా జరగండి. డిస్కౌంట్స్‌ని అతిగా నమ్మవద్దు. అలాగే మీరు ఏ షాపింగ్‌మాల్‌కి అయినా వెళ్ళినప్పుడు మీ చేయి ఏ వస్తువు మీదికి వెళ్ళినా వెంటనే దానిని చేతులోకి తీసుకోకండి. ఒక్కక్షణం ఆగండి.

మీకు మీరు ఆ క్షణంలో మూడు ప్రశ్నలు వేసుకోవాలి. మొదటి ప్రశ్న ఆ వస్తువు నాకు నిజంగా తక్షణ అవసరమా! అనేది. రెండవది ఆ వస్తువు మీద మీరు పెట్టే ధరకి నిజంగా అంత విలువ వుందా!

ఆ వస్తువు మీద పెట్టేటువంటి ఆ డబ్బుతో మరొకటి ముఖ్యమైనది ఏదైనా కొనుక్కోగలనా! అని ప్రశ్నించుకున్న తర్వాత ఇప్పుడు నేను కొనే ఈ వస్తువు ఆ తర్వాత ఎందుకు కొనుక్కున్నానా! అనే ప్రశ్న తెస్తుందా! అనికూడా ఆలోచించాలి.

ఇది ఒక విధంగా ఆత్మశోధన. దీనివలన మీ షాపింగ్ నిర్ణయాలు మారిపోతాయి. అప్పుడు అనవసరపు కొనుగోళ్ళు అనేవి జరగవు.

ఒక 'వ్యసనం' వదిలించుకున్నవారికి మానసికంగా ఎంత ఉత్సాహం, ఆరోగ్యం వస్తుందో అదే విధంగా షాపింగ్ వ్యసనం వదిలిన తర్వాత ఆ ఆనందకర పరిస్థితి ప్రతి ఒక్కరు అనుభవించగలుగుతారు.

అలాగే విండో షాపింగ్‌కు దూరంగావుంటే, కొనాలన్న కోరిక మనలో తగ్గుతుంది. ఏదో ఒకటి కళ్ళ ముందున్నప్పుడు కొనేందుకు టెంప్ట్ అవుతుంటారు.

## కోరికల పరిశీలన

ఏవో ఒకటి కొనేయాలన్న అలవాటు అనేకమందిలో వుంటుంది. ఏది చూసినా టెంప్ట్ అయిపోయి కొనేస్తుంటారు. ఇటువంటి కోరికలను నియంత్రించుకోవడంవల్ల చాలా డబ్బు మిగులుతుంది.

పేపర్‌పైన కోరికల జాబితా రాసుకుంటే, వాటిని నియంత్రించుకోగల అలవాటును చేసుకోవడానికి మార్గం ఏర్పడుతుంది. 'వద్దు, వద్దు' అని పదేపదే మనస్సుకు చెప్పుకోవాలి.

తప్పనిసరి కొనుగోళ్ళు అనేవి అవసరాన్ని బట్టి అసంకల్పిత చర్యగా సాగుతాయి.

కాబట్టి ఈ అలవాటును మనస్ఫూర్తిగా, జాగ్రత్తగా మానిటర్‌చేసుకోగలగాలి. ఫలితంగా ఏర్పడే మిగుళ్ళు భావికి పొదుపుగా మారతాయి.

దీంతో వేతనస్థాయిలు రానురాను తగ్గిపోతాయి. పొదుపుకు అవకాశం రాదు. ఏదో ఒకటి కొనేసే తత్వంగల స్నేహితులు, బంధువులు, తోడ బుట్టినవారికిదూరంగా వుండాలి.

వస్తువులు, ఇతరవాటికి సంబంధించి వారితో మాట్లాడకుండా వుంటే మంచిది. సదరుమాటలు సైతం అనవసర కొనుగోళ్ళకు దారి తీస్తాయి.

## ఆన్‌లైన్‌కు దూరం

**షా**పింగ్ మాల్స్‌కు, షాపులకు వెళ్ళకుండా దూరంగా ఉన్నప్పటికీ, చేతిలో స్మార్ట్‌ఫోన్ వుంటే ఆన్‌లైన్ కొనుగోళ్ళకు 'సై' అనేయగలరు.

పనికోసం ఇంటర్నెట్‌ను రోజూ వాడుతుంటే ఆన్‌లైన్ షాపింగ్ వైపునకు కన్నెత్తి చూడకూడదు. ఇటువంటి వెబ్‌సైట్స్ చూడవద్దు. కొత్త ఉత్పత్తులకోసం క్యాటలాగ్స్ బ్రౌజ్‌చేయవద్దు.

ఈ బ్రౌజింగ్ అవసరం లేకపోయినా కొనుగోళ్ళకు టెంప్ట్‌చేస్తుంది. ఆన్‌లైన్ కొనుగోళ్ళ వైపునకు దృష్టి మరలకుండా వుండాలంటే సుడోకు వంటివి పజిల్స్ ఆడుకోవడం మరో ఆప్షన్.జీవనశైలిలో పెద్దమార్పు లేకుండా చాలా సార్లు అనవసర ఖర్చులవైపు మనస్సు మళ్ళిస్తుం టారు. భోజనం వండుకోకుండా ఆర్డర్ చేయడమో లేదా రెస్టారెంట్‌లకు వెళ్ళడమో తరచూ చేయడంవల్ల చాలా డబ్బు వృధా అయిపోతుంది.



Courtesy : SANANDA

డెలివరీ ఛార్జీలు అదనంగా పడతాయి. తక్కువ ఖర్చుకాగల ప్రత్యామ్నాయాలకోసం వెతుక్కోవాలి. దృష్టిని నిర్మాణాత్మకంగా మళ్ళించాలి.

ఇంట్లో వండుకోవడం లేదా ఏవైనా ఇంటిపనులు చేయడంద్వారా అనవసరఖర్చులనుండి దృష్టినిమళ్ళించడం వంటివి చేస్తుండాలి. దీర్ఘకాలికంగా పొదుపును ఓ అలవాటుగా సృష్టించుకునే దిశగా ప్రయత్నాలు సాగించడాన్ని నేర్చుకోవాలి.



## లక్ష్యం దిశగా

**ఫ**లానా టైమ్‌కి ఫలానా మొత్తాన్ని పొదుపుచేయాలన్న స్వీయ లక్ష్యాలు సృష్టించుకోవాలి. ఓ వారంరోజులు లేదా పక్షం రోజులు లేదా నెలరోజులకు ఇంత అని నిర్దేశించుకుంటే, దాన్ని అందుకోవాలన్న ఆరాటం పెరుగుతుంది.

ఈ ఆరాటం పొదుపును ప్రోత్సహిస్తుంది. నిత్యావసరాలు, ఇతర తప్పనిసరి అవసరాలకు డబ్బుతీసి పక్కనపెట్టుకుని, వాడకానికి ఉంచుకుని, మిగతావి పొదుపుకోసంతీసుకోవాలి. అనవసరవస్తువులకొనుగోళ్ళకు ప్రయత్నపూర్వకంగా దూరంగా వుండాలి. ఏదోఒక వ్యాపకంతో బిజీగా వున్నప్పుడు దృష్టి అనవసరకొనుగోళ్ళ వైపునకు మరలదు.

## ప్రణాళికాబద్ధంగా

**పొ**దుపు పెరగాలంటే అనవసర కొనుగోళ్ళు తగ్గాలనేది సింపుల్ సూత్రం. అందుకోసం అవసరమైన కొనుగోళ్ళను ముందుగా ప్లాన్ చేసుకోవాలి. బడ్జెట్ వేసుకుని, ఆ ప్రకారం కొనసాగించాలి.

ప్రతినెలా ఏవి అవసరమో జాబితా తయారు చేసుకుని, ఆ ప్రకారమే కొనుగోళ్ళు సాగించాలి తప్ప, మధ్యలో మనస్సును మరోదానివైపునకు మళ్ళించకూడదు. ఇలా కొన్నాళ్ళపాటు జాగ్రత్తగా వ్యవహరిస్తుంటే, ఓ దారిలో పడిపోతారు.

అనవసరాలవైపునకు దృష్టి వెళ్ళదు, మళ్ళదు. దేన్ని ఎప్పుడు, ఎంతమేరకు కొనాలన్న విషయంలో స్పష్టమైన అవగాహన ఏర్పడుతుంది. అత్యవసరాలకోసం మాత్రమే క్రెడిట్ కార్డులు దగ్గరుంచుకోవాలి తప్ప, అవి అందుబాటులో వున్నాయికదా అని ఏవిపడితే అవి కొనవద్దు.

ఇలా నెమ్మదిగా, క్రమంగాకొద్ది కొద్దిగా పొదుపు చేయడాన్ని మొదలుపెడ్తే అది ఓ అలవాటుగా మారిపోతుంది.

**టి.ప్రణవ్**

# భార్యున్న బ్రహ్మచారి



## సుంకర కోటేశ్వరరావు

రమణమూర్తి పాదాలను ఎడంగా ఉంచి నడుం వంచి తలనూ, చేతుల్నీ కాళ్ళ మధ్యకు విసురుగా నెడుతూ వ్యాయామం చేస్తున్నాడు ఉదయమే లేచి. అయిదుసార్లలా చేయగానే ఆరోసారి తనవెనకెవరో నిలిచినట్లు కనిపించి లేచి వెనక్కి తిరిగాడు. రంగస్వామి నిలబడివున్నాడు.

"హలో రంగస్వామిగారూ! రండ్రండి! ఏమిటంత పొద్దుటేవచ్చారు? రండికూర్చోండి" నవ్వుతూ పలకరించాడు రమణమూర్తి.

"నేను కూర్చోవడానికి రాలేదు మిస్టర్... మిస్టరో" చాలా సీరియస్‌గా వున్నాడు రంగస్వామి.

"రమణమూర్తిలెండి నా పేరు... సరే, ఏమిటో చెప్పండి"

"ఇదేమిటి?" చేతిలోది చూపిస్తూ అడిగాడు రంగస్వామి. కోపంలో మాటలు తడబడ్తున్నాయి.

"కౌన్‌బనేగా కరోడ్‌పతిలోలా ఆప్షన్స్ ఏమైనా వున్నాయా? లేకపోతే ఏమిటండి ఆ ప్రశ్న. అది మగాళ్ళ అండర్వేరు.. అదడగడానికా వచ్చారు?"

"ఎవరిదిది"

"ఎవరిదో మీ చేతుల్లో ఎందుకుంటుంది? అది మీదే అయివుంటుంది" అన్నాడు మూర్తి.

"కాదు. ఇది మీది" బల్లగుద్దినట్లన్నాడు స్వామి.

"నాదా?" ఆశ్చర్యపోయాడు మూర్తి.

ఏమనాలో రమణమూర్తికి అర్థంకాలేదు. అయోమయంగా ఉందతనికి. రంగస్వామి సడెన్‌గా ముందుకొచ్చి మూర్తి చేతులు పట్టుకుని కళ్ళనీళ్ళ పర్యంతమై "మూర్తిగారూ! నాకున్నదే ఒక్కగానొక్క పెళ్ళాం లేక లేక గుళ్ళో తాళికట్టి తెచ్చుకున్నా...

నా నోట్లో మట్టి కొట్టకండి. నా కుటుంబంలో అగ్గిరగల్చకండి, ఇవి చేతులుకావు, కాళ్ళనుకోండి.. ప్లీజ్" అంటున్నాడు. రమణమూర్తి గాబరాపడిపోయాడు. ఆ సమయంలో లోపలినుండి శ్రీదేవి వచ్చింది.

"అన్నయ్యగారూ! మా ఆయన శీలాన్ని శంకించకండి, ఆయన శీలం పర్‌ఫెక్ట్... నేను సర్టిఫికెటిస్తున్నా ఆయన అస్ఖలిత బ్రహ్మచారి ఇప్పటివరకూ..."

"ఆ... అస్కలిత బ్రహ్మచారా?" మగాళ్ళిద్దరూ ఆ మాటకు బిత్తరపోయారు.

ఆ బుల్లి నిక్కరు మా ఆయనదే. మొన్న ఉతికి పైన ఆరవేస్తే గాలికి ఎగిరివచ్చి మీ ఇంటి పెరట్లో పడింది. భూదేవి అక్కయ్య... అదే వదినె... వదిన అడిగింది. నన్ను 'ఇది మీదేనా' అని. అవునండీ మాదేలే. వచ్చి తీసుకుంటాను వుంచండీ అన్నా.

ఈలోగా రామాయణ సాంప్రదాయ అనుమానంతో మీరు దీన్ని పట్టుకొని ఈయనను నిలదీయడానికి పొద్దుటే పరుగెత్తుకొచ్చారు. సందేహం తీరిందిగా మరి" ఆగింది.

"ఇక వెళ్ళండి" అనలేక రంగస్వామి వాళ్ళిద్దర్నీ చిత్రంగా చూస్తూ బైటికి వెళ్ళాడు.

అతను వెళ్ళగానే రమణమూర్తి ఒక్కసారిగా తలను స్తంభానికి మోటించి "వా..." అన్నాడు ఏడుస్తున్నట్లు. శ్రీదేవి ఆశ్చర్యపోయి "అయ్యో ఏమిటండీ ఇది చిన్నపిల్లాడిలా? ఇప్పుడేమైందని!" అంది అతని జుట్టులోకి వేళ్ళను దూర్చి గోముగా.

"ఇంకా ఏంకావాలే శ్రీదేవి! నా ఇజ్జత్తంతా స్వచ్ఛ భారత్తయింది. నేను పురుషుణ్ణేనా అని నాకే డౌటొస్తోంది. అతను వెళ్తూ ఎలా చూశాడో చూశావుగా.

"అబ్బ" ఆగండి ఏమిటనుకుంటారు వాళ్ళు మిమ్మల్ని, మీ డౌటు ఏమిటి?" శ్రీదేవి అడిగింది.

"వాళ్ళంతా నన్ను 'గే' అనుకుంటారు వ్వా..."

"ఛీ! ఏమిటండీ ఆ మాటలు?"

"ఏమిటా? చెప్పావుగా పెళ్ళామున్నా బ్రహ్మచారినీ అనీ పైగా అస్ఖలిత బ్రహ్మచారినీ అని ధృవపత్రం జారీ చేశావుగా. మరేమనుకుంటారు. అస లెందుకే అలా చెప్పావు?"

"మీ శీల సంపదను స్ట్రాంగుగా నిరూపించాలనే ఆదుర్దాలో అలా సత్యవాక్కులు అసంకల్పితంగా నాలుక వెంట దొర్లి వచ్చాయి"

"సరే పద" ఒక్కసారిగా శ్రీదేవిని చేతుల్లోకి ఎత్తుకున్నాడు. కెవ్వున అరిచిందామె "అయ్యో ఏమిటీ పిచ్చి... దించండి... ముందు దించండి" ఆందోళనగా గింజుకుంది శ్రీదేవి.

"అబ్బ ఏమిటండీ పొద్దుటే మీ పైత్యం? అసలు మీరు నన్ను తాకనే తాకగూడదు... గుళ్ళో నా మెడలో తాళికట్టినప్పుడు దేవుడిపై ప్రమాణం చేసి నాకిచ్చిన మాట పదేపదే గుర్తుచేయాలా?

శ్రీవల్లి పెళ్ళిచేసి ఆ దంపతుల మూడు రాత్రుల వేడుక అయిన తర్వాతే మన ముచ్చట. ముందు మీ బాధ్యత నెరవేర్చండి?"

**మూ**ర్తి చప్పబడిపోయాడు. ఆమెను దించి, కూలబడిపోయాడు. "సంబంధాలు ఎన్నని చూడనే.. వారంరోజులక్రితం ఒక దౌర్భాగ్యపు పెళ్ళి కొడుకు వచ్చాడు చూశావుగా?

వాడు హరికథా భాగవతారట. అంతా ఆ పిల్ల ఆస్తిపాస్తులపైన కన్నేసి వచ్చేవాళ్ళే కాని, 'పెళ్ళాన్ని పువ్వుల్లో పెట్టి చూసుకుంటాం, రెక్కల కష్టంతో బ్రతుకుతాం' అని ముందుకొచ్చిన చచ్చినోడు ఒక్కడూ కనిపించకపోయే...

ఇదిగో మర్చిపోయా ఈ దినం సాయంత్రం చాంగుభళా భంగుబాబా మనింటికి విచ్చేస్తున్నాడు మరిచావా? ఆ అరేంజ్‌మెంట్స్ చూడాలి పదా.

శ్రీవల్లి జాతకం, భవిష్యత్తు తెలుసుకోవడానికేగా ఆ బాబాను ఆహ్వానించాం. ఆయనే దారి చూపిస్తాడు. త్వరలో శ్రీవల్లి కళ్యాణం ఆపై..." "సరే ఆపండి, చాలా పనులున్నాయి పదండి!" రమణమూర్తి బాత్రూమ్‌వైపు నడిచాడు.

**సా**యంత్రానికి చాంగ్‌భళా భంగు బాబా వైజ్ఞానికానంద్ వేంచేశాడు. బాబా అనంగానే తెల్లటి బవిరి గడ్డం, జడలు కట్టిన జుట్టు, కాషాయ వస్త్రాలతో వయస్సు మళ్ళిన స్వామీజీ అయి ఉంటాడనుకున్నారు వీళ్ళంతా.

సన్నగా చురకత్తుల్లా తేలిన గంభీరమైన మీసాలు, కొద్దిపాటి గడ్డం, చురుకైన కళ్ళు, స్ఫురద్రూపం. చూడగానే సినిమా లోని విలన్‌ని గుర్తుకుతెస్తాడు. వెంట తెచ్చిన భక్త గుంపును క్రిందనే వదిలేశాడు. బాబాకు రెండువైపులా ఇద్దరు నడి వయస్సు వాళ్ళు వింజామరలు వీస్తూ బాడీగార్డుల్లా నడుస్తున్నారు.

బాబా ఏదో నములుతున్నట్లుంది. మెట్లెక్కివస్తూనే ఆ ఇద్దరూ రెండుసార్లు జై వైజ్ఞానికానంద్ స్వామి, జై జై సత్య

## మధురం మధురం

పెళ్ళయ్యాక సమంత కెరీర్, సంతోషాలు మరింత ఎక్కువయ్యాయి. 'మహానటి'లో మధుర వాణి పాత్రకు ప్రశంసలు దక్కుతున్నాయి.

పైగా ఈ పాత్రకు తొలిసారిగా డబ్బింగ్‌చెప్పింది కూడా. "ప్రస్తుతం నా మనస్సు సవాళ్ళను కోరుతు న్నది. ఈ పాత్ర నేను చెయ్యగలనో లేదోనన్నంత భయం పుట్టేదిగా వుండాలని భావిస్తున్నాను.

భయం వుంటే ఇంకా ఎక్కువ జాగ్రత్త పడతాం కదా. నటిగా ఇప్పుడు మంచిస్థితిలో వున్నాను.

ఈ స్థితికి, స్థానానికి మరింత గౌరవం దక్కే మంచి సినిమాలు చేయాలన్నది నా లక్ష్యం" అని చెప్పింది సమంత.



వాక్ జ్ఞానానంద్‌జీ అని అరిచారు.బాబా నిమిత్తమాత్రు నిలా నిమీలిత నేత్రాలతో, అప్పటికే పరచివుంచిన మెత్తని తివాచీపై సున్నితంగా నడుస్తూ,

సిద్ధంగా రాముడు, శ్రీవల్లి ఇరువైపులా వుండి మెల్లగా వెనక్కి నడుస్తూ స్వామీజీపై సున్నితంగా, గౌరవంగా పూలను విసురుతుండగా హాల్లో సిద్ధం చేయబడిన దర్బార్ కుర్చీలో ఆసీనులయ్యారు.

హాలంతా అత్తరు, అగరువాసనలతో గుమగుమ లాడుతోంది. బాబా వయస్సు లఘువుగా ఉండటం రమణమూర్తికి ఏదో వెలితి అనిపిస్తోంది. పైగా బాబా ముఖాన్ని ఎక్కడో చూసినట్లనిపిస్తుంది. ఎక్కడా అని ఆలోచనా నిమగ్నమౌతుండగా-

"రమణమూర్తి గారూ అమ్మాయి భవిష్యత్తు గురించేగా మీ సమస్య. సరే, అమ్మాయి జాతకచక్రం ఉందా,లేదా పోనీ పుట్టినతేది నక్షత్రం వగైరా వివరాలు న్నాయా, అవీ లేవా? మరెలా!" స్వామీజీ వంక సాలోచనగా చూశాడు.

స్వామీజీ సైగలతో! "సరే అయితే అమ్మాయిని రమ్మనండి. బాబాజీ అమ్మాయి అర చేయి, నుదు రును పరిశీలించి, చదివి పరిష్కారం చెప్తారు"అన్నాడు పాదరేణువు. శ్రీవల్లిని తీసుకొచ్చింది శ్రీదేవి.

శ్రీవల్లికి ఇష్టంలేకున్నా తలొంచుకుని మౌనంగా కూర్చొని చేతిని ముందుకు చాచింది.బాబా ఆ చేతిని అందుకున్నాడు... క్రమంగా అతని కళ్ళలో మార్పొచ్చింది. చేతిని నలిపేస్తున్నాడు. అతనికి చిరుచెమటలు. మరుక్షణం శ్రీవల్లి బొమ్మలు ముడిపడ్డాయి. చేతిని విసురుగా లాగేసుకుని లోపలికి వెళ్ళిపోయింది. రమణ మూర్తికి అనుమానం నివృత్తవ్వబోతోంది ఇదంతా చూసి.

బాబా ఒళ్ళో చేతులు పెట్టుకొని కళ్ళుమూసుకున్నాడు. "మూర్తిగారూ మేమిప్పుడు బాబాలం, స్వామీజీలం కాము అనుకోండి. మనస్సు విప్పి మాట్లాడుతున్నాం. బాబాగారు ఇప్పటివరకు సన్యసించలేదు. సన్యాసం స్వీకరించడానికని నాలుగేళ్ళ క్రితం హిమాలయాలకు వెళ్ళి కొందరు ఋషులు, మునుల వద్ద శుశ్రూష చేశారు.

**వా**రు వీరు సన్యసించడానికి ససేమిరా అంగీకరించలేదు. ఆరేళ్ళు సంసారం చేసి రమ్మన్నారు. ఇక్కడి వాతావరణం ఆయన మనస్సుకు నచ్చింది. బాబా ఒక ఆశ్రమం నెలకొల్పాలనుకుంటున్నారు. కాని ఆయన దగ్గరంత సొమ్ములేదు.

సన్యాసి ఎలాగో కాలేకపోయారు కాబట్టి సంసారి అవుదామనుకుంటున్నారు. కాని 'బాబా చర్యలు' మాత్రం వదలరు.మీకు చెప్పకపోవడంఏమిటి?ఇదొక మాయ. ఇదొకమర్మం. ఇదొక వ్యాపారం"ఆగాడు పాదరేణువు. మూర్తి ఆశ్చర్యానికి అంతు లేదు. దిగ్భ్రాంతి కలుగుతోంది.

"స్వామీజీకి శ్రీవల్లి బాగా నచ్చింది. పెళ్ళాడ్తారు మీ అందరికీ అన్నివిధాలా ఇష్టమైతే. మీ మంచితనం, మీ ఇంటి గౌరవం, అమ్మాయి అందం, అణకువ, సౌభాగ్యం సమాచారం స్వామివారికి ముందే చేరాయి. ఆశ్రమ నిర్మాణం ఆయన ప్రథమధ్యేయం. అమ్మాయిని గుండెల్లో పెట్టుకొని ఆదరిస్తారు.

**విద్యావంతులు తమ కుటుంబ పోషణకే కాక సమాజసేవలోనూ భాగస్వాములు కావాలి.**

-రామనాథ్ కోవింద్, రాష్ట్రపతి





## కోరిక తీరేనా

'మనసా' ఫేమ్ శ్రీదివ్య అసలుసిసలు తెలుగమ్మాయి ఐనా, తెలుగులో కొన్ని సినిమాలు చేసినా ఇక్కడి ప్రేక్షకులు అంతగా గుర్తించలేదు.

దీంతో తమిళసీమకు తరలిపోయి బిజీ అయిపోయింది. అక్కడ ఎంతగా అవకాశాలు వస్తున్నా స్వంతభాషలో చేయలేకపోతున్న అసంతృప్తిఆమెలో ఉందట. ఈ విషయాన్ని అవకాశం వచ్చినప్పుడల్లా పదేపదే చెప్తున్నది కూడా.

టాలెంట్‌ను గుర్తించేముందు కనీసం తనలోని అందాలను అయినా గుర్తించాలనేమో అన్ని కోణాల్లోనూ ఫోటోలను తాజాగా మీడియాకు విడుదల చేసింది. మరి, తెలుగు ప్రేక్షకులకు దగ్గరవ్వాలన్న కోరిక తీరుతుందా...

ఇక ఆయన బాబాగా పరిపూర్ణంగా ఎదిగేచర్యలు... ఎలా కొనసాగించాలో ఆయనకొక పథకం ఉంది. అలా అడుగులు వేస్తారు. అది ఆయనకే వదిలేద్దాం. బాగా ఆలోచించుకునే ఏ విషయమూ చెప్పండి" రేణువు ఆగాడు.

మూర్తి కోపంతో వణికిపోతున్నాడు. అయినా సంయమనం పాటించి నోరువిప్పాడు. "దీనికి సమాధానం చెప్పేముందు... మీరీ ఇంట్లో అడుగుపెట్టిన క్షణం నుండీ నా మెదడును వేధిస్తున్న ఒక్క విషయంలో నాకు క్లారిటీ కావాలి.

దాపు పదిహేనేళ్ళ క్రితం నేను బాపట్లలో లాయర్‌గా ప్రాక్టీస్ చేసే సమయంలో చిన్న చిన్న దొంగతనాలు, దౌర్జన్యాలు చేస్తూ బ్రతికే ఒక టీనేజర్‌కి చైన్ స్నాచింగ్ కేసులో ఆరు నెలల జైలుశిక్ష పడింది. జైల్లో వేసిన పదిరోజుల్లోనే 'పాదశక్తి' చూపించాడు. ఇప్పటికీ జాడలేదు.

అతణ్ణి 'కుమ్మరావంలో గచ్చకాయ' లేదా 'గచ్చకాయ శీను' అని పిలిచేవారు. అతని పోలికలు బాబాజీ ముఖంలో కనిపిస్తున్నాయేమిటా" మూర్తి పూర్తి చేయకముందే పాదరేణువు 'ఒక్కక్షణం' అని గొణుక్కుంటూ స్వామీజీవైపు గబగబా వెళ్ళాడు.

రెండు నిమిషాల్లో తిరిగొచ్చి "క్షమించండి సార్! బాబాగారికి క్షణాల్లో జబ్బు చేసింది. మోషన్స్. వెంటనే వెళ్ళాలని బయల్దేరారు" అంటుండగానే బాబా హాల్లోంచి బయటకెళ్ళి మెట్లుదిగడం మూర్తికి కనిపించింది.

పాదరేణువు కూడా అతన్ననుసరించడానికి నాలుగడుగులు వేసి వెంటనే వెనుతిరిగి మూర్తిని సమీపించి సడన్‌గా కాళ్ళను తాకి

"క్షమిం చండిసార్! పొరపాటైంది... మీమేలు మరువలేం. మా పొట్టకొట్టొద్దు. మమ్మల్ని పూర్తిగా మరిచిపోండి. అదే మీరు మాకు చేసే మేలు. నమస్తే!" అంటూ సమాధానం కొరకు కూడా చూడకుండా చకచకా వెళ్ళిపోయాడు.

రాత్రి తొమ్మిది దాటింది...

బయటనుండి వచ్చిన మూర్తికి ఇంట్లో ఎవరూ కనిపించలేదు. వెనక పెరటి కాంపౌండ్ తలుపు తెరచి ఉంది. అటువెళ్ళాడు. కొట్టంలో ఉన్నారంతా.

శ్రీదేవి, మూర్తిని చూస్తూనే "ఏమండీ! చూశారా? మన ఎల్లావు ఈనింది. పెయ్యదూడ, అది పుట్టీపుట్టగానే పడుతూ లేస్తూ నిలబడటానికి ప్రయత్నిస్తుంటే రాముడికి ఎంత సంబరంగా ఉందో... నాకు చాలా ఆనందంగా ఉందండి" చెప్పింది.

"బావా! బుజ్జాయి ఎంత అపురూపంగా ఉందో... ఆ బుజ్జిముండప్పుడే పొదుగు కోసం తడుముకుంటుంటే నాకు చాలా సంతోషంగా ఉంది" అంది శ్రీవల్లి. "అవును... నాకూ ఆనందమేస్తుంది" అన్నాడు మూర్తి.

రాత్రి భోజనాల దగ్గర... సాయంత్రం జరిగిందంతా వాళ్ళకు చెప్పాడు మూర్తి. "దొంగ రాస్కెల్స్‌ని పోలీసులకు పట్టివ్వాల్సింది బావా" అంది శ్రీవల్లి.

"పోలీసులేం చేస్తారు, ఇలాంటి బాబాలు అలాంటి ప్రమాదాలను ఎలా తప్పించుకొని తిరిగి తలెత్తుకొని, ఎలా తిరగాలో వాళ్ళకు బాగా తెలుసు" అంది శ్రీదేవి.

"సరే పోనియ్! నేనో నిర్ణయానికొచ్చాను. రేపు కార్తీక సోమవారం, మంచిరోజు, రేపు ఆగి, ఎల్లుండి ఉదయమే పెళ్ళిళ్ళ పేరయ్యను వెంటబెట్టుకుని ఉత్తరకోస్తా అంతా తిరుగుతా. పది దినాలు కానీ, పదిహేను దినాలు కానీ మంచి సంబంధం తీసుకునే తిరిగివస్తా. ఇదే నా శపథం!" అన్నాడు.

"ఇప్పుడంత రిస్కెందుకు బావా?"

"ఇందులో రిస్కేముంది, ఇదేమైనా బరువులు మోయడమా? వెళ్ళి రానీయ్! శుభమ్!" అంది శ్రీదేవి.

కార్తీక సోమవారం ఉషోదయం! మూర్తి మామూలుగా ఎక్సర్‌సైజులు చేస్తున్నాడు. ఐదుసార్లు అలా తన తలను, చేతులను కాళ్ళ మధ్యలో నుండి వెనక్కి విరుస్తూ... ఆరవసారి అలా విసిరి చూస్తే వెనుకెవరో నిలబడినట్లు కనపడింది.

ఒళ్ళు ఝల్లుమంది మళ్ళీ రంగస్వామి వచ్చాడేమోనని, లేచి వెనక్కి తిరిగి చూశాడు...

గుండెలు ఝల్లుమన్నాయి. ఎదురుగా శ్రీవల్లి, రాముడూ మెడలో పూలమాలలతో చేయి చేయి పట్టుకుని నిలబడి ఉన్నారు.

ఒక్కక్షణం నిర్ఘాంతపోయాడు మూర్తి. మరుక్షణం హుర్రే అని ఎగిరిగంతేస్తూ "శుభం... బావుంది... నాకిష్టమే! రాముడే సరైన అభ్యర్థి... ఇదే సరైన నిర్ణయం... అతనికేం బంగారం" అంటూ పిచ్చిపిచ్చిగా అరుస్తున్నాడు.

అరుపులకి శ్రీదేవి బయటకు పరుగెత్తుకొచ్చింది చేతిలో గరిటె ఉంది. ఐదు క్షణాలు నిశ్శబ్దం. ఒక్కసారిగా భోరుమంది. శ్రీవల్లి చెలించిపోయింది 'అక్కా' అంది పెద్దగా.

"నోర్మూయ్... నీకోసంగా నేను ఇన్నాళ్ళూ, నా రక్షణ కొరకేననుకో... నిన్ను నా పక్కలోనే పడుకోబెట్టుకున్నా. నన్ను కౌగిలించుకుని నిద్రపోయేదానివి. నన్నేమర్థం చేసుకున్నావ్? ఒక్కమాట... ఒక్కమాట... నా చెవిలో వేయలేకపోయావా?" అంది శ్రీదేవి.

"ఎన్నాళ్ళబట్టో మనస్సులో కదులుతున్నా కూడా, నిన్ననే... నిన్ననే అదొక నిర్ణయంగా రూపుదిద్దుకుందక్కా... జస్ట్ నిన్ననే రాముతో తొలిసారిగా ఈ విషయం చర్చించి ఆయన భాషలో అంగీకారం తీసుకొని ఈ నిర్ణయానికొచ్చాం.

నేను చేసింది తప్పనుకోవడం లేదు. మిమ్మల్నింకా ఇబ్బంది పెట్టకూడదనే... రండి మీ ఇద్దరి పాదాలకు మేమిద్దరం నమస్కరించేదాకా నాకు మనశ్శాంతి ఉండదు" శ్రీవల్లి బెక్కుతూ చెప్పింది.

"ఆగు! అన్ని తొందరే!ముందు ఎర్రనీళ్ళుతీయాలి" శ్రీదేవి లోపలికెళ్ళింది.

రాముడు, శ్రీవల్లి వెర్రినవ్వు నవ్వి ఊపిరి పీల్చుకున్నారు.

రమణమూర్తి కూడా రిలీఫ్‌గా ఒక్క నిట్టూర్పు విడిచాడు, వాళ్ళిద్దరినీ కావలించుకుంటూ.

కాలానుగుణంగా మారనివారు నా దృష్టిలో మార్క్సిస్టులు కానే కారు. -సీతారామ్ ఏచూరి,
సి.పి.ఎమ్. జాతీయ ప్రధాన కార్యదర్శి



# సెక్స్ AND సైకాలజీ



డా॥జి. సమరం

బి.కె. గుంటూరు

వీర్యం పలచగా ఉంటే గర్భం రాదా?

గర్భం రావడానికి వీర్యం పలచన, చిక్కన అనే దాంతో సంబంధం లేదు.గర్భం రావాలంటే వీర్యంలో వీర్యకణాలు తగినంత ఉండాలి.

వీర్యం పలచగా ఉన్నా, చిక్కగా ఉన్నా వీర్యకణాలు ఒకటేలాగా ఉంటాయి. వీర్యం ఎలా ఉన్నప్పటికీ కొందరిలో వీర్యకణాలు ఉండవు. గర్భం రాకపోవడానికి వీర్యకణాలు తగినంత లేకపోవడమే కారణం గాని వీర్యం పలచన, చిక్కన కారణం కాదు.

జి.ఆర్. కావలి

డిప్రెషన్ ఉన్నవారిలో సెక్స్ ఉండదా? ఎందుకిలా అడుగుతున్నానంటే నాకు డిప్రెషన్ వ్యాధి వచ్చింది. సెక్స్ విషయంలో ఎటువంటి ఆసక్తి లేదు. నా భార్య చాలా బాధపడుతుంది. నాకు సెక్స్ లేకపోవడానికి నాకు వచ్చిన డిప్రెషన్ వ్యాధే కారణమా?

డిప్రెషన్ వ్యాధి ఒక విధమైన మానసిక వ్యాధి. ఈ మానసిక వ్యాధి వచ్చినవాళ్ళల్లో లైంగిక వాంఛలు ఉండవు. లైంగిక వాంఛలు లేకపోవడంతో అంగస్తంభనలు ఉండవు. డిప్రెషన్ వ్యాధి తొలిగితే తిరిగి

Courtesy :NEW WOMAN

# వయసుతో పని లేదు

ఏ వయసుకు ఆ ముచ్చట అని మన పెద్దలు చెప్పిన మాట నేటికి వర్తిస్తుందో లేదో తెలియదు గాని సెక్స్‌కి మాత్రం వర్తించదంటున్నారు. వయసు ఏదైనా సెక్స్ గురించి ఆలోచించటం, సెక్స్‌ని అనుభవించటం ఆరోగ్యకర లక్షణం.

సెక్స్ అనేది వయసులో ఉండగా అనుభవించి, ఆ తరువాత విరామం ఇవ్వవలసిందనే మాటను మేము అంగీకరించమంటున్నారు.

ఇటీవలి కాలంలో అమెరికాలో జరిపిన ఒక సర్వేలో 65 నుండి 80 ఏళ్ళమధ్య వయసున్నవారిలో 40 శాతంమంది తామింకా లైంగికంగా చురుకుగా ఉంటున్నామని వివరించారు. పైగా తామిద్దరిలో ఆ కోర్కెలు హాయిగా జనిస్తున్నాయని, వాటిని అనుభవించటానికి ఎటువంటి ఇబ్బందీ లేకుండా చూసుకుంటున్నామని చెప్పారు.

వయసుమళ్ళినవారిలో ఆరోగ్యం అనే అంశంమీద జరిపిన సర్వే అది. ఆ సర్వేలో 65 ఏళ్ళు పైబడినవారు పాల్గొన్నారు. వారిలో చాలామంది చెప్పిన విషయం వయసుతో వచ్చే అనారోగ్యాలు పొడచూపకుండా ఉండటంలో సెక్స్ పాత్ర వహిస్తుందని.

పెద్దల సంక్షేమంలో సెక్స్‌కి పాత్ర ఉంటుంది అనే విషయం యువతరం గుర్తించటం లేదు. ఒక వయసుకు చేరారు కాబట్టి వారికి లైంగిక అవసరాలు ఉండవన్న అభిప్రాయం మన సమాజంలో ఉంది. చాలా కుటుంబాలలో పిల్లల అవసరంకోసం పెద్దలు విడివిడిగా ఉండటం కనిపిస్తుంది. మనుమలు, మనుమరాళ్ళ సంక్షేమం చూసుకుంటున్నామన్న ఆనందం వారిలో ఉండాలన్నది పిల్లల ఆలోచన.

కాబట్టి తమ తల్లిదండ్రులు విడివిడిగా ఒక్కొక్కరిని ఒకరిదగ్గర ఉంచుకుంటున్నారు.

ఆ ఎడబాటు వారికి అంగీకారమా! కాదా! అనే ఆలోచన పిల్లలకు కలగటంలేదు.

వాస్తవంలో వారు తమ మనసును చంపుకుని ఎడబాటును భరిస్తున్నారని అర్థమవుతుంది. శారీరక, మానసిక అవసరాల విషయంలో భారతీయులకు, అమెరికన్‌లకు పెద్దగా తేడా ఉంటుందనుకోలేం. అందుకే అమెరికా సర్వేలో బైటపడిన అంశాలను మన సమాజానికి అనువయించుకోవటం అవసరం.

వయసు ఏదైనా లైంగిక బంధం జంటలమధ్య కీలకపాత్ర పోషిస్తుందని వయసుమళ్ళిన దంపతులు అన్నారు. పురుషుల్లో 84 శాతం, స్త్రీలలో 69 శాతం ఆ విషయం ధృవీకరిస్తున్నారు.

పురుషులలో ప్రతి నలుగురిలో ఇద్దరు, స్త్రీలలో ప్రతి నలుగురిలో ఒకరు తమ చివరి రోజువరకు సెక్స్‌ని కావాలనుకుంటున్నారు. 65 సంవత్సరాలు పైబడినతరువాత సెక్సీ ఆలోచనలు ఉండటం ఏ మాత్రం తప్పుకాదు. 65 నుండి 75 ఏళ్ళమధ్య వయసున్నవారిలో 46 శాతంమంది తమ జీవితంలో నేటికీ సెక్స్ కీలకపాత్ర పోషిస్తున్నదని చెప్పగా, 76 ఏళ్ళు పైబడినవారిలో ముప్పయ్ శాతం ఆ మజానే వేరని అంగీకరిస్తున్నారు.

వయసు మీదపడిన జంటలు సెక్సీగా ప్రవర్తించటం, సెక్సీ అంశాలగురించి చర్చించటం అవసరమేనన్నది సర్వేలో చెప్పిన విషయం.

సెక్స్ అంశంలో మందులు వాడటం, నిపుణుల సహకారం తీసుకోవటంలో తప్పులేదని, తాము ఆ పనిచేస్తున్నామని చెప్పారు.

పడకటింటి వాతావరణం, అలంకరణ రెండూ వయసు మళ్ళినవారిలో కూడా సెక్సీ కోర్కెలను తెస్తాయి. దీనికీ, వయసుకు సంబంధం లేదు. వయసు పెరిగిందని, పనులు చేయలేకపోతున్నామని విసుక్కునే చాలామంది ఆడవారి సమస్య వారికి తగినంత సెక్స్ అందకపోవటమేనని తేల్చారు.

సెక్స్ తృప్తి ఉన్న ఆడవారు ఇంటిపనిలో హుషారుగా పాల్గొంటున్నారన్నది వారి మాట. మానసిక, శారీరక ఆరోగ్యం అన్ని వయసుల్లో కాపాడే సెక్స్ గురించి పాతభిప్రాయాలు మారాల్సివుంది. ◆

## Sex and sexual health is very important to the well being of older people

మామూలుగా లైంగిక వాంఛలు కలుగుతాయి. సెక్స్‌లో పాల్గొనగల్గుతారు. అందుకని డాక్టర్ చెప్పినట్లు సరిగ్గా చికిత్స పొందండి.

జె.కె. బెంగళూరు

*సెక్స్‌లో దంపతులిద్దరికీ చక్కని థ్రిల్ కలగాలంటే ఇద్దరికీ ఒకేసారి భావప్రాప్తి కలగాలా?*

సాధారణంగా రతిలో పాల్గొన్నప్పుడు కాస్త ఇటు, అటుగా ఒకేసారి భావప్రాప్తి కలుగుతుంది. స్త్రీల విషయం తీసుకుంటే భావప్రాప్తి కలగగా అది మరి కొంత సమయం కొనసాగుతూ మనస్సుని మురిపిస్తూ ఉంటుంది. పురుషుని విషయంలో ఈ పరిస్థితి వేరుగా ఉంటుంది.

వీర్యస్ఖలనం జరుగుతున్నప్పుడు క్లైమాక్స్‌లో సుఖప్రాప్తి కలుగుతుంది. వీర్యస్ఖలనం అయిపోగానే ఇక అటువంటి అనుభూతి కొనసాగదు. కాని స్త్రీల భావప్రాప్తి అనేది వేరుగా ఉంటుంది. అందుకని రతిలో పాల్గొన్నప్పుడు పురుషునికంటే స్త్రీకి ముందుగా భావప్రాప్తి కలగడం మంచిది.

పురుషునికే ముందుగా సుఖప్రాప్తి కలిగితే స్త్రీకి అసంతృప్తి కలుగుతుంది. అందుకని స్త్రీకి ముందుగా భావప్రాప్తి కలగడం మంచిది. ఆమెలో కలిగిన మధురానుభూతులు పురుషుని వీర్యస్ఖలనం అయ్యేవరకు కొనసాగుతూనే ఉంటాయి.

ఫోర్‌ప్లే ద్వారా ముందుగా స్త్రీకి సుఖానుభూతి కలిగేటట్లు చేసినట్లయితే ఆ తర్వాత పురుషుడు కొనసాగించే రతి ఆమెకు మరింత హాయిని, తృప్తిని ఆనందానుభూతిని కలిగిస్తుంది.

ఎస్.జి. నెల్లూరు

*నా వయస్సు 50 సంవత్సరాలు. నిన్నా, మొన్నటి వరకు నేను సెక్స్‌లో చాలా బాగా ఎంజాయ్ చేశాను. ఇటీవల కాలంలో నాకు అంగస్తంభనలు సరిగా ఉండటంలేదు. కోరిక ఫుల్‌గానే ఉంటోంది. కాని రతిలో పాల్గొన్నప్పుడు అంగం స్ట్రాంగ్ అవకపోవడంతో నాకూ మా ఆవిడకు అసంతృప్తే మిగులుతోంది.*

*నాకు కొలెస్ట్రాల్ చాలా ఎక్కువగా ఉందని, మందులు ఇచ్చారు. పురుషునికి కొలెస్ట్రాల్ ఎక్కువగా ఉంటే అంగస్తంభనలు ఉండవా? కొలెస్ట్రాల్ తగ్గితే అంగం తిరిగి స్ట్రాంగ్ అవుతుందా?*

*సెక్స్‌లో నేను తరచూ ఫెయిల్ అవుతూ ఉండటంతో మనశ్శాంతి కరువవుతోంది.*

*భార్య దగ్గర చవటలాగా మిగిలిపోవలసి వస్తోంది. ఈ విషయంలో నన్ను మీరే రక్షించాలి.*

కొలెస్ట్రాల్ ఎక్కువగా ఉంటే రక్తనాళాలు సన్నబడతాయి. ముఖ్యంగా పురుషాంగానికి రక్తాన్ని సరఫరాచేసే రక్తనాళాలు త్వరగా సన్నబడతాయి.

కొలెస్ట్రాల్‌వల్ల గుండెకు, మెదడుకు రక్తం సరఫరా చేసే రక్తనాళాలు సన్నబడటం, మూసుకుపోవడం ఉంటుంది. వాటివల్ల హార్ట్‌ఎటాక్‌లు, బ్రెయిన్ స్ట్రోక్‌లు వస్తాయి. గుండె, మెదడుకి సంబంధించిన రక్తనాళాల కంటే పురుషాంగానికి రక్తం సరఫరాచేసే రక్తనాళాలు మామూలుగానే మరింత సన్నగా ఉంటాయి.

అందువల్ల కొలెస్ట్రాల్ దుష్ప్రభావం సెక్స్‌మీద కనపడుతుంది. అందుకనే రక్తనాళాలు సన్నబడి యాంజైనా గుండెనొప్పి లేదా హార్ట్‌ఎటాక్ రావడానికి మూడు, నాలుగు సంవత్సరాల ముందే అంగస్తంభన వైఫల్యాలు ఏర్పడతాయి.

దీనికి కారణం పురుషాంగానికి రక్త సరఫరా చేసే రక్తనాళాలు సన్నగా ఉండటం, కొలెస్ట్రాల్‌వల్ల మరింత త్వరగా సన్నబడటమే.

కొలెస్ట్రాల్ ఎక్కువగా ఉన్నవాళ్ళు మందులు వాడటమే కాకుండా రెగ్యులర్‌గా వ్యాయామం చేయడం, ఆహారంలో కొవ్వు పదార్థాలని బాగా తగ్గించడం, స్మోకింగ్, డ్రింకింగ్, పాన్‌పరాగ్ అలవాట్లు పూర్తిగా మానివేయడం అవసరం. అలా చేస్తే పురుషాంగానికి రక్తం సరఫరాచేసే రక్తనాళాలు తిరిగి ఆరోగ్యంగా మారి అంగస్తంభనలు బాగానే జరుగుతాయి.

డాక్టర్ సలహాపై సిలిడినాఫిల్ లేదా టాడాల్ఫిల్ బిళ్ళలు కూడా వాడవచ్చు. దానివల్ల అంగస్తంభనలు మరింత స్ట్రాంగ్‌గా తయారవుతాయి.

డా॥ జి.సమరం వాసవ్య నర్సింగ్‌హోమ్ బెంజిసర్కిల్ విజయవాడ 520 010 ఫోన్ 0866-2472370 E-mail drsamaram@hotmail.com www.gsamaram.com

▶■ సీరియల్

# వేట

## పుట్టగంటి గోపీకృష్ణ



అంత హఠాత్తుగా అతను ఫోన్ ఎందుకు పెట్టేశాడో ఆమెకు అర్థం కాలేదు. తిరిగి అతనికి ఫోన్ చేసింది. అతను రెస్పాండ్ కాలేదు.

పైగా ఇంకో రెండుసార్లు ఫోన్‌చేశాక సిమ్‌కార్డ్ డిస్కార్డ్ చేసినట్లు అర్థమయి నిట్టూర్చి ఊరుకుంది లక్ష్మి. ఆమె ఆలోచనలన్నీ ఇంతపెద్ద కలకత్తాలో అతన్ని ఎలా వెతికి పట్టుకోవాలా అనే విషయం మీదే కేంద్రీకృతమయిఉన్నాయి.

ఆమె ఇచ్చిన హింటుతో అప్పటివరకు అతనికి తట్టని పాయింట్ తట్టింది. నిజంగానే ఆ సుమిత్ బోస్‌కి తను వస్తున్నాడని తెలిసిపోయిందా? కానీ, తన ఉనికి అతనికి ఎలా తెలుస్తుంది? పూరన్‌సింగ్, కుట్టి, సుమిత్, లిమ్బ్రెన్ ఒకరి ఫోన్ నెంబర్లు ఒకరు మార్చుకున్నారని తనకు తెలుసు.

సుమిత్ కానీ లిమ్బ్రెన్ కానీ మిగిలినవారిని కాంటాక్ట్ చేయబోయి ఉంటారా?

అలా అయితే వారు మరణించిన విషయం తెలిసిపోతుంది అప్పుడు తను ప్రాణరక్షణ కోసం అండర్‌గ్రౌండ్‌కు వెళ్ళినా వెళ్ళి ఉంటారు.

ఆ ఆలోచన రాగానే తను చేయవలసింది ఏమిటో అర్థమయింది. వెంటనే RAW లో తన అసిస్టెంట్ కుమార్‌కి ఫోన్ చేశాడు.

ఫోన్ ఎత్తిన కుమార్ అవతల వైపు ఉంది అవినాష్ అని తెలిసి ఎగ్జయిట్ అయ్యాడు. "నాలుగు రోజులుగా ఏమయ్యారు సార్?" అన్నాడు.

కుమార్ గొంతు వినగానే తను అడగదలచుకున్న విషయం మరచిపోయాడు.

అవినాష్, తామిద్దరు కలిసి కష్టపడి సాల్వ్ చేసిన డేవిడ్ కేసు గుర్తుకువచ్చింది. "నీవడిగిన ప్రశ్నకు సమాధానం చెప్తా కానీ, ఒకమాట చెప్పవోయ్. నీకు అప్పచెప్పిన కేసు ఎంతవరకు వచ్చింది? ఆ రోజు నేను డీకోడ్ చేసిన డేవిడ్ పట్టుబడ్డాడా?"

"లేదు సార్. అతను అండర్ గ్రౌండ్‌కి వెళ్ళి



పోయాడు" అన్నాడు కుమార్.

"నేను లేకపోతే మీరు ఒక్క పని కూడా సరిగ్గా చేయరా కుమార్..."

"అదేం లేదు సార్. వాడు దొరక్క ఎక్కడికిపోతాడు. ఇంతకీ మీరు ఏమయిపోయారో అర్థం కాక నేను గందరగోళంలో ఉన్నాను" అన్నాడు కుమార్.

"త్వరలో అన్నీ నీకే తెలుస్తాయిలే! నాకు ఒక హెల్ప్ చేయాలి. చేస్తావా?"

"చెప్పు బాస్"

"నాలుగు ఫోన్ నెంబర్లు ఇస్తాను. గత నాలుగు రోజులుగా ఆ ఫోన్ నెంబర్ల నుండి ఒకరికి ఒకరు చేసుకున్న కాల్స్ రికార్డింగ్స్ కావాలి"

"బట్! దటీజ్ ఇల్లీగల్"

"నేను ఇప్పుడు నిన్ను లా పొజిషన్ అడగలేదు. నాకు కావలసింది అడిగాను"

"పైవాళ్ళకి తెలిస్తే ఉద్యోగం పోతుంది"

"వాళ్ళ అనుమతి తీసుకుని చేసే పనయితే నిన్ను అడగటం ఎందుకు? వాళ్ళనే అడిగేవాడినిగా. ముందు చేస్తావా, చెయ్యవా చెప్పు"

"భయం వేస్తుంది బాస్"

"నేను తిరిగివచ్చిన తర్వాత డ్రింక్ పార్టీ ఇస్తాను. ఈ లోగా ఫుల్లుగా మందు కొట్టాలని ఫీల్ అవు. ధైర్యం అదే వస్తుంది"

"ఓ.కె. బాస్! ప్రయత్నిస్తాను"

"ప్రయత్నించటం కాదు. ఆ వివరాలన్నీ అర గంటలో నాకు మెయిల్‌లో పంపు" ఆర్డర్ వేశాడు అవినాష్. కుమార్ తను చెప్పిన పని చేయటానికి మరో అరగంట పడుతుంది. ఈ లోపల కాస్త కడుపుకు మేత వెయ్యాలన్నా కిందకు వెళ్తే ఎక్కడ లక్ష్మి కనిపిస్తుందో అని భయంగా ఉంది.

ఆర్డర్ చేసి రూముకే డిన్నర్ తెప్పించుకున్నాడు. డిన్నర్ చేసేటప్పటికి కుమార్ పంపిన మెయిల్ వచ్చింది. అందులో ఎన్నో రికార్డింగులు లేవు. మూడే కాల్స్. ఒకటి సుమిత్ బోస్ పూరన్‌సింగ్ నెంబరుకు చేసిన కాల్ రికార్డింగ్.

రెండోది సుమిత్ బోస్ కుట్టికిచేసింది. ఇక మూడోది సుమిత్ లిమ్సెన్‌కి చేసింది.

మూడింటిని జాగ్రత్తగా విన్న అవినాష్‌కి జరిగిందేమిటో తెలిసింది. వెంటనే ఒక విమానం టికెట్ నాగాలాండ్‌లోని దీమాపూర్‌కి బుక్ చేశాడు.

రూములో నుండి మరే పనికీ కిందకు దిగక పోయినా పరవాలేదు కానీ రూమ్ వెకేట్ చేయటానికి దిగక తప్పలేదు అవినాష్‌కి.

అతను రూమ్ వెకేట్ చేస్తూ చుట్టూ చూశాడు. ఎక్కడా లక్ష్మి కనిపించకపోవటంతో ఊపిరి పీల్చుకున్నాడు. ముందే ఆర్డర్ చేయటంతో ట్యాక్సీ కూడా రెడీగా హోటల్ ఎదురుగా ఉంది.

రిసెప్షనిస్ట్ ఇచ్చిన బిల్‌పై సైన్ చేసి, 'హమ్మయ్య' అనుకున్నాడు అవినాష్. అదే సమయంలో హోటల్ టాప్ ఫ్లోర్ నుండి కిందకు దిగుతోంది లక్ష్మి. ఆ లిఫ్ట్ చుట్టూ గోడలు కూడా గ్లాస్‌తో ఉండి చుట్టూ ఉన్న పరిసరాలు కనిపిస్తున్నాయి.

**జరిగిన కథ** **10**

అవినాష్‌కోసం మధుర రైల్వేస్టేషన్‌లో లక్ష్మి నిఘా పెడుతుంది. ట్రైన్‌దిగిన అవినాష్, తనని లక్ష్మి వెంటాడుతున్నదని గ్రహించి ట్యాక్సీలో పారిపోతుంటాడు. ఆ విషయం పసిగట్టిన లక్ష్మి, అవినాష్‌ని వెంటాడుతుంది.

ఈలోగా ఢిల్లీ పోలీస్ అధికారి లక్ష్మికి ఫోన్ చేసి నువ్వు సమాచారం అడిగిన అవినాష్ దొరికాడా, అతను ఇంకో మర్డర్ చేశాడు దొరికితే అప్పగించమని కోరతాడు.

ఢిల్లీ సెంట్‌హౌస్‌లో న్యూక్లియర్ బాంబ్ తయారుచేయడంలో సహకరించిన మరొక నేరస్తుడు కుట్టిని చంపేస్తాడు అవినాష్.

లక్ష్మి కొచ్చిన్ వస్తుంది. అవినాష్ ఆచూకీని కనుక్కునేందుకు ప్రయత్నిస్తుంది.

అవినాష్ తప్పించుకున్నాడని గ్రహించి కలకత్తా బయల్దేరుతుంది లక్ష్మి.

పూరన్‌సింగ్ నారాయణకుట్టి ఇద్దరూ చనిపోయారని తెలుసుకుంటాడు మరో నేరస్తుడైన సుమిత్‌బోస్. వరుసగా ఎందుకు హత్యలు చేస్తున్నావ్ అని అవినాష్‌ని ఫోన్లో అడుగుతుంది లక్ష్మి. తర్వాత జరగబోయేది చదవండి.

లిఫ్టులో నుండి లాబీలో ఉన్న రిసెప్షన్ ఏరియా, అక్కడ నిలబడ్డ అవినాష్ స్పష్టంగా కనిపిస్తున్నారు. తను చూస్తున్నది నిజమేనా అన్నట్లు తనను తాను గిచ్చి చూసుకుంది లక్ష్మి.

అంటే ఇప్పటిదాకా ఇద్దరూ ఒకే హోటల్‌లో ఉన్నారన్న మాట. తను ఈ హోటల్ తప్ప ఊర్లో మిగిలిన హోటళ్ళన్నీ వెతికివచ్చింది.

ఇంతలో అవినాష్ రిసెప్షన్ నుండి హోటల్ బయటకు నడుస్తున్నాడు. ఆమె ఎంత గింజుకున్నా కిందకు దిగుతున్న లిఫ్టు మధ్యలో వేరేవారిని దింపటానికి ఆగకమానలేదు. ఆమె చూస్తుండగానే అవినాష్ బయటకువెళ్ళి ట్యాక్సీ ఎక్కాడు.

లిఫ్టు ఆగగానే పరుగెత్తుతూ ట్రావెల్ డెస్క్ దగ్గరకు వెళ్ళిన లక్ష్మి రొప్పుతూ-

"ఇప్పుడు వెళ్ళిన తను ట్యాక్సీని ఎక్కడకు బుక్ చేసుకున్నారు?" అని అడిగింది.

"ఎయిర్‌పోర్ట్‌కి" చెప్పాడతను.

తను కూడా పరుగెత్తుతూ బయటకు వెళ్ళి ఒక ట్యాక్సీ ఎక్కి "ఎయిర్‌పోర్టుకు పోనివ్వు" అంది.

"నువ్వు ఎంత త్వరగా తీసుకువెళ్తే అంత బోనస్ ఇస్తాను" అని ఆ డ్రైవర్‌కి ఆశకూడా పెట్టింది. దానితో ఆ డ్రైవర్ తన ప్రతిభనంతా చూపిస్తూ ఆమెను అత్యంత వేగంగా ఎయిర్‌పోర్ట్ చేర్చాడు.

చుట్టూ చూసింది లక్ష్మి. అక్కడ అవినాష్ ఎక్కడా కనిపించలేదు. ఇంతలో అవినాష్ ఎక్కిన ట్యాక్సీ వస్తూ



కనిపించింది. కొద్దిగా చాటుకు జరిగింది లక్ష్మి. అవి నాష్ గేటు దగ్గర టికెట్ చూపించాడు.

సెక్యూరిటీ అతను టికెట్, ఐడీ పరిశీలించి అతన్ని లోపలకు పంపాడు. అతను లోపలకు వెళ్ళగానే ఆ గార్డ్ దగ్గరకు వెళ్ళింది లక్ష్మి.

"ఇంతకుముందు లోపలకు వెళ్ళినతను ఏ ఊరుకు వెళ్తున్నారు?" అని అడిగింది.

అతను యధాలాపంగా "దీమాపూర్" అని ఊరి పేరు చెప్పాడు. పరుగెత్తుతూ పక్కన ఉన్న ఎయిర్‌లైన్స్ కౌంటర్ దగ్గరకు వెళ్ళి దీమాపూర్‌కి టికెట్లు ఉన్నాయా అని అడిగింది లక్ష్మి.

"ఓన్లీ ఒన్ టికెట్ ఎవైలబుల్. యూ ఆర్ లక్కీ" అంది వెంటనే అక్కడ అమ్మాయి.

మాట్లాడకుండా ఆ అమ్మాయి చెప్పినంత పేచేసి టికెట్ తీసుకుని లోపలకు నడిచింది లక్ష్మి.

అప్పటికే అవినాష్ బోర్డింగ్ పాస్ తీసుకుని సెక్యూరిటీ చెక్ వైపు వెళ్తున్నాడు. తనుకూడా బోర్డింగ్ పాస్ తీసుకుని ముందుకు నడిచింది ఆమె.

విమానాశ్రయం లాంజ్‌లో కూర్చుని హోటల్ వాళ్ళకి ఫోన్ చేసి తను అనుకోకుండా వేరే ఊరు వెళ్ళిపోతున్నానని, తన సామాను ప్యాక్ చేసి తన అడ్రస్‌కు పంపమని చెప్పింది. తన అడ్వాన్స్ నుండి బిల్ ఎమౌంట్ తీసుకుని మిగిలిన అమౌంట్ తన బ్యాంక్ ఎకౌంటుకి పంపమని చెప్పింది.

దీమాపూర్ వెళ్ళే విమానం చిన్నది. నూరుమంది ప్రయాణికులు మాత్రమే పట్టేది. అంత తక్కువ మందిలో తను అవినాష్‌కి కనిపించకుండా ఉండటానికి ఆమె చాలా కష్టపడవలసివచ్చింది.

దీమాపూర్ ఎయిర్‌పోర్ట్ కూడా ఒక చిన్న టౌన్ బస్టాండ్‌లా ఉంది. రోజుకి రెండు మూడు విమానాలు దిగే ఎయిర్‌పోర్ట్ అలా కాక ఎలా ఉంటుందని సరి పెట్టుకుంది ఆమె. ఎయిర్‌పోర్ట్ బయటకు వచ్చిన అవినాష్ ట్యాక్సీ ఎక్కి వెళ్ళిపోతున్నాడు. తను కూడా మరో ట్యాక్సీలో అతన్ని అనుసరించింది ఆమె.

అతను ప్రయాణిస్తున్న ట్యాక్సీ ఒక హోటల్ ముందు ఆగింది. అతను లోపలకు వెళ్ళాక ఒక పది నిమిషాలు సమయం ఇచ్చి తను కూడా అదే హోటల్లో మరో రూము తీసుకుంది. 'ఇక నన్ను తప్పించుకుని ఎక్కడకు పోతావో చూస్తాను...' అనుకుంది లక్ష్మి.

## అమ్మతోడిదే లోకం

టీనేజీలోకి కూడా రాకముందే కెరీర్‌కు శ్రీకారం చుట్టిందేమో తమన్నా వెంట వాళ్ళమ్మ రజనీ భాటియా ఎప్పుడూ వుండేదట.

"నేను చిన్నప్పటినుంచే యాడ్స్ చేయడం ఆరంభించాను. ఆ తర్వాత సినిమాలు. కాబట్టి స్నేహాలకు పెద్దగా అవకాశం లేకపోయింది. ఎక్కడికి వెళ్ళినా అమ్మతోనే. తనెప్పుడూ నా వెన్నంటే వుండేది.

ఇన్ని భాషల సినిమాల్లో నేను సక్సెస్ కావడానికి కారణం మా అమ్మే. ఎంతో ధైర్యాన్ని నూరిపోస్తుంది. మరెంతో ప్రోత్సాహం అందిస్తుంది.

ఒక్క మాటలో చెప్పాలంటే అమ్మ నాకోసం తన జీవితాన్ని ధారపోసింది" అంటూ అమ్మకు అనేక కితాబులు ఇచ్చింది తమన్నా.

నాగాలాండ్ 1963లో ఇండియాలో అంతర్లీనమైన రాష్ట్రం. దీనిరాజధాని కొహిమా. పెద్ద నగరం దీమాపూర్.ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో పదోవంతు ఉండే రాష్ట్రం. జనాభా ఇరవై లక్షలు.

నాగాలాండ్ 17 గిరిజన తెగల సమాహారం. ఒక్కొక్క తెగకి తమదైన ప్రత్యేకమయిన ఆచారాలు, వేషభాషలు, కట్టుబాట్లు ఉన్నాయి.

ఎవరి భాష వారికి ఉంది.

అయితే ప్రస్తుతం అందరినీ ఏకం చేస్తున్న సూత్రం ఇంగ్లీషు భాష, క్రిస్టియానిటీ మతం.

పూర్తిగా పర్వత ప్రాంతాలతో నిండి ఉన్న నాగాలాండ్ ఒకప్పుడు హెడ్‌హంటింగ్‌కి ప్రసిద్ధి చెందింది. తమ వీరత్వానికి ప్రతీకగా ప్రత్యర్థుల తలలు నరికి వాటిని ఇంటిముందు అలంకరణగా ఉంచుకునే వారు. పందొమ్మిదవ శతాబ్దంలో ఈ హెడ్‌హంటింగ్ మీద నిషేధం విధించాక ఆ ఆచారం చాలావరకు తగ్గినా పూర్తిగా సమసిపోలేదు.

నాగాలాండ్ మరొక విషయానికి కూడా ఎప్పుడూ వార్తల్లో నిలుస్తుంటుంది. నాగాలాండ్‌కు మయన్మార్‌తో ఉన్న సరిహద్దు పూర్తిగా పర్వతప్రాంతం.

ఎంత కాపలా ఉన్నా మనుషులు ఒక పక్క నుండి మరోవైపు వెళ్ళకుండా ఆపటం అసాధ్యం. అందుకే మయన్మార్ తీవ్రవాదులు అటు తమమీద ఒత్తిడి ఎక్కువయినపుడు ఇటు వచ్చేస్తుంటారు. నాగాలాండ్ అడవుల్లో గిరిజనులు, తీవ్రవాదులమధ్య ఆధిపత్యపోరుకూడా సర్వసామాన్యం.

అలాంటి రాష్ట్రంలో ఒక గిరిజన తెగ నాయకుడు సుజో.అతని కొడుకు లిమ్సెన్.

కొడుకును కొహిమా పంపి బాగా చదివించాడు సుజో. అలా చదువుకుంటున్నప్పుడే లిమ్సెన్‌కి మయన్మార్ తీవ్రవాదులతో సంబంధాలు ఏర్పడ్డాయి.

వారు అలవాటు చేసిన డ్రగ్స్‌కి అతను పూర్తిగా బానిస అయ్యాడు. ఆ డ్రగ్స్ కోసం వారు ఏమి చెప్తే అది చేసేవాడు. ఒకసారి మయన్మార్ తీవ్రవాదుల కోసం కొరియా ఎయిర్‌డ్రాప్ చేసిన ఆయుధాలు పొరపాటున భారత భూభాగంలో పడ్డాయి.

అది కూడా లిమ్సెన్ తండ్రి ఆధిపత్యంలో ఉన్న అటవీ ప్రాంతంలో పడ్డాయి. వాటిని సంపాదించటం కోసం లిమ్సెన్ తండ్రి సుజో సహాయం తీవ్రవాదులకు అవసరం అయింది.

సుజోకి స్వతహాగా ఇలాంటి విషయాలు ఇష్టం లేకపోయినా, కొడుకు బలవంతం మీద ఆ తీవ్రవాదులకు సహాయం చేశాడు.

అయితే ఆ విషయాలన్నీ పక్కా వీడియో సాక్ష్యాలతో ఎవరో సేకరించారు. వాటిని ఒక డి.వి.డి.గా తయారుచేసి లిమ్సెన్‌కి పంపారు.

ఈ విషయం భారత అధికారులకు తెలియకుండా ఉంచాలంటే అతన్ని తమపని ఒకటి చేయమన్నారు. లిమ్సెన్‌కి ఒప్పుకోక తప్పలేదు.

అప్పటి నుండి లిమ్సెన్ వారు చెప్పిన ఒక ఇంగ్లీషు పేపర్లోరాబోయే




**దేశాన్ని విభజించాలన్న ఉద్యమం చేస్తున్న ఉగ్రవాదులు ఎంతమంది చనిపోయారన్నది సైన్యానికి పట్టదు. వారిని అణిచివేస్తాం.**

-జనరల్ బిపిన్ రావత్, ఆర్మీ చీఫ్

యాడ్ కోసం ఎదురుచూస్తూ గడిపాడు. ఎట్టకేలకు అది కనిపించాక మనాలీ వెళ్ళి తన తదుపరి ఆదేశాలను అందుకున్నాడు.

ఆ ఆదేశాలకు అనుగుణంగా ఒరిస్సాతీరంలో ఆగిన ఒక నావనుండి కొన్ని వస్తువులు సేకరించి ఢిల్లీలో ఉన్న వినోద్ నాయక్ పెంట్‌హౌస్‌కు తరలించాడు. తరువాతే అనుకోనిది జరిగింది.

అక్కడ ఏర్పాటు చేసిన బాంబ్ పేలలేదు. అయినా తనకు అప్పచెప్పిన పని పూర్తి చేశాను కాబట్టి తనకు ఏమీ కాదనుకున్న లిమ్బెన్‌కు ఆశాభంగం కలిగిస్తూ సుమిత్ బోస్ నుండి ఫోన్ వచ్చింది.

తమతోపాటు పనిచేసినవారు ఒకరి తరువాత ఒకరు మరణిస్తున్నారని తెలిసి లిమ్బెన్ కూడా భయపడ్డాడు. అయితే భారతదేశంలోని మిగిలిన ప్రాంతానికీ, నాగాలాండ్‌కీ తేడా ఉంది. ఇక్కడ ఒక మనిషిని కనిపెట్టటం అంత తేలిక కాదు.

పైగా అతని తండ్రి ఒక తెగ నాయకుడు. వెళ్ళి అడవుల్లో దాక్కుంటే వారిని బయటకు తేవటం ఎవరితరమూ కాదని అతను భావించాడు.

అందుకే సుమిత్ బోస్‌ని కూడా ఇక్కడకే వచ్చేయమని ఆఫర్ ఇచ్చాడు.

ప్రస్తుతం వారిద్దరూ లిమ్బెన్ తండ్రి సుజో తెగకు చెందిన అటవీ ప్రాంతంలోని గూడెంలో తల దాచుకున్నారు. అయితే వారికి తెలియని విషయం ఏంటంటే... తమ కోసం వెతుకుతూ వస్తున్న మనిషి ఈ ప్రాంతంలో కమాండోగా పనిచేశాడనీ, అతనికి ఇక్కడి విషయాలు కొట్టినపిండి అని...




అవినాష్ తీరిగ్గా హోటల్ గదిలో కూర్చుని ఉన్నాడు. అతను తనముందు ఉన్న సమస్యని ఎనలైజ్ చేసుకుంటున్నాడు.

సుమిత్ బోస్, లిమ్బెన్ ఇద్దరూ ఇక్కడే ఉన్నారని తెలుసు. కానీ సరిగ్గా వారు ఎక్కడ ఉన్నారో తెలుసుకోకుండా వారిని వెతకటం అంటే ఎడారిలో ఇసుక రేణువును వెతకటంలాంటిది. దానికి కొన్ని సంవత్సరాలు కూడా పట్టవచ్చు.

కానీ అతను ఒక పద్ధతి ప్రకారం ఆలోచిస్తూ వస్తున్నాడు. లిమ్బెన్ ఎక్కడ దాక్కునే అవకాశం ఉంది? పట్టణ ప్రాంతాల్లో అతను ఎట్టి పరిస్థితుల్లో ఉండడు. అడవుల్లోకి వెళ్ళి ఉండాలి.

అడవుల్లో ఉన్న గిరిజనతెగల మధ్య ప్రస్తుతం ఒకరిని ఒకరు నరుక్కునే శత్రుత్వం లేకపోయినా, వేరే తెగకి చెందినవాడిని దాచే ఔదార్యం కూడా ఉండదు. కాబట్టి లిమ్బెన్ తప్పనిసరిగా తన తండ్రి సుజో పలుకుబడిలో ఉన్న ప్రాంతానికి వెళ్ళిపోయి ఉంటాడు. కాబట్టి తనుకూడా అక్కడకు వెళ్ళాలి. అక్కడకు వెళ్ళాక జరగాల్సింది ఏమిటన్నది అప్పటి పరిస్థితులను బట్టి ఆలోచించుకోవాలి.

టుయాన్‌సాంగ్ జిల్లాలో ఉంది సుజో ఉండే అటవీ ప్రాంతం. అక్కడకు వెళ్ళటానికి ఎలాంటి ప్రయాణ సాధనాలూ ఉండవు. కాలినడకన వెళ్ళాలంటే రోజులు పడుతుంది. పైగా కొత్తమనిషి ఒకడు అక్కడకు రహస్యంగా వెళ్ళటం అసాధ్యం.

అతని మనసులో తనకు ఇంతకుముందు ఉన్న పరిచయాలు మెదిలాయి.

వారిద్వారా అటవీప్రాంతంలోకి వెళ్ళటానికి అతని మనసులో ఒక ప్లాన్ రూపుదిద్దుకుంటోంది.

అదే సమయంలో లక్ష్మి హైదరాబాద్ పోలీస్ అధికారులతో మాట్లాడుతోంది.

"అతను ఇక్కడే ఉన్నాడు సార్. ఈ అవకాశం తప్పిపోతే అతన్ని పట్టుకోవటం అసాధ్యం"

"ఆర్యూ ష్యూర్?"

"నేను కూడా అతను ఉన్న హోటల్లోనే ఉన్నాను. అతను ఉన్న గది నెంబర్ కూడా తెలుసు. మీరు లోకల్ పోలీసుల సాయం తీసుకుంటే అతన్ని అరెస్ట్ చేయటం పెద్ద విషయం కాదు"

"నేను ఇప్పుడే నాగాలాండ్ డి.జి.పి.ని సంప్రదిస్తాను. నువ్వు చెప్పిన సమాచారం వారికి అందచేస్తాను. నువ్వుమాత్రం ఎక్కువ అడ్వెంచర్ చెయ్యకు. అసలే నీ దగ్గర ఆయుధాలు కూడా లేవు.

అతను ప్రమాదకర వ్యక్తిలా కనిపిస్తున్నాడు..." అని సలహా చెప్పాడు ఆ అధికారి.

ఆ తరువాత అతను నాగాలాండ్ పోలీసులను సంప్రదించాడు. వారితో దీర్ఘంగా సంప్రదింపులు జరిపిన తరువాత తిరిగి లక్ష్మికి ఫోన్ చేశాడు.



## చదువు ముగిసింది

ఈమధ్యే ఆర్కిటెక్చర్‌లో డిగ్రీ పూర్తిచేసిన నివేదా థామస్ జరిగిపోయిన కాలేజీ రోజుల్ని గుర్తుచేసుకుని ఒకటే సంబరపడిపోతున్నది.

"ఐదేళ్ళ చదువు, ప్రయాణాలు అన్నీ ముగిశాయి. కాలేజీ టూర్ మిస్సవకూడదని సినిమా డేట్స్‌కూడా రీషెడ్యూల్ చేసుకున్నాను. సెట్స్‌లో డ్రాఫ్టింగ్ చేసుకునేదాన్ని. ఫ్లైట్‌లో స్కెచ్‌లు గీసేదాన్ని.

సెమిస్టర్ సెలవుల్లో సినిమాలకు డేట్స్ ఇవ్వడం, ఇంకొన్నిసార్లు అసలేవీ ఇవ్వలేకపోవడాలతో అన్ని క్లిష్టతలూ అధిగమించి డిగ్రీ పూర్తిచేశా.

స్టడీ బ్రేక్స్, మూవీబ్రేక్స్‌తో నా ప్రయాణం సాగింది. ఇందుకు సహకరించినవారందరికీ థ్యాంక్స్" అంటూ ఉత్సాహంగా చెప్పింది.



"తెల్లవారుజామున పోలీస్ రైడ్ జరుగుతుంది. అప్పుడయితే అతను నిద్రలో ఉంటాడు. అతని ఆచూకీ తెలుసుకోవటంలో నీ పని చాలా సమర్థంగా నెరవేర్చావు. ఇక మిగిలింది లోకల్ పోలీసులకు వదిలెయ్..." అని చెప్పాడు.

కమాండోగా ట్రైనింగ్ పొందినప్పటి నుండి అవినాష్‌కి ఒక అలవాటు ఉంది. అతను తన శక్తి సామర్థ్యాలకు ఎంతటి ప్రాముఖ్యం ఇస్తాడో, తన సిక్స్త్ సెన్స్‌కు కూడా అంతే ప్రాముఖ్యం ఇస్తాడు.

మరుసటిరోజు తను చేయవలసిన పనిని నిశ్చయించుకుని ఆ రాత్రికి రెస్ట్ తీసుకోబోతున్నాడు అవినాష్. మంచంమీద పడుకున్నాడన్నమాటేకానీ నిద్రపట్టటంలేదు. అతని మనసు ఎందుకో ప్రమాద సంకేతాలు పంపుతోంది.

లేచి గదిలో లైటు వేయకుండా కిటికీ దగ్గరకు నడిచి తెర తొలగించి బయటకు చూశాడు.

గదిలో నుండి హోటల్ ఎదురుగా మెయిన్ రోడ్డు స్పష్టంగా కనిపిస్తోంది. బాగా పొద్దుపోవటంతో రోడ్డంతా ఖాళీగా ఉంది. అనుమానాస్పదంగా ఏమీ కనపడటం లేదు. సమయం చూసుకున్నాడు.

రాత్రి ఒంటిగంట అవుతోంది.అతను ట్రైనింగ్‌లో నేర్చుకున్న ముఖ్యమయిన విషయం ఓపిక. ఎదురుగా ఏమీ అనుమానాస్పదంగా కనపడకపోయినా అతను కదలకుండా అక్కడే కిటికీ దగ్గర నిలబడ్డాడు. అతని ఓపికకి ఫలితంగా అన్నట్లు ఒక జీపు వచ్చి హోటల్ ఎదురుగా ఆగింది. అందులో నుండి ఇద్దరు మనుషులు దిగారు. వారిని దింపిన జీపు వెళ్ళిపోయింది. వారు హోటల్‌లోకి రాలేదు. హోటల్ ఎదురుగా ఉన్న బస్‌స్టాప్‌లోకి నడిచారు.

## అనుభవం అయింది

**బు**ల్లితెరను తన యాంకరింగ్‌తో దద్దరిల్లింపజేసే అనసూయ వెండితెరపై విభిన్న పాత్రలు చేయాలని వుందని చెప్పింది.

"'రంగస్థలం'లో నేను చేసిన రంగమ్మత్త పాత్ర మంచి పేరు తెచ్చిపెట్టింది. ఈ పాత్ర తాలూకు ప్రశంసల్ని ఎప్పటికీ మర్చిపోలేను. ఎప్పటికప్పుడు కొత్త కొత్త పాత్రలు చేయాలన్నది నా కోరిక.

పాత్రలో అనసూయ కాక పాత్రే కనపడాలి. అటువంటి పాత్రలకే నా ప్రాధాన్యం. నా భర్త వెరీ సపోర్టివ్. అందువల్లనే విజయాలు సాధించగలుగుతున్నా" అని తెలిపింది అనసూయ.

అక్కడ ఉన్న బెంచీమీద కూర్చుని హోటల్‌మీద నుండి కన్ను మరల్చకుండా చూస్తున్నారు. వారు యూనిఫామ్‌లో లేకపోయినా వారి ప్రవర్తననిబట్టి వారు పోలీసులని పోల్చుకున్నాడు అవినాష్.

తనకోసం వచ్చినవాళ్ళయితే అలా హోటల్ ఎదురుగా ఎందుకు కూర్చుంటారో అతనికి అర్థంకాలేదు. ఇంతలో వారిలో ఒకడు బైనాక్యులర్స్ బయటకు తీసి హోటల్ వైపు ప్రాజెక్ట్ చేసి పరిశీలించి చూస్తున్నాడు. అతని చేతిలోని బైనాక్యులర్స్ తన గది కిటికీ వైపే ఎయిమ్‌చేసి ఉండటంచూసిన అవినాష్‌కి వాళ్ళు వచ్చింది తనకోసమే అని అర్థం అయింది.

మరి ఇంతదూరం వచ్చినవాళ్ళు లోపలకురాకుండా దేనికోసం ఎదురుచూస్తున్నారు? అన్న ప్రశ్నకు తనే సమాధానం చెప్పుకున్నాడు. అదనపు బలగాల కోసం అని.



**పాకిస్తాన్‌లో పెత్తనం చెలాయించే సైన్యంతో కలిసి పనిచేయటానికి సమస్య లేదు, అభ్యంతరం లేదు.**

-ఇమ్రాన్‌ఖాన్, పాకిస్తాన్ మాజీ క్రికెటర్

హోటల్ ముందువైపు ఈ ఇద్దరు పోలీసులు ఎలా ఉన్నారో, వెనుకవైపు కూడా మరికొంతమంది ఉండి ఉంటారనటంలో అతనికి ఎలాంటి అపనమ్మకం లేదు.

మరొకసారి సమయం చూసుకున్నాడు అవినాష్. రెండు గంటలవుతోంది.

కమాండోలు జనరల్‌గా తమ దాడులకు తెల్లవారుజామును ఎన్నుకుంటారు. అలానే ఈ పోలీసులు కూడా తెల్లవారుజామున తనను పట్టుకుందామని అనుకుని ఉంటారు. ఈలోపు తను హోటల్ బయటకు వెళ్తే హెచ్చరించటానికి ఈ పోలీసుల కాపలా... అనుకున్నాడు.

వారి వ్యూహం అతనికి అర్థమయ్యాక తన తదుపరి ప్రణాళికను సిద్ధం చేసుకున్నాడు.

పూర్తిఫోర్స్ వచ్చేవరకు తను ఇక్కడే ఉండటం అంటే తనను తాను ఇబ్బందుల్లో పడేసుకోవటమే అని అర్థమయిన అవినాష్ చుట్టూ చూశాడు.

అతని దృష్టి సీలింగ్‌కి ఉన్న స్మోక్ డిటెక్టర్ మీద పడింది. రూమ్ సర్వీస్‌కి ఫోన్ చేసి ఒక అగ్గిపెట్టె పంపమన్నాడు. రెండు నిమిషాల్లో ఒక బాయ్ అగ్గిపెట్టె తెచ్చి ఇచ్చాడు.

వెంటనే మంచం మీద ఉన్న దుప్పటిని చించి అందులో నుండి వచ్చిన ఒక గుడ్డ ముక్క తీసుకుని, దానికి మంట అంటించి, కుర్చీని గది మధ్యకి జరిపి దాని మీదకి ఎక్కి, పొగ వెళ్ళగక్కుతున్న గుడ్డముక్కని స్మోక్ డిటెక్టర్ దగ్గరగా పెట్టాడు. కొన్ని సెకండ్లలో ఫైర్ అలారమ్ వినిపించింది.

తలుపులు తీసుకుని గది బయటకు నడిచి కారిడార్ చివర ఉన్న ఫైర్ అలారం గ్లాసు పగలగొట్టి బటన్ నొక్కాడు.

మరో ఫైర్ అలారమ్ వినిపించింది. చకచకా మెట్ల ద్వారా ఒక అంతస్తు కిందకు దిగి అక్కడకూడా అలానే ఫైర్ అలారం మోగించాడు.

మొత్తం హోటలంతా అలారం మోతలతో నిండిపోయింది. అన్ని అంతస్తుల్లోని అతిథుల గదుల్లో కలకలం రేగింది. దగ్గర్లోనే ఉన్న ఫైర్ స్టేషన్‌కు ఎవరో హోటల్ నుండి ఫోన్ చేసినట్లున్నారు.

కొన్ని నిమిషాల్లోనే ఫైర్ బ్రిగేడ్ వచ్చింది. గదుల్లోని అతిథులు భయంతో చెల్లాచెదురుగా హోటల్ బయటకు పరుగెత్తుతున్నారు.

ముక్కుకు గుడ్డ అడ్డుపెట్టుకుని హోటల్ బయటకు నడవబోతున్న అవినాష్ హోటల్ లాబీలో నిలబడి ఎవరికోసమో వెతుకుతున్న లక్ష్మిని చూసి, షాక్ కొట్టినట్లు ఆగిపోయాడు.

కలకత్తాలో ఉండాల్సిన ఆమె అంతత్వరగా దీమాపూర్‌కి, అదికూడా తను ఉన్న హోటల్‌కి ఎలా రాగలిగిందో అతనికి అర్థం కాలేదు. ఇప్పుడు తనమీద జరుగుతున్న ఈ పోలీస్‌దాడి కూడా ఈ అమ్మాయి అందించిన క్లూ వలనే అయిఉంటుందని అతనికి అర్థమయింది. **ఇంకా ఉంది**

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు **ఇన్‌లాండ్ కవర్‌పై** రాసి స్వాతి చిరునామాకు **2 జూన్ 2018 తేదీలోగా పంపించండి.** కరెక్టు సమాధానాలు రాసినవారిలో లాటరీ పద్ధతిద్వారా ఒకరిని విజేతగా ఎంపిక చేసి ₹ 500/- నగదు బహుమతిని అందజేస్తాం.

# నేనెవరో తెలుసా

కష్టాలు అందరికీ ఏదోక సమయంలో వస్తాయి. కాని మనిషి జీవితమే కష్టాలమయం అయితే,ప్రతిదశలో ఏదోక ఎదురు దెబ్బతగులుతుంటే, తట్టుకోవటం కష్టమవుతుంది.

బతకటంలో అర్థం లేదనిపించి ప్రాణం తీసుకునే యత్నం చేస్తారు. కాని అటువంటి కష్టాలను కాదని జీవితంలో అత్యున్నత అవార్డు అందుకున్న మహిళ ఉన్నది. ఆమెకు పుట్టినప్పటినుండి అన్నీ అడ్డంకులే.

పుట్టింది ఆఫ్రికాలోని నీగ్రోజాతిలో. శరీరపు నల్ల రంగు ఒక అడ్డంకి. చదువుకుందామంటే కుటుంబ ఆర్థికస్థితి అడ్డంకి. చదువుకోవాల్సిందే అని పట్టుబడితే తండ్రికి దూరంగా వుండి మరో పట్టణంలో చదువుకోవాల్సొచ్చింది.తన చదువుకోసం తల్లి,తండ్రి వేరు వేరు ప్రదేశాలలో ఉండాల్సివచ్చింది కదా అనే బాధ. చదువు పూర్తిచేస్తే సరైన ఉద్యోగం లేదు.

వచ్చిన ఉద్యోగం చేస్తూ సర్దుకుందాములే అంటే అక్కడ ఇబ్బందులు తప్పలేదు. ప్రేమించినవాడిని పెళ్ళిచేసుకుంటే అందులోనూ తగిన ఆనందం,తృప్తి లేకపోయింది. పిల్లల తల్లైన ఆమెమీద అను మానం. చివరికి ఆమెను వదిలించుకునేందుకు ఏవేవో ఆరోపణలు చేసి విడాకుల పిటీషన్ వేశాడు.

విడాకులు మంజూరు అయినతర్వాత కూడా ఆమె తన కుటుంబం పేరును ఇంటి పేరుగా వాడుకుంటున్నదంటూ మరో కేసు వేశాడు ఆ మాజీ భర్త. ఒక సందర్భంలో ఆమెమీద తప్పుడు కేసు బనాయించి జైలుకు పంపించాడు.

ఆ తర్వాత రాజకీయాలలోకి వెళితే అక్కడ తగిన స్థానం ఇవ్వటానికి అడ్డంకులు కల్పించారు. అయినా వాటిని అధిగమించి తన దేశ మంత్రివర్గంలో స్థానం సంపాదించింది. జీవితాంతం ఆమె ఒకటే నింద భరించింది. ఆమె అహంభావి. ఎవరు ఏమనుకున్నా తాను నమ్మినదే సరైనదని నడిచింది.

మానవాళిని ఆదుకునేందుకు ఆకులు, పూలు, కాయులు, పండ్లు అందించే మొక్కలను పెంచటం కన్నా నిజమయిన సేవ మరేదీ లేదని భావించి, తన జీవితమంతా మొక్కల పెంపకానికి, పచ్చదనం పెంచటానికి అంకితం చేసింది. తన చుట్టుపక్కలవారు దానిని ప్రారంభంలో హర్షించలేకపోయినా వదలకుండా ఒక ఉద్యమాన్ని నిర్మించింది.

సొంత దేశంలో గుర్తింపు వచ్చిందో లేదోకాని ప్రపంచం ఆమెను గుర్తించింది. నోబెల్ శాంతి బహుమతి ఆమెను వరించింది. ఆమె చేసిన సేవ, నిర్వహించిన పాత్రలు పలు రంగాలకు చెందినవి.

ఆమె మహిళా ఉద్యమకారిణి. విద్యారంగంలో ప్రొఫెసర్. రాజకీయరంగంలో పార్లమెంట్ సభ్యురాలు, మంత్రి. ప్రజాసేవలో మానవ హక్కుల ఉద్యమకారిణి. తనకు ఇష్టమైన పర్యావరణ పరిరక్షణ ఉద్యమంలో మరెవరూ సాటిరాని పాత్ర పోషించింది.

స్వయంగా తాను స్థాపించిన ఒక పర్యావరణ ఉద్యమంలో మహిళలందరినీ భాగస్వాములను చేసి, అతి తక్కువ పెట్టుబడితో మొక్కల పెంపకం చేపట్టవచ్చని ఆమె నిరూపించింది.

ఆమె నాటిన మొక్కలు మూడు దశాబ్దాల కాలంలో మహావృక్షాలుగా మారి కెన్యా దేశపు భౌగోళిక స్వరూపాన్ని పూర్తిగా మార్చివేయగలిగాయి. ఆ ఉద్యమములో తొమ్మిది లక్షలమంది మహిళలు భాగస్వాములయ్యారని,మూడు కోట్ల పైబడి మొక్కలను నాటారని ఐక్యరాజ్యసమితి కొనియాడింది.

ఆమె పుట్టింది కెన్యాలోని సంఖ్యాపరంగా అత్యధికులైన తెగలో. అయితే నాటికి నల్లవారికి ఉన్న హక్కులు పరిమితం. పేరుకు భూమిపుత్రులేగాని సొంతభూమి లేనివారు.

పంటలు పండే భూములన్నీ తెల్లదొరల చేతిలో ఉన్నాయి. అటువంటి ఒక తెల్లదొర కామందుదగ్గర వ్యవసాయ కూలీ ఆమె తండ్రి. కాని పిల్లలను చదివించాలన్న ఆ తండ్రి కోరికతో ఆమెను, ఆమె అన్నదమ్ములను తీసుకుని తల్లి వేరే చోటుకు వచ్చి కొత్త జీవితం మొదలుపెట్టింది.

క్రైస్తవ మిషనరీలు నడిపే బోర్డింగ్ స్కూల్‌లో చేరింది. చదువుతోపాటు ఆమెకు క్రైస్తవాన్ని వంటపట్టించారు ఆ స్కూల్‌వారు. క్యాథలిక్ మతంలోకి మారి 'మానవసేవే మాధవసేవ' అనే సూత్రాన్ని ఆచరిస్తానన్న వాగ్దానం తీసుకుంది.

తెల్లవారి ఆధిపత్యం అంతమవుతున్న తరుణంలో అమెరికా వెళ్ళి చదువుకునేందుకు స్కాలర్‌షిప్‌లు మంజూరయ్యాయి.

అలా కెన్యా నుండి ఉన్నత చదువులకు పంపబడిన మూడువందలమంది విద్యార్థుల్లో ఆమె ఒకరు అయ్యారు. జీవశాస్త్రంలో డిగ్రీ, మాస్టర్స్ చేసింది.

అది అరవైల సమయం. ఆ సమయంలోనే ఆమెకు పర్యావరణ అంశాలు అర్థమయ్యాయి. ధ్వంసమైన పర్యావరణ పునరుద్ధరణ పద్ధతులను ఆకళింపు చేసుకుంది. తిరిగివచ్చి తన సొంత దేశంలో యూనివర్సిటీ ఉద్యోగంలో చేరేందుకు ప్రారంభంలో మహిళగా వివక్షత ఎదుర్కొంది.

అవకాశం దొరికి జర్మనీ వెళ్ళింది. కొత్త విషయాలతోపాటు డాక్టరేట్‌ని సంపాదించింది. ఒకవైపు లెక్చరర్‌గా పనిచేస్తూనే మరోవైపు ఉద్యమకారిణిగా మారింది. రెడ్‌క్రాస్‌లో చురుకుగా పనిచేసింది.

పర్యావరణంమీద జరిగే అంతర్జాతీయ సమావేశాలకు వెళ్ళింది. ఆ సమయంలోనే పేదరికానికి, పర్యావరణానికి సంబంధముందని అర్థంచేసుకుని, మహిళలకు మొక్కలు నాటితే ఆర్థికంగా సహాయం అందించవచ్చని ఈ కార్యక్రమం చేపట్టింది.

ప్రారంభంలో అది తన సొంత డబ్బుతో నిర్వహించిన కార్యక్రమం. ఆదిలో కేవలం డబ్బుకోసం ఆశపడి మొక్కలు నాటినా ఆపైన తాము చేస్తున్న పనివల్ల సమకూరే సంపద గుర్తించిన మహిళలు కొత్త ఉత్సాహంతో పాల్గొనటం మొదలుపెట్టారు.

నర్సరీల నిర్వహణ వారికి లాభసాటిగా కనిపించింది. ఆవాసాలను కోల్పోతున్న తరుణంలో ఒక గొప్ప ఉద్యమము ద్వారా ఆవాస పునరుజ్జీవనం చేపట్టటంలో ఆమె విజయం సాధించింది.

తన ఉద్యమ అనుభవాలను వివరిస్తూ, పర్యావరణము మెరుగుపరచటం సాధ్యమే అన్న విషయం విశదీకరిస్తూ ఆమె అనేక పుస్తకాలు రాసింది. వ్యక్తిగత జీవితంలో ఇబ్బందులు ఎదుర్కొన్నా, ఆమె ఉద్యమంలో ఎదిగింది.

ప్రజలు ఆమెను కెన్యా దేశపు పార్లమెంట్‌కి ఎన్నుకున్నారు. కెన్యా ప్రభుత్వంలో మంత్రిగా అదీ తనకు ఇష్టమయిన పర్యావరణ శాఖనే స్వీకరించింది. కాని అక్కడా ఆమెకు అన్నీ అడ్డంకులే.

**ప్రజలను కూడగట్టటం అనేది తప్పనే పాత, తెల్లవారి చట్టం ఆమెమీద ప్రయోగించారు నేతలు. అయినా ఎక్కడా బెదిరింపులకు లొంగక పర్యావరణ ఉద్యమంలో పులకించింది.**

**ఆఫ్రికా ఖండంనుండి నోబెల్ శాంతి బహుమతి అందుకున్న తొలి మహిళైంది. ఇంతకీ...**

***1. ఆమె పేరు ఏమిటి? 2. ఆమె ప్రారంభించిన పర్యావరణ ఉద్యమం పేరేమిటి?***

18.5.2018 సంచికలో ప్రచురించబడిన **'నేనెవరో తెలుసా!'** శీర్షిక సమాధానాలు :
1. పురిపండా అప్పలస్వామి, 2. స్వశక్తి
**₹ 500/- బహుమతి పొందిన విజేత :**
జెడ్.సత్యనారాయణ, 6-4-377/11
కృష్ణనగర్, న్యూబోయిగూడ-500 082
సికింద్రాబాద్

# గెలుపే కలిది

సి.యమున

₹10,000 బహుమతి కథ

ప్రొద్దున్నుండి సుశీలకి సంతోషంతో కాలు నిలవటంలేదు.ఆరునెలలుగా పడుతున్న ఆందోళన ఆరోజుతో ముగుస్తోంది. కూతురు ఉజ్వల 'సాఫ్ట్‌వేర్ ఇంజనీర్'గా ఉద్యోగంలో చేరబోతోంది.

"పాపా, వెళ్ళేది కొత్తచోటు. జాగ్రత్తగా ఉండు. ఎవరితోనూ ఎక్కువ పూసుకుని తిరక్కు. ఈరోజుల్లో ఎవరిని నమ్మటానికి లేదు"

"అమ్మా, ఎన్నిసార్లు చెపుతావు? వినీవినీ నాకు విసుగుపుడుతోంది" చిరుకోపంగా అంది ఉజ్వల.

"పోనీ, ఒక పని చెయ్యనా?" అంది ప్రసాదంగా చేసిన రవ్వకేసరి నోటిలో పెడుతూ.

"ఏంటో చెప్పు"

"నేనూ నీతో వచ్చి దింపి రానా?"

"అమ్మా, నేనేదో ప్లే స్కూల్‌కు వెళుతున్న చిన్న పిల్లలాగా కనపడుతున్నానా! ఉద్యోగానికి వెళుతున్నానమ్మా" అంది ఉజ్వల నవ్వుతూ.

అప్పటిదాకా కూతురిని స్కూల్, కాలేజ్, ఎంసెట్ ఎంట్రన్సు చివరకు బి.టెక్‌కు కూడా మొదటిరోజు తనతో కూడా వెళ్ళి దింపి వచ్చింది.

అందుకే ఆ ఆత్రుత. మొట్టమొదటిసారిగా ఉజ్వల ఒంటరిగా అడుగు వేస్తోంది. ఆ అడుగు ఆమె ఓ కీలకమైన నిర్ణయం తీసుకోవటానికి వేస్తోందనే విషయం ఆ తల్లికి తెలీదు. తెలిస్తే ఆవిడ ఆనందం ఆవిరైపోయేదేమో!

హైదరాబాదు హైటెక్ సిటీలో అత్యంత ఆధునికమైన బిల్డింగ్ ముందు నుంచునుంది ఉజ్వల. తలెత్తి ఆ ఎత్తయిన భవనాన్ని ఓ రెండు నిమిషాలు రెప్పవెయ్యకుండా చూసింది.

కొండలాగా ఉన్న ఆ భవనం చూస్తుంటే ఉజ్వలకి తన గమ్యమేదో ఎదురుగా నిలుచున్నట్లే అనిపించింది. లోపలికి వెళ్ళి రిసెప్షనిస్ట్‌కి తన అపాయింట్‌మెంట్ ఆర్డర్ చూపించి ఆమె చెప్పిన రూమ్‌లోకి వెళ్ళింది. అక్కడున్న హెచ్.ఆర్. మేనేజర్‌కి తనను తాను పరిచయం చేసుకున్న తరువాత తన మనసులో మాట చెప్పింది.

ఉజ్వల చెప్పినమాట విని ఆ మేనేజర్‌కి నోటమాట రాలేదు. తను కరెక్ట్‌గానే విన్నాడా అనే అనుమానం కూడా వచ్చింది. కాస్త తేరుకుని "వేరే జాబ్ చేతిలో లేకుండా వచ్చిన ఉద్యోగం సరెండర్ చేసే మనిషిని మొట్టమొదటిసారిగా నిన్నే చూస్తున్నాను. బహుశా భవిష్యత్తులో ఎవరినీ చూడనేమో కూడా" అన్నాడు విస్మయంగా. జవాబు చెప్పలేనట్లు మౌనంగా కూర్చుంది ఉజ్వల.

"ఎందుకు ఈ నిర్ణయం తీసుకున్నావో తెల్సుకోవచ్చా" మౌనాన్ని భంగంచేస్తూ అడిగాడు.

"నాకు మీరు సహాయం చేస్తానంటే చెపుతాను" రిక్వెస్ట్‌గా అడిగింది.

'ఈ అమ్మాయికి మతిపోలేదు కదా! లేకపోతే ఏమిటి ఈ పిచ్చి వాగుడు. అపాయింట్‌మెంట్ ఆర్డర్‌తో వచ్చింది, జాబ్ వద్దు, వదిలేస్తానంటుంది. మరల సహాయం చెయ్యమంటుంది.

నేను చేసే సహాయం ఏమిటి?' తన ఆలోచనలను ప్రక్కకు నెడుతూ "సరే, నీ మనసులో ప్లాన్ ఏమిటో చెప్పు" అన్నాడు ముందు అసలు విషయం తెలుసుకుందా మనే ఉత్సుకతతో. తన ప్లాన్ అంతా విపులంగా విశదీకరించింది ఉజ్వల.

అంతా విన్న హెచ్.ఆర్.మేనేజర్ "సాఫ్ట్‌వేర్ ఫీల్డ్ ఇప్పుడిప్పుడే ఆర్థికమాంద్యంనుండి కోలుకుని ఊపిరి తీసుకుం టోంది. ఉద్యోగాలు రావటం ప్రారంభం అయ్యింది.వచ్చిన ఉద్యోగం వదులుకోవటం మంచిది కాదేమో! తొందరపడకు. ఇంకోసారి ఆలోచించు" సాలోచనగా అన్నాడు మేనేజర్.

"నేను తొందరపడి ఈ నిర్ణయం తీసుకోలేదు. కొన్ని నెలలుగా ఆలోచించే ఈ నిర్ణయం తీసుకున్నాను" స్థిరంగా చెప్పింది ఉజ్వల.

తన ప్లాన్‌పట్ల ఆమెకున్న స్పష్టత, విజయం మీద నమ్మకం అన్నిటికన్నా ఆమెలోని ఆత్మవిశ్వాసం చూసి ఆ మేనేజర్‌కి ముచ్చటేసి తాను చెయ్యగలిగిన సహాయం తప్పకచేస్తానని మాట ఇచ్చాడు.

ఉజ్వల రూమ్ నుండి బయటకు వచ్చి, అంత పెద్ద ఎం.ఎన్.సి. కంపెనీ హెచ్.ఆర్.ని కలిసి తన ప్లాన్‌ను వివరించటానికి ఉపయోగపడ్డ తన చేతిలోని అపాయింట్‌మెంట్ ఆర్డర్‌ని గట్టిగా ముద్దుపెట్టుకుంది. చేతిలో ఆ ఆర్డర్ లేకపోతే తను ఆ ఆఫీసులో అడుగు కూడా పెట్టగలిగేది కాదు.

సాయంత్రం నాలుగు గంటలకు అలిసిపోయి వచ్చిన సుశీల అప్పటికే ఇంటికి వచ్చిన ఉజ్వలని చూసి ఆశ్చర్యపోయింది. కాస్త కంగారు కూడా కలిగింది. "ఏంటీ, ఇంత తొందరగా వచ్చావు? ఆఫీసులో పనిలేదా" ఆత్రుతగా అడిగింది.



"అమ్మా, నువ్వేమీ కంగారుపడకు. మొదటి రోజు కదా, పెద్ద పనేమీలేదు. వెళ్ళిపొమ్మన్నారు. అందుకే వచ్చేశాను" అంది ఉజ్వల.

తేలికగా ఊపిరి పీల్చుకుంది సుశీల. ఆఫీసు గురించి ఎన్నో ప్రశ్నలు అడిగింది. అన్నింటికీ తనకు తోచిన జవాబులు చెప్పింది.

భోజనాలు చేసి ప్రక్క చేరిన తరువాత "అమ్మా నీకో విషయం చెప్పాలి" అంది ఉజ్వల సుశీలకు దగ్గరగా జరిగి మీద చెయ్యి వేస్తూ.

"నా దగ్గర మొహమాటం ఎందుకు? ఏంటో చెప్పు పాపా" అంది తలమీద చెయ్యేసి నిమురుతూ.



"ఈరోజు జాబ్‌లో చేరలేదు. ఉద్యోగాన్ని వదిలేశాను" మెల్లగా చెప్పింది ఉజ్వల.

"ఏంటి చెపుతున్నావు?" అర్థం కానట్లు అడిగింది సుశీల.

పొద్దున ఆఫీసులో జరిగినదంతా చెప్పింది ఉజ్వల.

మీద పడ్డపాముని విదిలించినట్లు తనమీదున్న ఉజ్వల చేతిని విసురుగా తీసి లేచి కూర్చుంది.

"ఏమిటే, ఏం చేశావే! నా ఆనందం మీద నీళ్ళు కుమ్మరించావు కదే! నేను ఇంకా ఎందుకు బ్రతికున్నానా అనిపిస్తోంది" అంది సుశీల దుఃఖంతో గొంతు పూడుకుపోగా.

తల్లి దుఃఖాన్ని నిస్సహాయంగా చూస్తూ కూర్చుంది ఉజ్వల. 'తను చెప్పిన విషయం సాధారణమైనదికాదు. అమ్మ అర్థంచేసుకోవటానికి కాస్త టైమ్ పడుతుంది. అప్పటిదాకా తను ఓర్పు పట్టాలి' అనుకుంటూ కళ్ళు మూసుకుంది ఉజ్వల.

"అమ్మా, నువ్వు చాలా అలసటగా కనపడుతున్నావు. ఈరోజు నేను కూడా నీతో పాటు వస్తాను" అంది ఉజ్వల, కాఫీకప్పు తల్లి చేతికి అందిస్తూ.

"అవసరం లేదురా, అమృతంలాంటి నీ చేతి కాఫీ తాగుతున్నానుగా. క్షణంలో నా అలసటంతా పోతుంది" అంది సుశీల.

"ఊహు, నీ మాట వినేది లేదు. నువ్వు ఈరోజు రెస్ట్ అన్నా తీసుకో, లేదా నన్ను నీతో అన్నా తీసుకు వెళ్ళు" గట్టిగా చెప్పింది ఉజ్వల.

భర్త హఠాత్తుగా చనిపోవటంతో దిక్కుతోచని సుశీల తనకు తెలిసిన వంటవిద్యతో జీవితాన్ని నెట్టుకొస్తోంది.ఒకరి ఇంట్లో అమ్మాయిని పెళ్ళికూతురిని చేస్తున్నసందర్భంగా వంటచెయ్యటానికి వెళుతోంది. ఎప్పుడూ లేనిది ఈరోజు కూతురు ఉజ్వల వస్తానని



**కాంగ్రెస్ ఎన్నో సవాళ్ళను ఎదుర్కొన్నది... నరేంద్రమోడీ బెదిరింపులకు భయపడేది లేదు.**

*మన్మోహన్‌సింగ్, మాజీ ప్రధాని*

మొండికెయ్యటంతో ఇక తప్పని సరైవెంట తీసుకుని బయలుదేరింది సుశీల. సాయంత్రం అయ్యింది. ఉజ్వల అందరికీ ఘుమ ఘుమలాడే ఫిల్టర్ కాఫీ అందించింది. రుచికర మైన కాఫీని ఇంటిల్లిపాదీ ఆస్వాదించారు.

ఆ ఇంటాయన "కాఫీ చాలా అద్భుతంగా ఉంది. పొద్దున వంటంతా ఒక ఎత్తు ఐతే ఈ కాఫీ ఒక్కటే ఒక ఎత్తు" అని సంబరంగా చెప్పాడు.

"మా అమ్మాయికి స్వయంగా తను తయారుచేసిన పౌడర్‌తో కాఫీ తయారుచెయ్యటం ఇష్టం. ఇంట్లో అలాగే చేస్తుంది. 'నీ వంటకన్నా నా కాఫీకి ఎక్కువ మార్కులు కొట్టేస్తాను' అని వచ్చేటప్పుడు సరదాగా ఇంటినుండి కాఫీపౌడర్ తీసుకువచ్చింది.

దానితోనే కాఫీ చేసి మీ అందరికీ ఇచ్చింది" మురిపెంగా చెప్పింది సుశీల.

"అవునా, కాఫీ నిజంగా చాలా బాగుంది. మరి మీ వంటకూడా నేర్పించారా?" ఆరాగా అడిగాడాయన.

"లేదు సార్. తను ఇంజనీరింగ్ చదువుతోంది. మొన్ననే చివరి సంవత్సరం పరీక్షలు రాసింది.ఉద్యోగం కూడా వచ్చింది" చెప్పింది సుశీల.

"ఏమ్మా, నువ్వు ఇంజనీరువా?" అని ఆశ్చర్యంగా అడిగాడాయన.

"అవునండీ. కంప్యూటర్ ఇంజనీరుని. క్యాంపస్ సెలక్షన్స్‌లో జాబ్‌కి సెలెక్ట్ అయ్యాను" ఎంతో వినయంగా చెప్పింది ఉజ్వల.

"మీరు బయలుదేరండమ్మా. అవతల చీకటి పడుతోంది" అంటూ సుశీలకు ఇవ్వాల్సినడబ్బులు ఇచ్చిందిఆ ఇంటావిు.

"ఉజ్వల, ఒక్క నిమిషం ఇలా రా. ఇదిగో నీ ప్రత్యేకమైన (యూనిక్) కాఫీ రుచికి నేనిస్తున్న కానుక" అంటూ పర్సులోనుండి ఐదు వందల నోటు తీసి ఉజ్వల, సుశీల వద్దంటున్నా వినకుండా ఉజ్వల చేతిలో పెట్టాడు పెళ్ళికూతురి తండ్రి.

"నువ్వూ మా పిల్లలాంటి దానివే. తీసుకో ఫరవా లేదు" అని సర్ది చెప్పింది ఆ ఇంటి ఇల్లాలు.

ఆ రోజు రాత్రి "చూడమ్మా నా మొదటి సంపాదన.

ఇది సంపాదించి పెట్టింది నా కంప్యూటర్ విద్యకాదు, కాఫీ విద్య" అంటూ ఆ నోటుని అపురూపంగా బీరువాలో దాచుకుంది ఉజ్వల.

"పిచ్చి మొద్దూ. తొందరలోనే దానికి నలభైరెట్లు నెలకు సంపాదించబోతున్నావు" అంది సుశీల.

"ఏదైనా కానీ మొదటి సంపాదన అపురూపమేగా" అంటూ బెడ్ ఎక్కి ముసుగు పెట్టేసింది ఉజ్వల.

ఆ సంఘటనే భవిష్యత్తులో కీలకమైన మలుపు తిప్పుతుందని ఆ క్షణాన వారిద్దరికీ తెలీదు.

నెల గడిచిపోయింది.

రెసిషన్ వలన ఉజ్వలకి రావలసిన అపాయింట్ మెంట్ ఆర్డర్ ఆగిపోయింది.

ఉజ్వల అంత ఖాళీగా ఎప్పుడూ లేదు.

"అమ్మా,నాకు కాస్త డబ్బులుకావాలి.నేను ఫిల్టర్ కాఫీ పౌడర్ చేసి అమ్ముదామనుకుంటున్నాను"

"ఇప్పుడు ఎందుకా పిచ్చిపనులు? కాస్త ఓపిక పట్టు. త్వరలోనే ఆర్డర్స్ వస్తాయిలే" అంది సుశీల ధైర్యం చెప్తూ.

"మొన్న ఆ అంకుల్ నేనుచేసినపౌడర్ మెచ్చుకున్న దగ్గరనుండి సరదాగా ప్రయత్నించి చూద్దామని పిస్తోంది. ఏదో నా పాకెట్ మనీకోసం అనుకో. నేను ఎక్కువ డబ్బులేమీ అడగటం లేదుగా... ప్లీజ్ అమ్మా" అంటూ బ్రతిమిలాడింది ఉజ్వల.

డబ్బులు ఇచ్చింది సుశీల.

ఉజ్వల చుట్టుపక్కల షాపుల్లో కమీషన్ బేస్‌మీద తను చేసిన ఫిల్టర్ కాఫీ పౌడర్ ప్యాకెట్స్ అమ్ముడుకు పెట్టింది. కొద్దిరోజుల తరువాత జనాలు ఉజ్వల చేసిన కాఫీ పొడి కొనటం మొదలయ్యింది.

అతి త్వరలోనే నెలకు నాలుగైదు వేలు సంపాదించే స్థాయికి ఎదిగింది...

తెల్లవారుతోంది. 'గతం నుండి వర్తమానంలోకి రా' అన్నట్లు అలారం మోగింది.

ఆలోచనలతో తెల్ల వార్లు కంటిమీద కునుకులేని సుశీల ఓ గట్టి నిర్ణయం తీసుకుంది.

"ఉజ్వలా, తొందరగా తెములు. నీ ఆఫీసుకు వెళదాము.ఆ మేనేజర్‌తో మాట్లాడి,నీ రాజీనామాను క్యాన్సిల్ చేసి, ఉద్యోగం తిరిగి ఇచ్చెయ్యమని అర్థిస్తాను. నువ్వు మారుమాట్లాడకుండా చేరిపో" ఎటువంటి ఉపోద్ఘాతమూ లేకుండా చెప్పింది సుశీల. "అమ్మా, నే చెప్పేది అర్థం చేసుకో"

"మనకు వ్యాపారం కలిసిరాదు. మీ నాన్న వ్యాపారంలో చేతులు కాల్చుకునే మనం తిండికి కూడా గతిలేని స్థితికి వచ్చాము"

"నాన్న, ఉద్యోగం కూడా రిజైన్ చేసి ఉన్నదంతా

## కీలక విషయం

పోర్న్ స్టార్ అంటూ పదేపదే గుచ్చి గుచ్చి గుర్తు చేస్తున్నా సన్నీలియోన్ తన రేంజ్‌ను పూర్తిగా మార్చేసు కోగలిగింది. బాలీవుడ్‌లో మెరుపులు దక్కించుకో గలిగింది. అంతేకాదు- ఇప్పుడు బాధ్యత గల తల్లి పాత్రనూ పోషిస్తున్నది. "ముగ్గురు పిల్లలకు తల్లి అయ్యాక నా జీవితంలో ఎంతో మార్పు వచ్చింది.

పిల్లలతో ప్రతిక్షణాన్నీ ఆస్వాదిస్తున్నాను. ఇది నాకు కీలకమైన సమయం. పిల్లలతో గడిపే సమయాన్ని మరిదేనితోనూ పోల్చలేను. నిషానుస్కూల్లో చేర్చాలి కాబట్టి ఇకపై ఇండియాలోనే ఎక్కువగా ఉంటాను" అని చెప్పింది సన్నీలియోన్.



తీసుకెళ్ళి తన ఫ్రెండ్‌ని నమ్మి వ్యాపారంలో పెట్టారని నువ్వు చెప్పావు. కాని..."

"మరి అది గుర్తుండికూడా నువ్వెందుకు ఇలా ఎగబడుతున్నావు"

"నాన్న అనుభవంలేని వ్యాపారంలో పెట్టారు. తను నమ్మింది స్వంత తెలివిని, స్వశక్తిని కాదు. ఓ మోసపూరితమైన ఫ్రెండ్‌ని"

"నువ్వేమి చెప్పినా నేను వినను. నువ్వు చెయ్యదలచుకుంది ఉద్యోగం చేస్తూ చేసుకో" ఖచ్చితంగా చెప్పింది సుశీల.

"నేను రెండు పడవల మీద కాళ్ళు పెట్టదలచుకో లేదు. ఒకవేళ నేను అనుకున్నది సాధించలేకపోతే నాకు బి.టెక్. క్వాలిఫికేషన్ ఉంది. దానితో అప్పుడే ఉద్యోగంలో చేరిపోతాను"

కూతురు తన నిర్ణయం నుండి వెనక్కి మరలదని అర్థమైన సుశీల నిస్సహాయంగా, మౌనంగా ఉండి పోయింది.

ఉజ్వలకి సహాయం చేస్తానన్న మేనేజర్ తన కంపెనీ క్యాంటీన్లో ప్రస్తుతం వాడుతున్న ఫిల్టర్ కాఫీపౌడర్ స్థానంలో ఉజ్వల తయారుచేసిన కాఫీపౌడర్‌ని ప్రవేశపెట్టాడు.

ఆ కాఫీ పొడి ప్రత్యేకమైన రుచి (యూనిక్ టేస్ట్) ఉద్యోగస్తులకి బాగా నచ్చింది. అది గమనించి మేనే జర్ కొన్ని కంపెనీల రిఫరెన్స్ ఇచ్చాడు.

వాటితో ఉజ్వల హైదరాబాద్‌లోని ఇతర ఎం. ఎన్.సి.లను, సాఫ్ట్‌వేర్ ఆఫీసులను అప్రోచ్ అయ్యింది. అక్కడకూడా ఆ స్పెషల్‌రుచి అందరికీ నచ్చటంతో బాగా అమ్మకాలు అయ్యి ఆమె పౌడర్‌కి పేరుతోపాటు డిమాండ్ కూడా పెరిగింది.

అది అక్కడితో ఆగకుండా ముంబయి, ఢిల్లీ వంటి ఇతర నగరాల్లో, రాష్ట్రాల్లో ఉన్న ఆ యా ఆఫీ సుల బ్రాంచీలకు కూడా వ్యాప్తి చెందింది.

దానికి కారణం ఆ కాఫీ రుచి ఒకటైతే మరొకటి ఎంత ఎదిగినా నాణ్యత విషయంలో ఏ మాత్రం సరిపుచ్చుకోకుండా ప్రతీదీ ఉజ్వల దగ్గరుండి చూసు కోవటం. కాఫీకి ప్రముఖమైన చెన్నై, బెంగళూర్ వంటి నగరాలలో మరీ పైస్థాయిలో కాకపోయినా కొంత వరకు ఆమె ప్రొడక్ట్ నిలదొక్కుకోగలిగింది.

ఫలితం ఐదేళ్ళలో ఉజ్వల విజయవంతమైన వ్యాపారవేత్తగా ఎదిగింది.

స్టేజి మీద సి.ఐ.ఐ. సంస్థ ద్వారా ఈ సంవత్సరపు నూతన వ్యాపారవేత్తగా అవార్డు అందుకుంటోంది ఉజ్వల. ఆమె కళ్ళల్లోని వెలుగుతో పోటీపడుతూ వేలుకి ఉన్న పచ్చరాయి ఉంగరం తళుక్కుమంది. కూతురి విజయాన్ని వీక్షిస్తున్న సుశీల మనసులో ఓ వ్యక్తి స్మరణకు వచ్చాడు.

చుట్టూతా చేరిన ప్రెస్‌వాళ్ళ ప్రశ్నల పరంపర ఆరంభమయ్యింది. 'మీ విజయానికి కారణం ఎవరు?' అని అడిగిన ప్రశ్నకు "ఒక్కరు కాదు, నలుగురు వ్యక్తులు కారణం. వంటలు చేసుకుంటూ రెక్కలు ముక్కలు చేసుకుని నాకు చదువు చెప్పించిన అమ్మ, మా నాన్న, నేను తయారు చేసిన కాఫీ తాగి మొట్టమొదటగా 500 రూపాయలు కానుకగా ఇచ్చిన పెద్దాయన, నా తొలి వ్యాపార అడుగుకు చేయూతనిచ్చిన కంపెనీ హెచ్.ఆర్" చిరునవ్వుతో చెప్పింది ఉజ్వల.

## పనిలో ప్రయోగాలు

పరిశ్రమలోకి ఎప్పటికప్పుడు కొత్తవారు వచ్చి చేరుతూనే వుంటారు. ఈ రకమైన పోటీని ఎలా తట్టుకుంటారన్న ప్రశ్నకు దిశాపటానీ నవ్వులు విరజిమ్మింది. "ఇప్పటిదాకా నాకు నేనే పోటీ అని భావిస్తున్నాను. ఇతరులతో పోటీపడడం లాంటి విషయాలు నాకు నచ్చవు.

ఎవరి ప్రతిభను అనుసరించి వాళ్ళు పరిశ్రమలో ఎదుగుతుంటారు. నావరకు నేను చేసే పనిమీద దృష్టంతా లగ్నం చేస్తాను.ప్రతిరోజూ పనిలో ప్రయో గాలు చెయ్యడం నాకు ఇష్టం. నాకు దక్కిన పనిలో బాగా కష్టపడి ప్రేక్షకులను మెప్పించాలని భావిస్తానే తప్ప అనవసర విషయాల గురించి ఆలోచించ లేను" అని సింపుల్‌గా తేల్చేసింది.



"మీకు సరియైన ఊహ వచ్చేసరికే మీ నాన్నగారు మరణించారని విన్నాము. మరి ఆయన ఎలా మీ విజయానికి కారణం?"

"మీరు విన్నది నిజమే. అమ్మ పరిచయం చేసిన ఆయన జీవితం ద్వారా, 'ఏమాత్రం తెలియని వ్యాపా రంలోకి దిగకూడదని,ఎంత స్నేహితుడైనా ఒకస్థాయి మించి నమ్మి మోసపోకూడదని నేర్చుకున్నాను"

"అతి సాధారణమైన ఆర్థిక పరిస్థితిలో ఉన్నమీరు ఉద్యోగం వదులుకుని వ్యాపారం వైపు అడుగు వెయ్యటం రిస్క్ అనిపించలేదా?"

"లైఫే ఓ రిస్క్.. అపజయం ఎదురైతే, ఉద్యోగం చేసుకోవటానికి చేతిలో బి.టెక్ ఉంది కదా అనే ధైర్యం, ప్రాక్టికల్ థింకింగ్‌తోనే అడుగువేశాను"

"యువతకు మీరిచ్చే సలహా"

"యువత కేవలం ఉద్యోగాలకు మాత్రమే పరి మితమై పోకుండా వ్యాపారరంగంలో అడుగుపెడితే తనతోపాటు మరో పదిమందికి కూడా ఉపాధి కలి పించవచ్చు.హడావిడిగా ఏమాత్రం తెలియని వ్యాపార రంగంలోకి దూకెయ్యకుండా తమకు సరిపోయే దోవెంచుకోవటం ఓ సవాల్.

దానితోపాటు జనాల అభి రుచిని కూడా అర్థంచేసుకుని నాణ్యమైన ఉత్పత్తిని అందచేస్తే అది తప్పక విజయవంతమవుతుందనేది నా నమ్మకం. అదికనుక్కోవటమే నిజమైనపెట్టుబడి.ఆ విషయంలో నేను సక్సెస్ అయ్యాననే అనుకుంటున్నాను"

కూతురు చెప్పేది ఏమీ సుశీలకు పట్టడంలేదు. ఐదేళ్ళ క్రితం కూతురు నిర్ణయానికి ఏమి చెయ్యాలో తెలియక నిస్సహాయంగా ఆమె జాతకం తీసుకుని జ్యోతిష్కుడి దగ్గరకు వెళ్ళినప్పుడు ఆయన చెప్పిన మాటలే మనసులో మెదులుతున్నాయి.

"నీ కూతురికి బుధగ్రహ అనుగ్రహం దండిగా ఉంది. ఆమెకు వ్యాపారాభివృద్ధి ఖాయం. కాకపోతే ఆమె జాతకంలో చిన్న చిన్నదోషాలు ఉన్నాయి. వాటిని సరిదిద్దటానికి కొన్ని పూజలు చేసి, వేలికి పచ్చ ఉంగరం ధరింపచేస్తే ఇక ఆమె విజయా నికి తిరుగు ఉండదు" అన్న ఆనాటి ఆయన దీవెనే ఆమెకు పదేపదే గుర్తుకొస్తోంది.

'ఆ జ్యోతిష్కుడు చెప్పినట్లే బుధ గ్రహ అనుగ్రహం వలనే నువ్వు ఈ స్థాయికి వచ్చావు' అని తనలో తానే అనుకుంటూ మనసులోనే ఆయనకు నమస్కరించుకుంది.

'గెలుపెవరిది...' 'బుధానుగ్రహం ఉన్న ఉజ్వల జాతకానిదా' లేదా ఆమె 'ఆత్మవిశ్వాసం, కఠోరశ్రమదా' అనేది ఆమెతో అనుబంధం ఉన్న ప్రతి ఒక్క రికీ తెలుసు.

ప్రభుత్వాన్ని నడపటమే కాదు భారత్‌ని శక్తివంతమైన దేశంగా నిలపటం మా లక్ష్యం.

-అమిత్ షా, బి.జె.పి. అధ్యక్షుడు





# ఆల్ ఈజ్ వెల్

జీవితంలో అంతా మంచే జరగాలని కోరిక ఉన్నా అది ప్రతిసారీసాధ్యపడదు. కొన్నిసార్లు అవాంఛనీయాలూ సంభవిస్తుంటాయి.

అలా అని ఏం జరుగుతుందో అన్న నిరాశావాదాన్ని దగ్గరకు రానీయకూడదు. వెలుగునిచూసే ప్రయత్నాలనే ఎల్లవేళలా చేస్తుండాలి.

ఆశావాదులు కాంతిమయంగా ఉండేవైపునే చూస్తారన్న అభిప్రాయం అందరిలోనూ వుంటుంది. నిజమే- కాని వాళ్ళెప్పుడూ నవ్వుముఖాన్నే పెడతారనుకోకూడదు. వాళ్ళూ నొప్పిని చవిచూస్తారు. అయితే జీవితం కష్టంగా వుంటుందని, వాటిని అధిగమిస్తూ ఆశావహ దృక్పథంతో ముందుకు సాగాలని వారికి బాగా తెలుసు.

## వాస్తవికత

ఆశావాదులు ప్రతిసారీ జీవితం గొప్పగా వుంటుందని అనుకోరు. ఎప్పుడూ అనుకూలంగానే వుండేందుకు తమను తాము ఫోర్స్‌చేసుకోరు.

ప్రతికూల ఎమోషన్లతో పోరాడడానికి బదులు అసౌకర్యపూరిత భావోద్రేకాలను తాము జాగ్రత్త పడాల్సిన, ఎదుర్కోవాల్సిన హెచ్చరికగావారు భావిస్తారు. ప్రతికూలతలకు ప్రతిస్పందనగా పరిస్థితులను మార్చడానికి ఎటువంటి చర్యలు తీసుకోవాలన్న దిశగా వారి ఆలోచనలు సాగుతాయి.

ఉదాహరణకు దేశంలోని రాజకీయ పరిస్థితిపట్ల ప్రతికూలంగా ఫీలవుతున్నారని అనుకుందాం. ఎలా స్పందించాలన్న విషయంలో లోతులుచూసేబదులు, అటువంటి విషయాల్లో సపోర్టు గ్రూపులతో కలవడం వల్ల వ్యతిరేకతలు వెనుకంజ వేస్తాయి.

## ఆందోళనలొద్దు

బుర్రలోకి ఆందోళనలు వచ్చినప్పుడు వాటిని రాసుకుని పక్కనుంచేయాలి. దైనందిన కార్యక్రమాల నుంచి ఓ పావుగంట విడివడి, రాసుకున్న జాబితాపై దృష్టి సారించాలి. ఆ తర్వాత వాటిని వదిలేసి ఇతర కార్యక్రమాలను కొనసాగించాలి.

అంతేతప్ప బుర్రలోకి చొరబడిన ఆందోళనల ఆలోచనలను అదేపనిగా కొనసాగించవద్దు.

ఆశావాదులు చేసే పని ఇదే. పదేపదే విషయాలు తవ్వుకుంటూ వాళ్ళు ఆందోళనకు గురికారు.

ఆశావాదులకు దురదృష్టం అంటే ఏంటో తెలియదనేది మరో అభిప్రాయం.

**వాస్తవికత :** ఆశావాదులూ దురదృష్టాలను ఖచ్చితంగా చవిచూస్తారు. అయితే వాళ్ళు వెండిపూతను మాత్రమే హైలెట్ చేసుకుంటారు. పరిస్థితిగురించి ఆందోళన చెందడానికి బదులు, వాటిని చక్కదిద్దుకునే ఆలోచనలో పడతారు.

చెడ్డవిషయాలను చెడ్డగానే ఫ్రేమ్ చేసుకుంటూ అనుక్షణం ఆందోళన చెందకుండా, వాటిని భవిష్యత్‌లో ఏ విధంగా బాగా మలుచుకోవాలో ఆలోచిస్తుంటారు. ప్రతికూల ఆలోచనలను వాళ్ళు దీర్ఘకాలం కొనసాగించరు. ఒక మార్గానికి బదులు అనేక ప్రత్యామ్నాయాలు అనుసరిస్తూ, పరిస్థితిని మార్చుకునే ప్రయత్నం చేస్తారు.

దురదృష్టానికి చింతిస్తూ కూర్చోకుండా, దాన్ని తొలగించుకునే మార్గాలను అన్వేషిస్తుంటారు.

ప్రతి సమస్య పరిష్కారంపట్ల వారి అప్రోచ్ విభిన్నంగా వుంటుంది. తమ జీవితాన్ని చుట్టుముట్టేసిన తుపానును నిందిస్తూ కూర్చోకుండా, వాటినుంచి అవసరమైనవాటిని అభ్యసిస్తారు.

ఆశావాదులకు చుట్టూ ప్రపంచం అంతా అనుకూలంగా వుంటుందన్నది సాధారణ భావన.

**వాస్తవికత:** గతాన్ని తవ్వుకోవడం, గతంలోని మంచే మళ్ళీ మళ్ళీ జరగాలనుకోవడం తప్పు.

ఈ విషయాన్ని ఆశావాదులు బాగా గ్రహిస్తారు. ఎప్పటికప్పుడు ఇంతకుముందుకంటే బావుండాలనుకుంటూ ప్రయాణం సాగిస్తారు. పాత జ్ఞాపకాలు, గతంలోని అనుకూల పట్టికలు వర్తమానంలో అనవసరం. వర్తమానాన్ని ఆనందంగా, అనుకూలంగా మార్చుకోవాలన్నదే ఆశావాదుల నిరంతర ప్రయత్నంగా సాగుతుంది. అప్పుడలా ఉంది, ఇప్పుడలా లేదు అనుకుంటూ టెన్షన్‌పడరు.

అసంతృప్తిగా అసలే ఫీలవరు. ప్రతి విషయాన్నీ చెడ్డవార్తలతో కప్పేయాలని అస్సలే భావించరు. ఎప్పటికప్పుడు కాలంతోపాటు సాగే కొత్తలను సాదరంగా ఆహ్వానిస్తారు.పాతలకు పాతర వేస్తారు. అంటే కాలం పోకడల సర్దుబాట్లు వారిలో పుష్కలంగా వుంటాయన్నమాట.

మార్పులకు మరీ జాప్యం అయిందన్న భావం ఆశావాదులగురించి ఉండే మరో భావం.

**వాస్తవికత :** కొందరు వ్యక్తులు సహజంగానే చాలా మందికంటే ఆశావహ దృక్పథంతో వుంటారు. ఇది వారిలో అంతర్భాగంగా వుంటుందనుకోవాలి.

ఆశావాదాన్ని ఓ లాటరీగా వాళ్ళు జయించరు. మానసిక స్థితిగతులను మంచి దిశగా మార్చుకునే ప్రయత్నాన్ని వారు గట్టిగా సాగిస్తారు.

ఆశావాదం అనేది కండరంవంటిది.దాన్ని చక్కగా

బిల్డ్ చేసుకోవడానికి వ్యాయామాలు చేయాల్సి వుంటుంది. ఆ వ్యాయామాలనే ఆశావాదులు నిరంతరం కొనసాగిస్తుంటారు. భావివైపు చూసే మూడు విషయాలను రాసుకోవాలి.

ఐదే ఐదు నిమిషాల్లో మంచి భావాలు వచ్చేస్తాయి. మంచి విషయాలను పదేపదే మననం చెయ్యడంవల్ల మరింత ఆశావహ దృక్పథం ఏర్పడుతుంది.

అనుకూల, అందమైన జ్ఞాపకాలు విశ్వాసాన్ని, ఆశావాదాన్ని పెంచుతాయి. ఆశావహ దృక్పథానికి కావాల్సిన మరో ప్రధాన అదరవు నిద్ర.

రాత్రివేళ ఏడెనిమిదిగంటలపాటు సుఖనిద్ర ఆశావాదానికి ఓ మెట్టుగా వుంటుంది.

ఆరుగంటలకంటే తక్కువ నిద్రపోయేవారిలో నిరాశానిస్పృహలకు ఆస్కారం ఎక్కువ.



Courtesy : BH&G







## ఇదో నైపుణ్యం

ఆశావాదం అనేది ఎవరికి వారు ప్రాక్టీస్ చేయాల్సిననైపుణ్యం. మంచిఆరోగ్యానికి, భావోద్రేక సుస్థిరతకు, నియంత్రణకు ఇది అనుసంధానం అయి వుంటుంది. ఏదైనా తప్పుజరిగితే, దాన్ని పెద్ద సమస్యగా రాద్ధాంతం చేసుకోకూడదు.

భావోద్రేకాలను పక్కనపెట్టి, ఓ ఫ్రెండ్‌ను కన్విన్స్ చేస్తున్నమాదిరి పరిస్థితిని మెరుగుపరుచుకునేప్రయత్నాలుచేయాలి.అంతేతప్ప ఆశావాదమనేది పుట్టుకతోనేవస్తుందని, ఆశావాదులకు ఏ సమస్యలూ, దురదృష్టాలు, కష్టాలు, నష్టాలు తెలియవని, వారి బాట అంతా బంగారమేనని భావించకూడదు.

వారిలో ఆశావహ దృక్పథం వుంది కాబట్టే సమస్యల్ని, దురదృష్టాలను, కష్ట, నష్టాలను అందంగా, బాధ్యతగా ఎదుర్కొని ఆనందంగా మలుచుకోగలుగుతారన్న వాస్తవాన్ని గ్రహించాలి.

ప్రయత్నిస్తే, సరిగ్గా ఆలోచిస్తే ప్రతిఒక్కరూ ఆశావాదులే కాగలరు.

కె.మనస్విని

# Whats App

ఏమి ఎండలో, బట్టలు ఉతగ్గానే ఆరిపోతున్నాయి. వేసుకోగానే తడిసిపోతున్నాయ్.

▼

ఇప్పుడు పడుతున్న వర్షాలను చూసి, ముందుగానే వానలొచ్చేశాయని ఆనందపడకండి. దేవుడు మనల్ని రోస్ట్ చేయటానికి, పెనం వేడెక్కిందా లేదా అని నీళ్ళు చిలకరిస్తున్నాడంతే.

▼

**సుబ్బు** : "ఏరా, రోజురోజుకి లావయిపోతున్నావేరా?"
డుంబు : "మా ఇంట్లో ఫ్రిజ్ లేదురా"
సుబ్బు : "ఫ్రిజ్‌కి, లావుకి సంబంధం ఏమిటి?"
డుంబు : "వండినవి అన్నీ మిగల్చకుండా తినెయ్యాలి కదా!"

▼

"**అ**మ్మా! ఫేస్‌బుక్ చూస్తూ, పొరపాటున పరమాన్నంలో ఉప్మా పోపు కలిపేశా. మీ అల్లుడు భోజనానికి వచ్చే టైమ్ అయ్యింది. ఇప్పుడు ఏం చేయాలి?" కంగారుగా తల్లినడిగింది రమ్య.
"దానిలో ఒక కప్పు పెరుగు వేసి, గుజరాతీ దద్దోజనం అని చెప్పి పెట్టేసెయ్. వారంక్రితం నేను వాట్సాప్ చూస్తూ పులిహోరలో ఉప్పు బదులు పంచదార వేశాను. మిఠాయిరంగు కలిపి, మీ నాన్నకు భైరవస్వామి ప్రసాదమని పెట్టేశా"
ఈ విషయంలో తనకు వున్న అనుభవంతో మంచి సలహా ఇచ్చింది తల్లి.

▼

**కా**నిస్టేబుల్ తన ఎస్సైగారికి ఫోన్ చేశాడు-
"సార్. పోతరాజు వీధి ఎడంపక్క ఆరో ఇంట్లో ఒకావిడ, తన భర్తను పచ్చడిబండతో తలపై కొట్టి చంపేసింది" అని.
ఎస్సై : ఎందుకు?
కానిస్టేబుల్ : చిన్నకారణం సార్. ఆవిడ "సరదా మొగుడు" డైలీ సీరియల్ చూస్తుంటే భర్త వచ్చి ఛానల్ మార్చాడు అంతే.
ఎస్సై : మరి ఆమెని అరెస్ట్ చేశావా?
కానిస్టేబుల్ : ఇంకా ఆ సీరియల్ పూర్తవలేదు సార్. పదినిమిషాలు పడుతుంది.

**వ**రుణ్ మంచి కాలేజీలో ఇంజనీరింగ్ పూర్తి చేశాడు. క్యాంపస్ ఇంటర్వ్యూలో ఉద్యోగం వచ్చింది. తెలుగు మ్యాట్రిమోనీలో సుకన్య ప్రొఫైల్ నచ్చి లైక్ పెట్టాడు.
ఆమె మెసేజ్ పెట్టింది. "నా రేంజ్‌కి నువ్వు సరిపోవు... పక్కకు పోయి ఆడుకో" అని.


Courtesy : CHITRALEKHA

వరుణ్ అహం దెబ్బతింది పిచ్చకోపంతో. ఆమె మెసేజ్‌కు రిప్లయ్ పెట్టాడు-
"అయిదేళ్ళలో నా రేంజ్ ఏమిటో చూపిస్తా. నన్ను కాదనుకున్నందుకు కుళ్ళి కుళ్ళి ఏడుస్తావు. ఇదే నా ప్రతిజ్ఞ" అన్నాడు.
అయిదేళ్ళు అలా... గడచి పోయాయి.
బెంగళూరులో ఓ ట్రాఫిక్ సిగ్నల్ దగ్గర, రెడ్ సిగ్నల్. తన పాత బైక్‌పై వరుణ్. అటూ ఇటూ దిక్కులు చూశాడు.
తనకు కొద్దిగా వెనుక 'ఆడీ' కారులో సుకన్య.తన వంకే చూస్తున్నట్లుంది. సిగ్గుపడ్డాడు. కన్పడకుండా దాక్కుందామనుకున్నాడు. మొహం పక్కకు తిప్పుకుని దొంగచూపుతో ఆమెనే చూస్తున్నాడు. అమ్మయ్యా, గ్రీన్ లైట్ పడింది.
సుకన్య గుర్తుపట్టలేదు. బండి ముందుకురికించి, ఓ చెట్టుకింద ఆగి ముద్దుపెట్టుకున్నాడు తలపై నుండి హెల్మెట్ తీసి. హెల్మెట్‌వల్ల ఎంత లాభమో ఆ క్షణంలో అతనికి తెలిసింది.
"అందుకే అందరం హెల్మెట్ ధరిద్దాం, మనల్ని మనం కాపాడుకుందాం"

**రా**మలింగడి తపస్సుకు మెచ్చి అమ్మవారు ప్రత్యక్షమైంది. "నాయనా! ఏమి నీకోరిక"
"అమ్మా! నా కుటుంబం, బంధువులు, స్నేహితులు, హితులు అందరూ సుఖంగా వుండాలి" అన్నాడు రామలింగడు.
అమ్మవారు : "సరేకాని, 'నాలుగురోజులు' మాత్రమే అలా వుండగలరు. ఏ నాలుగు రోజులు కావాలి"
రామలింగడు : వేసవి రోజు, చలి రోజు, వర్షం రోజు, మామూలు రోజు.
అమ్మవారు: కొద్దిగా తికమకపడి "అలా కాదు, ఏవైనా 3 రోజులు ఎన్నుకో" అంది.
రామలింగడు : నిన్న, నేడు, రేపు.
అమ్మవారు: మళ్ళీ తికమకపడి "అలా కాదు, రెండు రోజులు ఎన్నుకో" అంది.
రామలింగడు : నేడు, రేపు.
అమ్మవారు : "కాదులే. ఏదయినా ఒక్క రోజు కోరుకో"
రామలింగడు : "ప్రతిరోజు"
అమ్మవారు : నవ్వి "సరేలే. రామలింగా! బుద్ధి పోనిచ్చుకున్నావుకాదు తథాస్తు" అంది. ◆

▼

**ర**వి, రాధలకు పెళ్ళయి కొత్త కాపురం పెట్టారు. మరుసటి రోజు ఉదయం-
రాధ : ఏమండీ, మిల్క్‌బూత్‌కెళ్ళి రెండు పాల ప్యాకెట్లు తెండి. పెరుగు కప్పులుంటే 4 తెండి.
రవి వెళ్ళాడు. 4 పాల ప్యాకెట్లు తెచ్చాడు.
రాధ : 4 ప్యాకెట్లెందుకు తెచ్చారు.
రవి : అక్కడ పెరుగు కప్పులున్నాయి.

▼

**ఆ**డవారు టెలివిజన్‌లాంటివారు. వారు చెప్పింది వినాలి. చూపించింది చూడాలి.

▼

**భా**ర్య అడిగింది గోముగా "ఏమండీ, నేను ఎప్పుడైనా మీ కలలోకి వస్తానా?"
భర్త : "లేదే"
భార్య : "ఎందుకు?"
భర్త : "నేను రోజూ నిద్రపోయే ముందు హనుమాన్ చాలీసా చదువుకుని పడుకుంటా"

▼

**జై**లర్: "నీకు బెయిలివ్వటానికి ఎవరూ లేరా?"
గంగులు : "ఉన్నారు సార్"
జైలర్ : "మరి ఎందుకు రాలేదు"
గంగులు : లాయర్‌తో మావాళ్ళందరూ "ఈ జైలులోనే వున్నారు సార్"

## వేసవి ఔషధం

ఎండాకాలంలో శరీరం త్వరగా అలసిపోతుంది. అలసటనుంచి సేద తీర్చడంలో కీరా బాగా ఉపకరిస్తుంది. దీనిలో విటమిన్ 'బి' ఎక్కువగా వుంటుంది కాబట్టి, రోజులో అప్పుడప్పుడు కీరా ముక్కలు తినడం చాలా మంచిది.

కీరా చర్మాన్ని కాంతివంతంగా ఉంచుతుంది. మొండి వ్యాధులకు విరుగుడుగా పనిచేస్తుంది. రోజుకో కీర తింటుంటే జీర్ణవ్యవస్థ బావుంటుంది. అధిక బరువు సమస్యకూడా తగ్గిపోతుంది.

జీర్ణక్రియకు అవసరం అయ్యే పీచు దీనిలో లభిస్తుంది కాబట్టి శరీరములోని మలినాలు ఈ పీచు ప్రభావంవలన వెలికి వెళ్ళిపోతుంటాయి. దీంతో శరీరం డీహైడ్రేషన్‌కు గురవదు. ◆

## సీమచింత

సీమచింతకాయలగురించి చాలామంది చీప్‌గా భావిస్తుంటారు కాని, వీటిలో ఔషధ గుణాలు, పోషక విలువలు అనేకం ఉంటాయి.

కాయలు, గింజలు, ఆకులు, చెట్ల బెరడు-అన్నింటిలోనూ ఔషధ విలువలుంటాయి. చిగుళ్ళ నుంచి రక్తం కారడం, పంటి నొప్పులు, ఉదరంలో అల్సర్లను తగ్గించే గుణం వీటిలో ఉంటుంది.

రోగనిరోధకశక్తిని పెంచుతుంది. బ్లడ్ షుగర్, కొలెస్ట్రాల్‌లను నియంత్రణలో ఉంచుతాయి. నరాల అస్వస్థత, ఒణుకును తగ్గించి శక్తినిస్తాయి. నోటి అల్సర్లను తగ్గిస్తాయి.

నాడీవ్యవస్థ సక్రమంగా పనిచేయడంలో సహకరిస్తాయి. సహజసిద్ధమయిన స్కిన్ మాయిశ్చరైజర్‌గా పని చేస్తుంది.

క్యాల్షియం పుష్కలంగా లభిస్తుందికాబట్టి ఎముకలు దృఢంగా, ఆరోగ్యంగా వుంటాయి. ◆

## దివ్యఔషధం

బొప్పాయిపండు ఇంట్లో ఉందంటే కుటుంబ సభ్యులందరికీ వైద్యం లభించినట్లే కాగలదు. బొప్పాయిలో బీటాకెరొటిన్లు, యాంటీ ఆక్సిడెంట్లు పుష్కలంగా ఉండి వ్యాధినిరోధకశక్తిని పెంచుతాయి. ప్రొటీన్‌లను జీర్ణంచేయగల ఎంజైమ్‌లు బొప్పాయిలో వుంటాయి.భోజనంతర్వాత నాలుగు బొప్పాయి ముక్కలు తింటే పొట్టలో ఏ విధమైన ఇబ్బందీ లేకుండా పరిరక్షిస్తుంది.

ఎ, బి, సి, ఇ విటమిన్‌లు, ఫ్లేవనాయిడ్లు, ఖనిజాలు బొప్పాయిలో లభిస్తాయి. కొలెస్ట్రాల్‌ను తగ్గిస్తుంది. నరాల బలహీనతనుంచి పరిరక్షిస్తుంది. కంటి దృష్టికి ఉపకరిస్తుంది. బొప్పాయి అన్ని సీజన్లలోనూ లభించే దివ్య ఔషధంలాంటిది.



# ప్రణయం ఎక్కడున్నా...?

## డాక్టర్ బొమ్మదేవర నాగకుమారి

ఆఫీసులో చేయాల్సిన పనులన్నీ పూర్తవ్వటంతో విష్ణు త్వరగా ఇంటికి చేరుకున్నాడు. 'యశు ఇంకా రాలేదేం?' అనుకుని ఆమె మొబైల్‌కి కాల్ చేశాడు. మొబైల్ 'అవుట్ ఆఫ్ రీచ్' అని వస్తోంది.

తన ప్రియబాంధవి తనకి అందుబాటులో లేకుండా, తనకు అందకుండా ఎక్కడికి వెళ్ళిపోతుంది? ఒక్కక్షణం దిగులుగా అనిపించింది... అంతలోనే విసుగు వచ్చింది. 'ఈ మధ్య తరచుగా ఆమె మొబైల్ ఎంగేజ్ వస్తోంది. లేదా 'అవుట్ ఆఫ్ రీచ్' అని వస్తోంది. ఎందుకని? ఏమో!

'ఇంతాలస్యమైనా ఇంకా రాలేదు. రోజులు అస్సలే బావుండలేదు. త్వరగా ఇంటికి వచ్చేస్తే బావుణ్ణు కదా. ఆడపిల్లలు ఎక్కువసేపు బయట ఉంటున్నారూ అంటే రిస్క్ తీసుకుంటున్నట్టే లెక్క!

ముఖ్యమైన పనులేమీ లేకపోతే ఇంటికి చేరుకోవటమే ఉత్తమం కదా...? అయినా ఈ మధ్య యశు డిఫరెంట్‌గా ప్రవర్తిస్తోంది. ఆ గంధర్వ్ ఏ కార్యక్రమానికి ఇన్విటేషన్ పంపించినా వెళదామంటుంది.

పాటల ప్రోగ్రామ్ అంటే కొంతవరకు అర్థం చేసుకోవచ్చు! చివరికి ఆల్బమ్ విడుదల చేసే కార్యక్రమానికి కూడా వెళదామంటుంది.

అతను మర్యాదపూర్వకంగా ఆ ఇన్విటేషన్స్ పంపిస్తూ ఉండి ఉండొచ్చు! లేదంటే అలాంటి ప్రోగ్రామ్స్‌కి ఎక్కువమంది వస్తే బావుంటుంది కదా అన్న ఉద్దేశ్యంతోకూడా పంపిస్తూ ఉండివుండవచ్చు!

అంత మాత్రాన అలా వెళ్ళిపోవటమేనా? సమాజంలో మన స్థాయిని, మన ఆత్మగౌరవాన్ని మనం కూడా కాపాడుకోవాలికదా?

గంధర్వ్ మాత్రమే కాదు, ఏ సెలబ్రిటీతో అయినా సరే మనం ఎంత దూరంలో ఉండాలో అంత దూరంలో ఉండాలి. ఆ లిమిట్ దాటితే ఎక్కడో ఒకచోట వాళ్ళు మనల్ని తక్కువగా ట్రీట్‌చేసే అవకాశముంది. అప్పుడు మనమే హర్ట్ అవ్వాల్సివస్తుంది.

అలా అని ఆ సెలబ్రిటీలని ఏమీ అనలేం! వాళ్ళ పరిమితులు వాళ్ళకీ ఉంటాయ్ కదా?

యశూ అర్థం చేసుకోదేం తనకు ఎలా చెప్పాలి? ఆపకుండా కాలింగ్ బెల్ మోగుతుంటే ఆమే వచ్చి ఉంటుందనుకుని విష్ణు పరుగున లేచివెళ్ళి తలుపు తీశాడు. ఆమె లోపలికి రావటం రావటమే దూసుకుని వచ్చేసింది. పట్టరాని సంతోషంతో ముందు అతడ్ని హగ్ చేసుకుని ముద్దులుపెట్టింది.

అతను ఉక్కిరిబిక్కిరయ్యాడు "ఏం జరిగిందీ? ఏమిటీ సంతోషం?" అడిగాడు.

"విష్ణూ డియర్! అయామ్ సో హ్యాపీ! ఈ రోజు నా జీవితంలో నేను మర్చిపోలేని రోజు! గోల్డెన్ లెటర్స్‌తో నేను ప్రత్యేకంగా రాసుకోవాల్సిన రోజు! నీకు తెల్సా ఈ రోజేం జరిగిందో?" అడిగింది.

అయోమయంగా ఆమెనే చూస్తూ అడిగాడు విష్ణు- "ఏం జరిగింది?" అని.

"ఒక గొప్ప మిరకిల్ జరిగింది. ఫంక్షన్‌లో అంత మందిముందు నా చేతుల్తో గంధర్వ్ ఆల్బమ్ రిలీజ్ చేయించాడు. ఎంత గ్రేట్ కదా?" తన చేతులవంక చూసుకుంటూ మురిపెంగా చెప్పింది.

"ఈజిట్?" అతను ఆశ్చర్యపోయాడు.

"రమ్మంటే రాలేదుకానీ నువ్వొచ్చి ఉంటే ఎంత బావుండేదో?!" నిష్ఠూరంగా అంది.

"అయామ్ ఎక్స్‌ట్రీమ్లీ సారీ ఫర్ దట్! అయినా నువ్వు ఈ చేత్తో ఆల్బమ్ రిలీజ్‌చేయిస్తారని ముందే నాకు చెప్పలేదు కదరా?" బాధగా అడిగాడు.

"నాకు తెలిస్తే కదా నీకు చెప్పటానికి? ఆ మినిట్ వరకు నాకే తెలీదు. నీకేం చెప్తాను? ఇట్ వాజ్ జస్ట్ సర్‌ప్రైజ్! ప్లెజంట్ సర్‌ప్రైజ్!" మళ్ళీ మురిసిపోతూ

### క్రికెట్ కోచింగ్

పాత్రకోసం తారలకు ఫీట్లు తప్పవు. 'డియర్ కామ్రేడ్' సినిమాలో క్రికెటర్ పాత్ర పోషించేందుకు రష్మికమండన్నా ఏకంగా హైదరాబాద్ క్రికెట్ అకాడమీలో శిక్షణ తీసుకుంటున్నది.

"క్రికెటర్ పాత్ర పోషించాలని మొదటిసారి నాకు చెప్పినప్పుడు ఆశ్చర్యపోయాను. భయపడ్డాను కూడా. అయితే, దర్శకుడు నాకు ధైర్యం నూరిపోశారు. ఇప్పటిదాకా నేను పక్కింటి అమ్మాయి పాత్రలు పోషించాను.

ఈ పాత్ర నాలో దాగున్న మరో కోణాన్ని, ప్రతిభను తప్పకుండా వెలికితీయగలదని భావిస్తున్నాను. క్రికెట్ నాకు అస్సలు రాదు.

ఇప్పుడు నేర్చుకుంటూ, ఎడిక్ట్ అయిపోయా. నా ప్రాక్టీస్ వీడియో చూసి నా భర్త కూడా ఆశ్చర్యపోయాడు" అంటూ నవ్వేసింది.



చెప్పింది. ఆమె కళ్ళు ఇంకా అక్కడే అదే స్టేడియంలో ఫంక్షన్‌ని చూస్తున్నట్టున్నాయ్! ఆమె చెవులు ఇంకా అక్కడి కరతాళధ్వనుల్నే వింటున్నాయనిపించింది.

"ప్రెస్‌వాళ్ళుకూడా వచ్చారు. నన్ను క్వశ్చన్స్ అడిగారు. రేపు పేపర్లలో నా ఫొటో వస్తుందనుకుంటా?" ఆమె గొంతులో ఎక్కడలేని ఎక్సయిట్‌మెంట్!

"దటీజ్ ఆసమ్! నెక్స్ట్ గంధర్వ్ ఆల్బమ్ రిలీజ్‌చేసేటప్పటికి అందులో నీ కంట్రిబ్యూషన్ కూడా ఉండాలి. అంటే నువ్వు వయొలిన్ ప్రాక్టీస్ చేయాలి!" ఆమెని మోటివేట్ చేయాలన్న ఉద్దేశ్యంతో చెప్పాడతను.

"ఎగ్జాట్లీ! గంధర్వ్ కూడా ఇలానే చెప్పాడు. అదీ అందరిముందు స్టేజ్‌మీద చెప్పాడు. నేనూ సంగీతమూ వేర్వేరు కానట్టు ఉండాలన్నాడు...! ఈట్ మ్యూజిక్, డ్రింక్ మ్యూజిక్, టాక్ మ్యూజిక్, వాక్ మ్యూజిక్ అని చెప్పాడు" ఆ మాటలు చెపుతుంటేనే ఆమె గొంతులో తన్మయం! "అదే మరి తపస్సు అంటే!" అతనూ ఒప్పుకున్నాడు. ఆమె మనస్సులో అప్పుడే ఒక ఊహ రూపుదిద్దుకుంది.

"నేను ఇప్పటినుంచే అలా ఉండటం మొదలుపెడతాను" అంది యశస్వి.

"ఎలా?" అడిగాడతను ఆశ్చర్యంగా.

ఆమెకా ఆలోచనతో లోపల్నుంచి ఆనందోత్సాహాలు ఎగిసిపడుతున్నాయ్!

"చెబుతాను!" అంటూ అతడ్ని ఆవేశంగా దగ్గరకు తీసుకుంది. ఇన్ని రోజుల విరహం అతడినికూడా నిలవనీయటం లేదు. ఆమె ముఖంమీదకు వంగబోతుంటే తల వెనక్కివంచి చెప్పింది.

"విష్ణూ! నీకు తెలుసా? మనం వినగలగాలే కానీ మన జీవితంలో, శరీరంలో ప్రతిచోటా ఒక లయబద్ధమైన సంగీతం వుంటుంది"

"అదెలా?" అతనికి అప్పటికే మైకం కమ్మేసింది.

"ఇప్పుడు మన ముద్దులో, హగ్స్‌లో, రొమాన్స్‌లో కూడా రాగాలు పలుకుతాయ్ తెల్సా?" అడిగింది.

"అవును మరి...! నువ్వు నా అను'రాగ' దేవతవి కదా?!" అని ఆమెని చుంబించటానికి మళ్ళీ కొంచెం ముందుకి వంగాడు విష్ణు.

ఆమె మళ్ళీ తన తల వెనక్కివంచి "నువ్వు ఒక్కో ముద్దు పెట్టు! అది నాలో ఏయే రాగాన్ని పలికిస్తుందో నేను చెపుతా!" అంది.

ఆమె ముఖాన్ని ఆత్మీయంగా రెండు చేతుల్లోకి తీసుకుని నుదుటిమీద చుంబించాడు.

"నువ్వు గ్రేట్ విష్ణూ! దిసీజ్ హంసధ్వని రాగం!" చెప్పింది. కనురెప్పలమీద ముద్దుపెట్టుకున్నాడు. "ఇది కాంభోజీ రాగం" ముక్కుపై మరో కొసరు ముద్దు పెట్టాడు. "ఇది మాయా మాళవ గౌళ రాగం!"

పెదవులపై మనసయిన ముద్దుపెట్టాడు... "ఇది మోహం తీరనివ్వని మోహరాగం!"



### జరిగిన కథ

16

గంధర్వ్ యొక్క గొప్పతనాన్ని ఏదో ట్రాన్స్‌లో ఉన్నట్లు చెబుతుంది యశస్వి, విష్ణుతో. మరో గంటలో జరగబోయే ప్రోగ్రామ్‌కి వయొలిన్ ఆర్టిస్ట్ రాకపోయేసరికి ఆందోళనపడుతుంటాడు గంధర్వ్.

ఈలోగా ఆడిటోరియమ్‌కి వచ్చినయశస్వి సంగతిని గ్రహించి అవకాశం ఇస్తే నేను ప్రయత్నము చేస్తానని అనేసరికి ఆశ్చర్యపోతాడు గంధర్వ్. ఆమె వయొలిన్ సహకారంతో పాట అద్భుతంగా వచ్చేసరికి ఎంతో ఆనందంతో కృతజ్ఞతలు తెలియజేస్తాడు గంధర్వ్.

అమృతవర్షిణి రాగాన్ని ప్లే చేయడంలో యశస్వికి సహకరించడమేకాక ఆ రాగం సాధన చేసేదాకా ఆమెను ఆ రాగం పేరుతోనే పిలుస్తానని చెబుతాడు గంధర్వ్.

గంధర్వ్ తన కొత్త ఆల్బమ్ రిలీజ్ ఫంక్షన్‌కి యశస్విని ప్రత్యేకంగా ఇన్వైట్ చేస్తాడు.

యశస్వి చేతులమీదుగా తన ఆల్బమ్‌ని విడుదల చేయిస్తాడు. ఉప్పొంగుతున్న ఉత్సాహంతో తన సంతోషాన్ని షేర్ చేసుకునేందుకు విష్ణు దగ్గరికి బయల్దేరుతుంది యశస్వి.

ఇక జరగబోయేది చదవండి.

## అన్నీ మారాయ్

ఏనాటినుంచో ఇదుగో అదుగో అనుకుంటున్న 'గుంటూరు టాకీస్' షూటింగ్ ఆరంభం కావడంతో హీరోయిన్ నికిషాపటేల్ పాత్రకు తగ్గట్లు రూపాన్ని మార్చుకునే ప్రయత్నాల్లో పడింది.

తన సరికొత్త అవతారంతో ప్రేక్షకుల మదిని దోచుకోగలనని ఆనందపడిపోతున్నది.

"తెలుగు సినిమాలో గ్రామీణ యువతిగా, నటించడం ఇదే మొదటిసారి. గుంటూరుకు చెందిన యువతి పాత్ర. నా రూపం, భాష, బాడీ లాంగ్వేజ్ అన్నీ అందుకు తగినట్లుగా వుంటాయి.

నా రూపం ఎలా ఉంటుందోనని మొదట్లో చిత్ర నిర్మాతలు సందేహపడ్డారు. ఫస్ట్‌లుక్‌కు వచ్చిన స్పందన చూసి అబ్బురపడుతున్నారు" అంటూ ఉత్సాహాలు విరజిమ్మింది నికిషాపటేల్.

---

అతనికి ఇదంతా తమాషాగా, ఆటగా అన్పించి "ఇంకా ఎన్ని రాగాలున్నాయ్ యశూ?" అడిగాడు.

"బోలెడన్ని రాగాలున్నాయ్!" అప్పటికే ఆమెకీ మైకం కమ్ముతోంది అంది యశస్వి.

"ఈ రోజు నువ్వు రాగాలన్నీ అయిపోయాయ్ అని చెప్పేవరకు ముద్దులుపెడ్తాను" చెప్పాడతను.

"చూద్దాం!" కవ్వించిందామె.

నాలుక కొసతో ఆమె నాలుకపై ఆడుకున్నాడు. ఒక్కక్షణం ఊపిరి పీల్చుకుని చెప్పింది "ఇది కళ్యాణీ రాగం!" అని.

చుబుకమ్మీద అలవోకగా ఇంకో ముద్దు పెట్టాడు. "హిందోళ రాగం!" చెప్పింది ఆమె.

ఆమెని మరింత దగ్గరికి పొదువుకుని మెడ ఒంపులో గాఢంగా చుంబించాడు.

"ఇది శుద్ధ కావేరి" అంది. అప్పటికే ఆమె ఊపిరి వేగంగా తీసుకుంటోంది.

ఆమె శరీరం శృతి చేసిన వయొలిన్‌కన్నా అద్భుతంగా రాగాల్ని పలికిస్తోంది. అతనలానే ఆమెని సోఫామీదకి పడుకోబెట్టి, మరింత తమకంగా ఆమె ఎదపొంగులపై చుంబించాడు.

"ఆనందభైరవి" చెప్పింది. పైకి చెపుతోందికానీ ఆమె అప్పటికే గొప్ప వివశత్వానికి లోనవుతోంది. నాభిపై చుంబించగానే ఆమె తాళలేనట్టుగా అతని భుజాలమీద చేతులువేసి "శంకరాభరణం"అంది.

అతనికి ఆటగా ఉంది.

ఆరోహణా అవరోహణలతో మంద్రం నుంచి తారందాకా అతను చెలరేగిపోయాడతను. అది శుద్ధ మధ్యమమో, ప్రతిమధ్యమమో అతనికి తెలీదు.

ఆరోహణో, అవరోహణో అంతకన్నా తెలీదు. సముద్రపు తరంగాల్లాంటి అందమయిన ముడుత లున్న ఆమె పొత్తికడుపుమీద చుంబించాడు.

అంతులేని వివశత్వానికి లోనైన ఆమె "గంధర్వ్! దటీజ్ మధ్యమావతి..." మత్తుగా పలికింది. అంతే! ఒక్కసారిగా వెయ్యి వోల్టుల షాక్ తగిలినట్లయి, ఆమెని అలానే వదిలేసి పైకి లేచాడతను.

అతను విభ్రాంతిగా, నమ్మలేనట్టుగా ఆమెవైపు చూశాడు. 'తనని గంధర్వ్ అని పిలిచిందా? ఇలాంటి సమయములో ఒంటిమీద స్పృహ కూడా లేకుండా గంధర్వ్ అని పిలుస్తుందా? అంటే ఏమిటర్థం?

అంటే ఆమె మనసులో ఇరవైనాలుగు గంటలు అతడి నామజపమే చేస్తుందా? అతనికి అంత దగ్గరయ్యిందా? అతడ్ని ఊహించుకుంటూ తనతో? గాడ్!' అతను ఎటూ తేల్చుకోలేకపోయాడు.

అకస్మాత్తుగా తాము ఇద్దరిమధ్యా కనిపించని తెర ఏదో దిగింది.

"కమ్ అగైన్!" అన్నాడు.

ఒక్కక్షణంలో విష్ణులో అన్ని ఫీలింగ్స్ మారిపోవటంతో ఆమె కూడా చాలా ఆశ్చర్యంగా చూసింది. ఉన్నట్టుండి అతను ఎందుకు అలా అయిపోయాడో ముందు ఆమెకు అర్థంకాలేదు. 'ఏమైంది?' అన్నట్టు అయోమయంగా అతడివైపు చూసింది.

> **నీ కష్టాన్ని చూసి ఇంకెవరో నవ్వితే నవ్వనీ ఏం పర్వాలేదు. కాని నువ్వు మాత్రం ఇంకొకరి కష్టాన్ని చూసి ఎప్పుడూ నవ్వకు.**

"నువ్వు ఇంతకుముందు నన్ను ఏమని పిలిచావ్?" అని అడిగాడు.

ఆమె అప్పుడు పూర్తిగా స్పృహలోకి వచ్చిందామె. "ఏమని పిలిచా?" ఒక్కక్షణం ఏమీ అర్థంకాలేదు.

"నువ్వు నా పేరుని కూడా మర్చిపోయావా" అని అతను సర్వం కోల్పోయినవాడిలా అడిగాడు.

ఆమెకు అర్థమైంది. తను చేసిన పొరపాటేమిటో. "ఐయామ్ సారీ!" వెంటనే చెప్పింది.

"ఇది సారీతో తగ్గిపోయే వేదన కాదు" ఆమెని అలాగే స్టేర్ చేస్తూ చూస్తూవుండిపోయాడు. ఆమె కళ్ళల్లోకి, అక్కడ్నుంచి ఆమె మనసులోకి చూడాలి అన్నట్టుగా లోతుగా చూస్తూండిపోయాడు.

ఆ చూపులు తనని కాల్చేస్తున్నాయి. ఒకప్పుడు ఆ చూపులు పూలదండల్లా తనమీదకి వచ్చిపడేవి. ఆ చూపులే ఒక్కోసారి పూలబాణాల్లా తగిలేవి.

ఆ చూపులే మరోసారి సీతాకోకచిలుకల్లా తనని గిలిగింతలు పెట్టేవి! కానీ ఇప్పుడా చూపులే... ఆమె తట్టుకోలేక లేచి నిలబడింది.

"ఐ యామ్ సారీ విష్ణు! వన్స్ అగైన్ ఐ యామ్ రియల్లీ సారీ!" అంటూ అతనిదగ్గరకెళ్ళబోయింది. అతను దగ్గరకు రావద్దు! తనని ముట్టుకోవద్దు అన్నట్టుగా తల అడ్డంగా ఊపి, వెళ్ళి డైనింగ్ టేబుల్‌దగ్గర కుర్చీ లాక్కుని కూర్చున్నాడు.

అతనిలో అదే ప్రశ్న! ఈ సమయంలో ఈ క్షణంలో ఆమె మనస్సులో నిజంగా తను లేడా? అతడ్ని ఆ విషయం అలా బగ్ చేస్తూనే ఉంది.

ప్రేమలో ఉన్నప్పుడు జీవితమెంత అద్భుతంగా తోస్తుందో ప్రేమకి దూరమైనప్పుడు జీవితమంతా అంతకన్నా నిరర్థకంగా కన్పిస్తుంది.

ప్రస్తుతం విష్ణు పరిస్థితి అలానే ఉంది. ఒకప్పుడు ఆమె మనస్సు తెలుసుకోవటం, ఆమె మనస్సు గెలుచుకోవటమంటే ప్రపంచం మొత్తాన్ని అర్థంచేసుకున్నట్టు, జీవితాన్నంతా గెలుచుకున్నట్టు ఆనందంగా ఉండేది. తన విజయానికి ప్రపంచమంతా జేజేలు పలుకుతున్నట్టు, హారతిపట్టి నీరాజనాలిస్తున్నట్టుగా గొప్ప గర్వంగా ఉండేది.

ఇంకేం చేద్దామా? అని ఉత్సాహంతో ఉరకలు వేసేవాడు. కానీ పరిస్థితి ఇప్పుడందుకు విరుద్ధంగా ఉంది. పెనుతుఫాన్‌లో సర్వం పోగొట్టుకున్నట్టుగా ఉంది. ఒక రిలేషన్‌షిప్‌లో ఏదైనా అనుమానాస్పదంగా అన్పిస్తే వెంటనే ఎలర్ట్ అవ్వొచ్చు!

ఎవరిద్వారానైనా మనవారిగురించి ఏదన్నా తప్పుగా వింటే వారినే నేరుగా అడిగి క్లారిఫై చేసుకోవచ్చును! కానీ తనెలాంటి ముందస్తు సూచనలూ లేకుండా ఒక్కసారే తనెక్కడ లోయలో పడిపోయాడు?

తమ ప్రేమ విషయంలో తనెక్కడ పొరబడ్డాడో, తను చేసిన పొరపాటేమిటో తిరిగి తిరిగి తనలో తానే ఆలోచించుకోసాగాడు. యశు, గంధర్వ్‌లమధ్య ఊహించకూడని సంబంధం ఏర్పడిందా? యశు తనని మోసం చేసిందా? కాదు.

ఆమె తనని మభ్యపెట్టిందా? లేదు. యశు తనకు ముందునుంచీ అన్నీ చెప్తూనే ఉంది. తన మనస్సే తనని ప్రలోభపెట్టింది. మోసం చేసింది. అందుకే తను అర్థంచేసుకోలేకపోయాడు.

తమ ఆఫీస్ యానివర్సరీ ఫంక్షన్‌కి తనూ యశూ కల్సి ఆ గంధర్వ్ దగ్గరకు వెళ్ళారు. తర్వాత ఎవరికైనా ఇచ్చి ఇన్విటేషన్ కార్డ్ అతనికి పంపించమని చెప్పాడు. కానీ యశు తనే స్వయంగా వెళ్ళింది.

ఆ విషయాన్ని చెప్పటమే కాదు, అక్కడనుంచి వచ్చినదగ్గర్నుంచి ప్రతిరోజూ గంధర్వ్ గురించి ఏదో ఒకటి మాట్లాడుతూనే ఉంది. అయినా తను 'స్మెల్' చేయలేదు. ఆఫీస్ పనిమీద ఇంట్రెస్ట్ తగ్గింది.

చెప్పిన పనులు కూడా సరిగ్గా చేయటం మానేసింది. అయినా ఆమె పరధ్యానాన్ని తను గుర్తించలేదు. అతనేదో ఫంక్షన్‌కి ఇన్విటేషన్ కార్డ్ పంపించాడని ఓ మ్యూజిక్ ప్రోగ్రామ్‌కి వెళ్ళింది.

అక్కడ తను వయొలిన్ ప్లే చేశాననీ, అతనెంతగానో మెచ్చుకున్నాడనీ, కొత్త వయొలిన్ కొనుక్కొని మరీ ప్రాక్టీస్ చేయమన్నాడని చెప్పింది. 'అదేమిటీ? ఫీల్డ్‌లో ఎంతోమంది ప్రొఫెషనల్స్ ఉంటారుకదా? ప్రత్యేకించి నిన్నే ఫంక్షన్‌లో వయొలిన్ ప్లే చేయమని ఎందుకడిగాడు?' అని తను అనుమానించలేదు.

అర్చన చేయించటానికి కొత్త వయొలిన్‌ని గుడికి తీసుకువెళితే అదే గుడికి అతనూ అదే సమయానికి వచ్చాడనీ, గుళ్ళోనే ప్రాక్టీస్ మొదలుపెట్టేశామని చెప్పింది. అప్పుడుకూడా సంబరంగా విన్నాడంతే!

చివరికి ఆ రోజు ఆల్బమ్ రిలీజింగ్ ఫంక్షన్‌కి వెళదామని అంది. తను అప్పుడు కూడా అనుమానించలేదు. ఆమే వెళ్ళి వచ్చింది. అప్పటికప్పుడు తనతో ఆల్బమ్ రిలీజ్ చేయించారని చెప్పింది. సమ్‌వేర్ సమ్‌థింగ్ సమ్‌థింగ్ వెంట్ రాంగ్! తను ఓటమిపాలయ్యాడు.



విగ్రహాలకు ప్రాధాన్యత ఇవ్వని వర్గాలకు జిన్నా ఫోటోపై ఆందోళన ఎందుకు.

*-బాబా రామ్‌దేవ్, యోగా గురు*

తన ప్రాణానికి ప్రాణమైన యశు తనకు పరాయిదయిపోయింది. తనని కాదని ఓ గొప్ప సింగర్‌చుట్టూ తిరుగుతోంది. ఆ సంగతి లోకంలో అందరికీ తెలిశాక తనకు తెలిసింది. అందుకే తనని చూసి అందరూ నవ్వుకుంటున్నారు. ఈ ప్రపంచం గేలిచేస్తోంది.

ఇంతకన్నా అవమానం ఇంకేముంది? యశూ ఇంటికి రావటంలేదు. ఆఫీస్‌కి వస్తోంది. వెళుతోంది. తను మునుపటిలా ఉండలేకపోతున్నాడు. అయినా అలా ఎలా ఉంటాడు? ఒకప్పుడు యశుని ఎంతో అర్థంచేసుకున్నాననుకునేవాడు. కానీ ఏమిటిది?

ఈ పరిస్థితి తనకే అర్థంకావట్లేదు. చేతిమీద వాలిందనుకున్న సీతాకోకచిలుక ఎగిరి వెళ్ళిపోయింది. ఆలోచిస్తున్నకొద్దీ అతనికి బాధ ఎక్కువ కాసాగింది. ఆమెని ఎలా వెనక్కి తీసుకురావాలో, తన ప్రేమని ఎలా బ్రతికించుకోవాలో అతనికి అర్థంకావట్లేదు.

ఈ ప్రపంచాన్నుంచి దాక్కోవాలన్నట్టుగా ఇంట్లోనే ఉంటూ తలుపులన్నీ వేసుకుంటున్నాడు. ఏ పనిమీదా శ్రద్ధ ఉండటం లేదు. కాదు కాదు, తనమీదే తనకి శ్రద్ధ లేకుండా పోయింది. సరిగ్గా ఫోనుకాల్స్‌ని కూడా ఎటెండ్ చేయటం లేదు.

ఫోన్‌బుక్‌లో లేని నెంబర్ నుంచి ఆ ఫోన్‌కాల్ నాలుగోసారి రావటంతో విష్ణుకి ఏదో అనుమానం వచ్చి కాల్ చేశాడు. "సర్! ఇక్కడ ఒక అమ్మాయికి బైక్ యాక్సిడెంట్ అయ్యింది. రీసెంట్ కాల్ లిస్ట్‌లో మీ నెంబరుంది. విష్ణు అంటే మీరేనా?" అవతల్నుంచి అడిగారు.

"అవును నేనే!" కంగారుగా బదులిచ్చాడతను. "అసలేం జరిగింది...? ఎక్కడ? ఏ ఏరియా?" క్షణం కూడా ఆగకుండా గబగబా ప్రశ్నలడిగాడు.

"షి ఈజ్ ఆల్‌రైట్ సర్! కానీ ఒకసారి మీరు వచ్చి ఐడెంటిఫై చేయాల్సివుంటుంది"

వెంటనే తను గుర్తుపట్టటానికి కావాల్సిన వివరాలు అడిగాడు అతను చెప్పిన ఆనవాళ్ళన్నీ సరిపోయాయ్. ఒక్కసారిగా బాగా కంగారుపడ్డాడు. గుండె ఆగినంత పనయ్యింది. "ఒకసారి నారాయణ హాస్పిటల్‌కి రాగలరా?" అడిగాడు.

"ఇప్పుడే వస్తున్నాను" చెప్పాడతను.

అరగంటలో హాస్పిటల్‌లో ఉన్నాడు.

అప్పటిదాకా అక్కడ తనకోసం ఎదురుచూస్తున్న ఆ కొత్త వ్యక్తి దగ్గరకు వెళ్ళి తనను తాను విష్ణుగా పరిచయం చేసుకున్నాడు. ఆ కొత్త వ్యక్తి యశస్వికి సంబంధించిన మొబైల్, రింగ్స్, దుస్తులు విష్ణుకి అప్పచెప్పాడు. విష్ణు థ్యాంక్స్ చెప్పి తన బిజినెస్ కార్డ్ ఇచ్చాడు. అతను వెళ్ళిపోయాడు.

తరువాత విష్ణు రిసెప్షన్‌లో అది మెడికో లీగల్‌కేస్ కావటంవల్ల ఫార్మాలిటీస్ పూర్తిచేసి అడ్వాన్స్ డబ్బు కట్టాడు. హాస్పిటల్ స్టాఫంతా హడావిడిగా తిరుగుతూ ఆమెకవసరమైన ఎక్స్‌రేల దగ్గర్నుంచి సిటీ స్కాన్‌దాకా అన్ని పరీక్షల్నీ జాగ్రత్తగా నిర్వహిస్తున్నారు. ఎంత ప్రమాదం తప్పిపోయిందీ?

యశుకేమన్నా అయ్యుండివుంటే ఈ జన్మలో తనని తాను క్షమించుకోగల్గేవాడు కాదు. థ్యాంక్‌గాడ్! మనసులోనే భగవంతుడికి కృతజ్ఞతలు చెప్పుకున్నాడు.

స్పృహలో లేకుండా పడివున్న ఆమెని చూడగానే అతనికి దుఃఖం వచ్చింది. ఆమె ప్రేమా... ఆమెతో గడిపిన మధురక్షణాలు గుర్తొచ్చాయ్! ఆమె తనపై ఎలా ప్రేమ కురిపించేది? పసిపాపలా, ఎంత అమాయకంగా తనని నమ్మిందీ? ఆమె సర్వస్వమూ తనకి అర్పించింది.



## ఆసక్తికర ఐడియాలు

ఆదినుంచి సాహసాలంటే ఇష్టపడే రకుల్‌ప్రీత్ సింగ్ ప్రయోగాల్లోనూ ముందుంటుంది.

ఈ పనిలో భాగంగా ఈ మధ్య అభిమానులతో కలసి హెలికాప్టర్ రైడ్‌కు వెళ్ళింది.

"నాకు సాహసాలంటే ఇష్టం. అభిమానులకూ అటువంటి అనుభూతిని ఇవ్వాలనుకున్నాను.

ఈ మధ్య నా పేరుమీద ఓ యాప్ ప్రారంభించి, దాన్లో నాకు సంబంధించిన విషయాలన్నీ ఎప్పటికప్పుడు అప్‌లోడ్ చేస్తున్నాను. దీనిలో ఎవరు ఎక్కువగా పాల్గొంటారో నాకు తెలుసుకాబట్టి వారికి థ్రిల్ ఇవ్వాలనుకున్నా. పావుగంటసేపు ముంబయిలో గాల్లో తిరిగాం. అభిమానులతో మాట్లాడి అభిమానులను కలుసుకోవడానికి నా దగ్గర ఆసక్తికరమయిన ఐడియాలున్నాయి" అని చెప్పింది రకుల్.



## పట్టుదల అవసరం

అందం, అభినయం ఎంతగా వున్నా పట్టుదల వుంటేనే పరిశ్రమలో రాణించగలరన్నది హాటెస్ట్ అందాల భామ శ్రద్ధాదాస్ అభిప్రాయం.

"పరిశ్రమలో నిలదొక్కుకోవాలంటే చాలా పట్టుదల కావాలి. దృఢంగా ఉన్నప్పుడే సాధించగలం. పరిశ్రమను 'ప్లాన్ బి'గా పెట్టుకునిరావాలని నేను చాలామందికి సలహా ఇస్తుంటా.

మనం ఎంతో బాగా సూటవుతాం అనుకున్న పాత్రలు కొన్నిసార్లు చెయ్యి జారిపోతుంటాయి. అటువంటి సందర్భాలలో చాలా బాధ అనిపిస్తుంది. సినీనేపథ్యం నుంచి వచ్చినవారికి తొలి ఛాన్సులు బాగుండవచ్చునేమోకాని, ఆపైన ప్రతిభ, పట్టుదలలే ప్రధానం" అంటున్నది.

ఏమిటో ఈ అసందర్భ కబుర్లు...?

ఆమె మనస్సేమిటో తను సరిగ్గా అర్థం చేసుకోలేకపోయాడా? ఆమెని అనవసరంగా క్షోభకి గురిచేశాడా? పాపం యశు! ఇంకా చిన్నపిల్ల! జీవితంమీద ఎన్ని ఆశలతో ఇక్కడికి వచ్చిందో?

ఆమె పేరెంట్స్‌కి ఫోన్ చేయాలంటే... సంశయంతో ఆగిపోయాడు. వాళ్ళు కంగారుపడతారేమో? తనకు మెలకువ వచ్చినతర్వాత తననే అడిగి ఫోన్ చేయొచ్చులే అనుకున్నాడు.

స్పృహరాగానే ఆమె అడిగిన మొదటి ప్రశ్న "విష్ణూ! నేను ఎక్కడ వున్నాను? ఏం జరిగింది?" అని.

జరిగిందంతా చెప్పాడు. అప్పుడే అక్కడికి వచ్చిన ఆయా చెప్పింది. "సారు చాలా సేవచేశాడమ్మా! నీ గురించి బయటనే కూర్చున్నాడు" అని.

కృతజ్ఞతతో కళ్ళు సజలాలయ్యాయ్! "థ్యాంక్యూ విష్ణూ!" అంది ఆమె.

అతనామె తల నిమిరాడు ప్రేమగా! ఆమె ఆ చెయ్యి పట్టుకుంది. అతని కళ్ళల్లో చూస్తూ-

"సారీ విష్ణూ...! నిన్ను హర్ట్ చేశాను కదూ?" అడిగింది.

"అవన్నీ ఇప్పుడు ఎందుకమ్మా?" అన్నాడు. ఆమె చేతికి మొబైల్ ఇచ్చాడు.

మొబైల్ తీసుకున్న వెంటనే అడిగింది. "విష్ణూ! ఇంటికి ఫోన్ చేశావా?" అని.

"లేదు. నిన్ను అడిగి చేద్దామనుకున్నాను"

"వద్దొద్దు! వాళ్ళకు చెప్పొద్దు విష్ణూ! వాళ్ళంతా చాలా కంగారుపడతారు. నానమ్మ అయితే ఏడ్చేసి బాగా హడావిడి చేస్తుంది. అమ్మానాన్నలిద్దరికీ ఉన్న పళాన రావాలీ అంటే ఎంతో ఇబ్బంది! సెలవులు దొరకవ్! అలాగని రాకుండా ఉండలేరు. ఐ థింక్ ఐ కెన్ మేనేజ్!" చెప్పింది యశస్వి.

"దట్స్ ఫైన్! ఏదయినా అవసరమైతే ఇక్కడ నేను ఎలాగూ ఉన్నాను కదా? తర్వాత నువ్వు మాట్లాడేటప్పుడు నెమ్మదిగా ఈ విషయం చెప్పు! నీ గొంతు వింటే అంత కంగారుపడరు" అని చెప్పాడు.

సరేనన్నట్టుగా తలూపింది.

"చెప్పు! నీకు బయటినుంచి ఏమయినా తీసుకురావాలా?" అడిగాడతను.

"నా ల్యాప్‌టాప్ తీసుకొనిరాగలవా?" అడిగింది ఆమె. తలూపి, ఆమెకు కావలసిన ఇతర వస్తువులన్నీ లిస్ట్ రాసుకున్నాడు. టూత్‌బ్రష్, దువ్వెన, మాయిశ్చరైజరు, లోదుస్తులు, ఒక జత స్లిప్పర్స్ మొదలైనవి.

"జాగ్రత్తగా ఉండగలవా?" అని వెళ్ళబోతూ దిగులుగా అడిగాడు విష్ణు.

"నో ప్రాబ్లమ్, మొబైల్ ఉందికదా? అవసరమైతే కాల్ చేస్తా" నవ్వుతూ చెప్పింది.

"పోనీ నర్సుని వచ్చి కూర్చోమని చెప్పనా?" అడిగాడు అతను.

"అవసరం లేదు, నువ్వు తొందరగా వెళ్ళి, తొందరగా రా!" అని చెప్పిందామె.

అతను బయటకు రాగానే ముందుగా నీతూకి కాల్ చేసి జరిగిన సంగతంతా చెప్పాడు.

ఆమె బాగా గొడవ పెట్టుకుంది. "డ్యూడ్! దిసీజ్ నాట్ ఫెయిర్! యశూకి యాక్సిడెంటయితే నాకు చెప్పకపోవటమేమిటీ?" అని.

"ఎందుకులే నిన్నుకూడా బాధపెట్టటమని..."

"దిసీజ్ టూ మచ్! అటు చూస్తే నేను తనకు, ఇటు చూస్తే నీకూ ఫ్రెండ్‌ని! అయినా నాకు చెప్పలేదు" అంది నీతూ.

"ఇప్పుడు చెప్తున్నా కదా? యశు ల్యాప్‌టాప్ కావాలంటోంది. తీసి రెడీగా పెట్టు! నేను మీ ఫ్లాట్‌కే వస్తున్నా! నిన్నుకూడా ఇక్కడికి తీసుకువస్తాను"

"దటీజ్ పర్‌ఫెక్ట్!" చెప్పింది నీతూ.

ఫ్లాట్‌కి వెళ్ళి నీతూతోపాటుగా యశస్వి కావాలని చెప్పిన వస్తువులన్నిటినీ తీసుకుని విష్ణు తిరిగి వస్తుంటే రిసెప్షన్ కౌంటర్‌లో వ్యక్తి అతడిని పిలిచి అడిగాడు- "సార్! రూమ్ నెంబర్ టూనాట్ టూ పేషెంట్ ఎటెండెంట్ మీరేకదా?" అడిగాడు.

అవునన్నట్టుగా తలూపాడు.

అక్కడ వున్న గులాబీపూల బొకేని తీసి విష్ణుకి ఇచ్చి చెప్పాడు.

"సార్! ఇందాక ఓ ఫ్లోరిస్ట్ వచ్చి మీ పేషెంట్‌కి ఇమ్మని ఈ బొకే ఇచ్చివెళ్ళాడు"

అతని కనుబొమ్మలు ముడిపడ్డాయి. అతనికేమీ అర్థంకాలేదు. ఆ గులాబీలు అమాయకంగా ఒక తియ్యటి పరిమళాన్ని వెదజల్లుతున్నాయ్!

చేతుల్లో ఉన్న కవర్లని ఎడ్జస్ట్ చేసుకోబోతుంటే నీతూ అతని కుడిచేతిలోని కవర్లని తీసుకుంది.

ఈలోగా విష్ణు ఆ బొకేమీదకి కొద్దిగా వంగి చూశాడు. ఆ బొకేకి వేలాడుతున్న చిన్న కార్డ్‌మీద సెండర్స్ నేమ్‌దగ్గర "సంగీత లహరి! గెట్ వెల్‌సూన్! యువర్స్ గంధర్వ్!" అని రేడియంపెన్నుతో రాసిన గులాబీరంగు అక్షరాలు మెరుస్తున్నాయి.

అతని దవడ ఎముక విరిగిపోతుందో ఏమో అన్నంతగా దవడ కండరం బిగుసుకుంది.

'స్టుపిడ్‌ఫెలో! వీడికేం పనిలేదా? పరాయివాడి గాళ్‌ఫ్రెండ్‌కో, పెళ్ళానికో ఇలా పొద్దున్నే ఇలా గులాబీలు పంపిస్తూ కూర్చుంటాడా. ఎవడో ఒకడు ఏదో ఒకరోజు ఎముకల్లోకి సున్నం లేకుండా మెత్తగా తంతేగానీ వీడికి బుద్ధి వచ్చేలా లేదు. ఆ ఎవడో తానే అయితే?' ఆ ఆలోచనతో అతని పిడికిళ్ళు బిగుసుకున్నాయ్!

విసురుగా ఆ బొకేని లాక్కున్నట్టే తీసుకుని ముందుకు వెళుతుంటే, అతని మనస్సులో సంఘర్షణ తెలిసి నీతూ అతడ్ని అనుసరించింది.

అతను లిఫ్ట్ ప్రక్కగా ఉన్న డస్ట్‌బిన్‌లోకి విసిరేసినట్టుగా ఆ బొకేని వేసేశాడు.

ఇంకా ఉంది

లింగాయత్‌లు ఒక మతంగా విడిపోవాలని కోరుకోవటం రాజ్యాంగపరంగా వారికున్న హక్కు. -ప్రకాష్‌రాజ్, నటుడు



# అవ్యాజమైన ప్రేమ

పిల్లలపట్ల అవ్యాజమైన ప్రేమ ఉంటుంది. వారికోసం ఏదైనా చేయగల త్యాగగుణం ఉంటుంది. అయితే, ఇంతటి అంతులేని ప్రేమను చాలా కుటుంబాలలో చాలామంది తల్లిదండ్రులు కౌగిలింతలు, ముద్దులువంటి శారీరక స్పర్శద్వారా వ్యక్తం చెయ్యలేకపోతుంటారు.

కౌగిలించుకోవడం అనేది ప్రత్యేక సందర్భాలకు మాత్రమే పరిమితం అవుతుంది. బహుశా మన సంస్కృతీ, సంప్రదాయాలు అటువంటివి కావడం కారణమేమో. అయితే స్పర్శ శక్తి ఎంతో ప్రయోజన కరమైనదని శాస్త్రీయబద్ధంగా రుజువయింది.

కౌగిలించుకోవడంవల్ల అనేక ప్రయోజనాలుంటాయి. సైన్స్ పేర్కొన్నదని కాదు- స్పర్శశక్తి ఎటువంటిదో అనుభవపూర్వకంగా అందరికీ తెలుసు. పిల్లల్ని దగ్గరకు తీసుకోవడానికిగల కొన్ని కారణాలను తెలుసుకోవాలి.

పిల్లలను గట్టిగా హత్తుకోవడంవల్ల ఖచ్చితంగా ఫలితాలుంటాయన్న వాస్తవాన్ని గ్రహించాలి.

## ఆత్మస్థైర్యం :

పుట్టినప్పుడే బిడ్డనుగట్టిగా హృదయానికి హత్తుకోవడంవల్ల పిల్లలకు దృఢమైన ఎమోషనల్ పునాది పడుతుంది. ఆరోగ్యవంతమైన ఆత్మస్థైర్యాన్ని పెంపొందించుకోవడంలో ఇది సాయపడుతుంది. రిస్కులు తీసుకోగల విశ్వాసం పిల్లలకు భావిలో ఏర్పడగలదు. తనలోని సామర్థ్యాలకు సానబెట్టి, కొత్త విషయాలను ప్రయత్నిస్తారు.

## బాంధవ్యాలు బలపడతాయి :

పిల్లలతో ఘర్షణపడే సందర్భాలుంటుంటాయి. ఇటువంటి పరిస్థితుల్లో వాటి తాలూకు చేదుకు చెల్లుచెప్పి, బాంధవ్యానికి మరమ్మతు చేసుకోవడానికి కౌగిలింతలు ఉపకరిస్తాయి. వారిని దగ్గరకు తీసుకుంటే సారీలు, కోపతాపాలకు తావుండదు. ఎటువంటి విభేదాలు, కోపాలు తలెత్తినా, ఇంకా వారికి ప్రేమిస్తున్నారని చెప్పడానికి, వారిని మనసారా దగ్గరకు తీసుకుంటే చాలు. అన్నీ సర్దుకుని, భావోద్రేకపరంగా మంచి బాంధవ్యాలు ఏర్పడతాయి.

## కోపానికి చెక్ :

పిల్లలు భావోద్రేకపరంగా, అతిగా స్పందిస్తున్నప్పుడో లేక ఏవోఒక విషయాలతో సతమతమవుతూ, చిరాకుపరాకులు ప్రదర్శిస్తుంటే వారిని దగ్గరగా తీసుకోవడంవల్ల ప్రతికూలతలన్నీ కరిగిపోతాయి. క్రమశిక్షణ ప్రక్రియలో ఇది అనుకూల వైఖరికి తెరలేపుతుంది.

పిల్లలు ఎప్పుడైతే రిలాక్సింగ్‌గా ఫీలై, కాస్తంత కుదురుకుంటారో అప్పుడు వారిని మాటల్లోకి దింపి, చేసిన తప్పుల గురించి చర్చించవచ్చు.

తర్వాత కోపాన్ని క్రమబద్ధీకరించుకోవడానికి ఇది ఎంతగానో ఉపకరిస్తుంది.

## మెదడు ఎదుగుదల :

తల్లిదండ్రుల బేషరతు ప్రేమ, సపోర్ట్‌లకు కౌగిలింతలు మరోమారు బలం చేకూర్చుతాయి.

బాల్యంలో పిల్లలకు తగినంత మద్దతు, భావోద్రేక పోషణ లభించినప్పుడు వారిలోని మెదడు ఎదుగుదల బావుంటుంది. జ్ఞాపకశక్తికి, అభ్యాస, భావోద్రేక క్రమబద్ధీకరణకు బాధ్యత వహించే మెదడులోని హిప్పో- క్యాంపస్ అనే భాగానికి మంచి పోషణ లభించినట్లు అవుతుంది.

## రోగనిరోధకశక్తి పెరుగుతుంది :

పిల్లలను దగ్గరకు తీసుకుని హత్తుకోవడంవల్ల వారిలో మానసిక బలం పెరగడమే కాదు, వారిలో రోగనిరోధకశక్తికూడా పెరుగుతుంది.

వారిని దగ్గరకు తీసుకున్నప్పుడు ఒత్తిడిని తగ్గించే 'ఆక్సిటోసిన్' హార్మోన్ విడుదల అవుతుంది.

ఇవి శారీరక ఎదుగుదలకు, పిల్లల ఆరోగ్యాన్ని ప్రభావితంచేసే అనేక గ్రోత్ హార్మోన్లను విడుదల చేస్తుంది. అందుకే అనేక నియోనాటల్ కేర్ యూనిట్స్‌లో ముందస్తుగా పుట్టిన శిశువులను తరచూ స్పృజించాల్సిందిగా తల్లిదండ్రులకు చెప్తుంటారు.

ఇలా చేయడంవల్ల వారిలో కీలకలక్షణాలు ప్రస్ఫుటం కావడానికి, బరువు పెరగడానికి పరిస్థితులు సుగమం అవుతాయి.

## సంతోషం :

కౌగిలింత అనేది ఓ ఇమ్యునైజేషన్ షాట్ లాంటిది. సవాళ్ళను ఎదుర్కోవడంలో, అనుభవాలు, పరిస్థితులు వారికి అనుకూలంగా లేనప్పుడు పిల్లల్లో దృఢమైనఎమోషనల్ ఇమ్యూనిటీ పెరుగుతుంది. పిల్లల్ని కౌగిలించుకోవడం అనే చిన్నప్రక్రియ నిజానికి దీర్ఘకాలిక, జీవితకాల ఫలితాలకు పెట్టుబడివంటిదని మానసిక శాస్త్రవేత్తలు చెప్తున్నారు.

పిల్లలు ఎదిగేకొద్దీ వారిని హత్తుకోవడాన్ని మామూలుగానే కొనసాగించవచ్చు.

ఒకవేళ వాళ్ళు ఇష్టపడకపోతే స్పర్శశక్తిని మాత్రం వారికి అందిస్తూనే వుండాలి. వారి స్నేహితులు, ఇతరులముందుకాకుండా వ్యక్తిగతంగా కొనసాగిస్తుంటే పిల్లలు సదరు అనుభూతులను, ఫలాలను అనుభవిస్తూనేవుంటారు.

Courtesy : PARENT CIRCLE



### సౌకర్యం, సురక్షితం

పిల్లలను దగ్గరకు తీసుకుని గట్టిగా హత్తుకోవడంవల్ల వారిని ఎంతో ప్రేమిస్తున్నామని, అది బేషరతుగా వుంటుందన్న దృఢమైన సందేశం వారికి మౌనంగా, భాష లేకుండా అందుతుంది.

మంచిప్రవర్తనవల్లనో లేదా మంచి పనులవల్లనో మాత్రమే తమకు ఇలాంటి కౌగిలింతల అవకాశం రాగలదన్న భావం వారి దరిచేరదు. పిల్లల్ని తరచూ, ఎటువంటి కారణాలు, వరాలు లేకుండా దగ్గరకు తీసుకుంటుండాలి. అప్పుడు వారికి తమను తాముగా ప్రేమించే వారున్నారన్న భరోసా,ధైర్యం, భద్రత అందుతాయి.

# వారఫలం

**మే 24 నుండి 30, 2018 వరకు**


పిడపర్తి వీరేశ్వరశాస్త్రి, పిడపర్తి భాస్కర సుబ్రహ్మణ్యశాస్త్రి

సెల్ : 9492156064




**మేషం:** అశ్విని, భరణి, కృత్తిక 1వ పా. ఒత్తిడులు, తొందరపాటుతనములు ఉంటాయి.ఆధిపత్యధోరణులకు,ఇతరులు గుర్తించుట లేదను భావములకు దూరంగా ఉండండి. అన్నిటా కుటుంబసభ్యుల ప్రమేయములకు ప్రాధాన్యతనీయండి. అవసరాలకు తగినట్లుగా ధనం సమకూరుతుంది. శుభవార్తలు వింటారు. ఎగ్రిమెంట్లు వంటివి పట్టుదలతో పూర్తిచేసుకోగలరు. గురు, శుక్ర, శని, ఆది వారములు అనువైనవి.



**వృషభం:** కృత్తిక 2, 3, 4పా, రోహిణి, మృగశిర 1, 2పా. ఈ వారంలో సర్దుబాటుధోరణితో సాగండి.భాగస్వామి సహాయములను పొందగలరు. గతంకంటే మెరుగైన ఫలితములను క్రమేపీ పొందుతారు. చిన్నచిన్న ప్రయాణాలు చేయవలసిరావచ్చును. చిన్న చూపు చూసేవారుంటారు. మీ పనులందు ఏకాగ్రత, పట్టుదలలు వహించండి. ఆంతరంగిక విషయాలలో గోప్యములు అవసరం. ఆర్థికంగా మంచి ఫలితాలు ఉంటాయి. ఈ రాశివారికి శని, ఆది, సోమ, బుధ వారములు మేలైనవి.



**మిథునం:** మృగశిర 3, 4పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3పా. పొంతన కుదరని కుటుంబ వృత్తి వ్యవహారములచే ఒత్తిడులు పొందే సూచనలున్నాయి. ఆదాయములు సామాన్యతలతో సాగగలవు. బంధుమిత్రవర్గంతో విభేదాలు పొందే సూచనలున్నాయి. ప్రయాణములకు తగు ప్లానింగ్ ఉండేటట్లు చూసుకోండి. సందర్భానుసారంగా కొన్నిచోట్ల అయిన వారిపై కఠినంగా వ్యవహరించవలసిరావచ్చును.అనారోగ్యవిషయంలో జాగ్రత్తలు అవసరం. సోమ బుధ వారాలలో ముఖ్యమైన పనులను చేపట్టుకోండి.



**కర్కాటకం:** పునర్వసు 4వ పా, పుష్యమి, ఆశ్లేష. గత ఆటంకములను తొలగించుకోగలరు. చంచలత్వములు ప్రదర్శించకుండా జాగ్రత్త వహించండి. వృత్తి-ఉద్యోగాలలో నూతన బాధ్యతలను స్వీకరించవలసిరావచ్చును.మీ నిర్ణయాలు కొన్ని భవిష్యత్‌ను దృష్టిలో పెట్టుకొని తీసుకోవలసిరావచ్చును. ఖర్చులకు తగిన ప్రయోజనాలు ఉంటాయి. ఆరోగ్యం విషయంలో మంచి మార్పులుంటాయి. ముఖ్యమైన పనులు చేపట్టుటకు గురు, శుక్ర, శని వారములు అనువైనవి.



**సింహం:** మఖ, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని 1వ పా. గ్రహబలం పెరుగుచున్నది. పెద్దవైన ప్రయోజనములను ఏర్పరచు పనులను చేపట్టుకోండి. కుజస్తంభనచే మీకు మేలు జరుగుతుంది. సహకరించేవారు, అర్థంచేసుకొనేవారు ఉన్నారు. పనులను వేగవంతం చేయగలరు. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలను ఉత్సాహంతో నిర్వహించుకోగలరు. ధనలాభం ఉంది. వీరికి శని, అది, సోమ వారములు అనువైనవి.



**కన్య:** ఉత్తరఫల్గుని 2, 3, 4పా, హస్త,చిత్త 1,2పా.వ్యవహార అనుకూలతలకై, అనుకొన్నది సాధించుటకు ప్రయత్నములను పట్టుదలలు వహించి చేపట్టుకోగలరు. పితృవర్గీయులచే ప్రయోజనములు ఉంటాయి. బంధువర్గం నుండి చేదువార్తలు వినవలసిరావచ్చును. ఖర్చులు కొన్ని భారమనిపించగలవు. అనారోగ్యభావనలు తగ్గగలవు. సంతానంచే ప్రయోజనములు పొందగలరు. స్థిరాస్తి వ్యవహారములు ఊహించనివిధంగా పూర్తవ్వగలవు. గురు, శుక్ర, సోమ, బుధ వారములు అనువైనవి.



**తుల:** చిత్త 3, 4పా, స్వాతి, విశాఖ 1, 2, 3పా.ఆటంకములను ఓపికగా ఎదుర్కోవలసిరావచ్చును. కొన్ని విషయాలలో సర్దుకుపోవడంచే మనశ్శాంతికి భంగం కలుగదు. బంధువర్గంచే సహాయములు, అభిమానములు పొందగలరు. శుభకార్యయత్నములందు నిరాశలకు గురికాకుండా సాగాలి. ఆదాయములు సామాన్యపు అవసరాలకు సరిపడునట్లుంటాయి. భవిష్యత్ కార్యాలోచనలను వాయిదావేయండి. ఈ రాశివారికి శని, ఆది, సోమ వారములు అనువైనవి.



**వృశ్చికం:** విశాఖ 4వ పా, అనూరాధ, జ్యేష్ఠ. ప్రయత్నములు ఉండేటట్లు జాగ్రత్తలు తీసుకోండి. విజయాలు వాటంతటవే వస్తాయి. మంచి వార్తలు వింటారు. అధికారులతో సత్సంబంధాలు ఏర్పడతాయి. ఖర్చులకు తగిన ప్రయోజనాలు ఉంటాయి. మీ ప్రమేయంతో బంధువర్గంలో శుభకార్యాలు సిద్ధించగలవు. గృహమునందు విలువైన వస్తువులను సంపాదించగలరు. ఈ రాశివారికి ముఖ్యమైన పనులు చేపట్టుటకు గురు, శుక్ర, సోమ, బుధ వారములు అనువైనవి.



**ధనుస్సు:** మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పా. కొన్నిట అనుకూలతలు, కొన్నిట ప్రతికూలతలతో మిశ్రమంగా సాగుతారు. తొందరపాటుతోకూడిన నిర్ణయములు ఉండకుండా జాగ్రత్తలు పాటించుకోవాలి. కుటుంబవ్యక్తుల నిర్ణయాలకు కట్టుబడవలసిరావచ్చును. స్థిరాస్తుల ఏర్పాట్లకై ప్రయత్నములు ఉంటాయి. ఆర్థికంగా కొన్ని సర్దుబాట్లు అవసరం అవ్వగలవు. దూరప్రాంతప్రయాణములు కొన్ని చేయగలరు. వీరికి గురు, శుక్ర, శని, ఆది వారములు అనువైనవి.



**మకరం:** ఉత్తరాషాఢ 2, 3, 4పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2పా. అనుకొన్నవిధంగా ప్రయత్నములను వేగవంతంగా పూర్తిచేసుకోగలుగుతారు. కుటుంబవ్యవహారములను సమిష్టిగా చేపట్టుకోండి. ఎదుటివారి వ్యాఖ్యానములు ఉద్రేకపరుస్తాయి. పెట్టుబడులందు ఒంటరిపోకడలు పనికిరావు. ఆర్థికంగా మిశ్రమకాలం. వివాహాది శుభకార్యనిశ్చయాలలో సంయమనంతో సాగండి. మీ బాధ్యతలను ఇతరులకు అప్పగించకండి. శని, ఆది, సోమ, బుధ వారములు అనువైనవి.



**కుంభం:** ధనిష్ఠ 3, 4పా, శతతార, పూర్వాభాద్ర 1, 2, 3పా. ఈ వారంలో దూకుడుతనము పనికిరాదు. కోరికలను నెరవేర్చుకోగలరు. నూతన అవకాశములు లభించగలవు. ఒక సంఘటన మనస్తాపమును కలిగించగలదు. ఆదాయాలు మీరు ఊహించుకొన్నట్లుగా ఉంటాయి.హామీలకు దూరంగా ఉండండి. ఆరోగ్యం బాగుండగలదు. కుటుంబవ్యక్తుల ఆరోగ్యంపై శ్రద్ధ వహించవలసిరావచ్చును. ఈ రాశివారు గురు, శుక్ర వారాలలో అన్నిటా మెలకువలు పాటించడం అవసరం.



**మీనం:** పూర్వాభాద్ర 4వ పా, ఉత్తరాభాద్ర, రేవతి. సాహసములు చూపతగిన సమయం. వృత్తి-ఉద్యోగములందు మీదైన ముద్రలో వ్యవహరించుకోగలరు. అధికారులనుండి మెప్పు పొందుతారు. ఋణవిముక్తి ఏర్పడగలదు. వృత్తి, ఉద్యోగాలలో శుభపరిణామములు ఉన్నాయి. గృహమునందు చిన్నతరహా విందులు నిర్వహించగలరు. బంధుమిత్రులతో ఉత్సాహములు పంచుకోగలరు. ఈ రాశివారికి శని, ఆది, వారాలలో అన్ని విషయాలలో మెలకువలు అవసరం.



వివేకి ఎన్నడూ జరిగిన నష్టాన్ని తలచుకొని దిగులుపడడు. దాన్ని ఎలా భర్తీచేయాలా అని మాత్రమే ఆలోచిస్తాడు.

# హెల్దీ హ్యాబిట్స్



అలవాట్లు చడీచప్పుడు లేకుండా, మన జీవితంలోకి ప్రవేశిస్తాయి.గోడకు కట్టిన మేకులా జీవితాంతం మన వెంటే వుంటాయి.

అదేపనిగా వాటిని చేస్తూవుండటంతో, మన శరీరంలోని కండరాలు తమ సహకారం అందిస్తూ, ఆ పనుల్ని జ్ఞాపకం పెట్టుకుంటాయి.

మంచి అలవాట్లు అలవర్చుకోవడం కష్టం. చెడ్డ అలవాట్లను అలవర్చుకోవటం మరీ కష్టం. మన జీవితం చక్కగా సాగాలి అంటే మంచి అలవాట్లను పెంచుకోవాలి. మంచి అలవాట్లను జీవితంలో భాగం చేసుకోవడంవల్ల ప్రతిసారీ చిన్నచిన్న నిర్ణయాలు తీసుకుని, నిదానంగా ముందడుగులు వేయడంకంటే పెద్ద పెద్ద పనుల్ని అవలీలగా సాధించుకోవచ్చు.

మన ఆరోగ్యానికి విశేషంగా సహకరించే, ఐదు మణిపూసల లాంటి అలవాట్లు ఇవి. వీటిని నిరంతర అభ్యాసంచేత,అలవాటుగా మార్చుకోగలిగితే,ఆరోగ్యకరమైన జీవితం మన సొంతమవుతుంది.

## తొందరగా నిద్ర లేవండి

ప్రతి మనిషీ నిద్ర నుంచి మేల్కొన్న తర్వాత రెండు గంటలపాటు పూర్తి ఉత్సాహంగా పనిచేయగలుగుతారు. అందువలన ఉదయాన్నే ఎంత తొందరగా వీలైతే అంత త్వరగా నిద్రలేవాలి.

అప్పుడు ఈ రెండు గంటలని సరిగా ప్రయోజనాత్మకంగా వినియోగించుకోగలుగుతాం.

ఉదయాన్నే లేచి పనిచేస్తే ఎక్కువ పనిని రాబట్టుకోగలుగుతాం. తొందరగా నిద్రలేవడంవల్ల నిద్ర తక్కువ కాకుండా చూసుకోవాలి. మనిషికి కనీసం రోజుకి ఏడుగంటల నిద్ర అవసరం.

## ఆరోగ్యాన్నిచ్చే ఆహారం

రోజూ కనీసం రెండులీటర్ల నీటినితాగండి.తప్పని సరిగా పండ్లుతినండి. శరీరానికి అవసరమైన నీరుఅందితే ఆరోగ్యంగావుంటాం.అవసరానికన్నా శరీ రంలో ఏమాత్రం నీరుతగ్గినా, అలసట ఏర్పడుతుంది.

ఆహారంలో, అన్ని రంగుల కూరగాయలు వుంటే మంచిదని నిపుణులు చెబుతున్నారు. ఒక స్నాక్ ఐటమ్‌కి బదులుగా పండునితినటం అలవాటుచేసుకోండి.వారంలోనే మీకు మంచిమార్పుకనిపిస్తుంది.



## ప్రకృతిలో

తాజా గాలి, శరీరానికి పని, మనం ప్రశాంతంగా, ఆత్మవిశ్వాసంతో వుండేందుకు సహాయం చేస్తాయి. నేటికాలంలో మన జీవితం ఒకే పద్ధతిలో మొద్దుగా సాగిపోతోంది. గంటలతరబడి ఒకేచోట కదలకుండా వుండిపోతున్నాం. కూర్చుని పనిచేసేవాళ్ళు ప్రతి గంటకు కాసేపు అటూ ఇటూ తిరిగివస్తే మనస్సు, శరీరం రెండూ రిలాక్స్ అయి తిరిగి పనిమీద ఏకాగ్రతను ఉంచగలుగుతాం.

ప్రతిరోజూ కనీసం ముప్పై నిమిషాలసేపు ప్రకృతి సిద్ధమైన వాతావరణంలో నడవండి లేదా పరుగెత్తండి. కండరాలు, శరీరం చక్కగా పనిచేయటం కోసం కొంత వ్యాయామాన్ని కూడా జోడించండి.



Courtesy : B+VE

## ధ్యానం

ప్రతిరోజూ కొంత సమయాన్ని ప్రాణాయామం చేయటానికి వినియోగించండి. నిదానంగా గుండెల నిండా గాలి పీల్చండి. అదే పద్ధతిలో గాలిని బయటకు వదలండి. దీనివల్ల మనంచేసే పనిమీద దృష్టిస్థిరంగా వుంటుంది. ధ్యానంచేయడంవల్ల ఆందోళన తగ్గుతుంది. పరధ్యానం వదిలిపోతుంది.

బిజీగాగడిపే ప్రతిరోజూ చేసేపనులను పూర్తి ఎరుకతోచేయండి. కొంతమంది ఇంటిపని చేస్తున్నప్పుడో, తోటపనిచేస్తున్నప్పుడో ప్రశాంతంగా వుంటారు.

తినే ఆహారంమీద సరిగా దృష్టిపెడితే, అది ధ్యానమౌతుంది. ఆహారపు అలవాట్లు సరవుతాయి.

## నాదైన సమయం

ప్రతిరోజూ మీతో మీరు ఏకాంతంగా కనీసం గడపటానికి 15 నిమిషాలు సమయం కేటాయించుకోండి. ఆ 15 నిమిషాలు కునుకుకోసం కాదు.



మిమ్మల్ని మీరు సమీక్షించుకోవటానికీ, గమనించుకోవటానికి ఆ సమయాన్ని వాడాలి.

ఏ పనీ చేయకుండా, ప్రశాంతంగా కూర్చుని వుండడంవల్ల మనకు స్పష్టత పెరుగుతుంది. మనం చేసే కార్యకలాపాలు, ఆలోచనలలోని లోటుపాట్లు తెలియవస్తాయి. మనస్సులో పేరుకున్న చెత్త బయటకు పోతుంది. ఇలా మన కోసం మనం సమయం కేటాయించుకోవడంవల్ల మనల్ని మనం మరింత మెరుగ్గా అర్థంచేసుకోగలుగుతాం.

మన ఆత్మకు మరింత దగ్గరవుతాం. ఇతరులకు, అవసరమైనంత ప్రాధాన్యతనిస్తూ వారికంటే ముందు మనకిమనం గౌరవాన్ని అందించుకుంటాం.

# పాత్రపైనే ఫోకస్

తమిళ పరిశ్రమలో సింపుల్‌గా ఉండే చిన్న పట్టణ యువతిగా కెరీర్‌ను ఆరంభించిన అంజలి తన నటనతో అనతికాలంలోనే గుర్తింపు పొందింది. ఆపైన ఆమె ప్రయాణంలో అనేక ఎత్తు పల్లాలు తప్పలేదు. ఆమె సినీ ప్రయాణంగురించి ఎన్నో కబుర్లు చెప్పింది. ఆమెతో ఇంటర్వ్యూ.

**మీ తొలి తమిళ సినిమానాటికి నటనలో ఎటువంటి శిక్షణ లేదు కదా?**

నేను 'కట్రాధు' తమిళసినిమాలో నటించినప్పుడు కెమెరా ముందు నిలబడడం అదే మొదటిసారి.

ఈ ప్రక్రియగురించిన పెద్ద పరిజ్ఞానంకూడా నాకు లేదు. అయితే అదృష్టవశాత్తూ దర్శకుడు రామ్ పక్కన వుండి ఏం చేయాలో చెప్పారు. ఏది అవసరమో స్పష్టంగా వివరించారు.

ఆయన చెప్పింది చెప్పినట్లు అనుసరించాను. సినిమా చూసినవాళ్ళు నేను చాలా పరిణతితో ప్రతిభ చూపానని ప్రశంసించారు.

నేను ప్రతిదీ సెట్‌మీదే నేర్చుకున్నాను. తర్వాతి సినిమా 'అంగడి థెరు'.

ముందటి సినిమాకంటే సీరియస్ రోల్. చాలా ఎఫర్ట్ పెట్టాల్సి వచ్చింది.

అలా ఓ సినిమా నుంచి మరో సినిమాకు ఓ పాత్రనుంచి మరో పాత్రకు అభ్యసిస్తూ ఎదిగాను.



**పెద్ద నటుల సరసన నటించేటప్పుడు ఎలా సిద్ధం అయ్యేవాళ్ళు?**

కథ విన్నప్పుడు పాత్రను క్షుణ్ణంగా అర్థంచేసుకోవడానికి ప్రయత్నించేదాన్ని.

స్పార్క్ గుర్తించి, పాత్రతో కనెక్టవడానికి శక్తి వంచన లేకుండా కృషిచేసేదాన్ని. పాత్రకు న్యాయం చేయగలనన్న ఫీలింగ్ వస్తేనే, విశ్వాసం కలిగితేనే ప్రాజెక్టులో భాగం అయ్యేదాన్ని.

కెమెరా ముందు ఉన్నప్పుడు పాత్రపైనే పూర్తిగా ఫోకస్ చెయ్యాలి. వీలయినంత న్యాయం చేయడానికి వందశాతం దృష్టి కేంద్రీకరించాలి. నేనదే చేస్తాను.

**పెద్ద నటులుగల మల్టీస్టారర్లతో కలసి నటించినప్పుడు ఇబ్బందిగా అనిపించేదా?**

నేను 'ఇరైవి' చేసినప్పుడు అలా ఫీలయ్యాను. ఈ సినిమాలో విజయ్ సేతుపతి, బాబీ సింహా, ఎస్-జె-సూర్య వంటి మంచి నటులు ఉన్నారు.

మా అందరివీ దాదాపు సమానపాత్రలే. షూట్ మొదలయ్యాక విజయ్ సేతుపతితో చాలా సన్నివేశాలున్నాయి. గొప్ప, పెద్ద నటుడితో కలసి పనిచేస్తున్నానని చాలా కాన్షస్‌గా ఫీలయ్యాను.

**ఎన్నో నాన్-గ్లామరస్ రోల్స్ చేసిన మీరు సడెన్‌గా గ్లామరస్ పాత్రలకు మారారేం?**

గ్లామరస్ పాత్రలు చెయ్యను అని నేను ఏనాడూ చెప్పలేదు. 'సెట్టయ్', 'కలకల్పు'ల నాటికి నేను తొలి గ్లామరస్ పాత్ర చేశాను.

రెండు సినిమాల్లోనూ నా పాత్రలు అందంగా కనపడాల్సివుంది. నేను గ్లామరస్ పాత్రలు మాత్రమే చేస్తాననో, చెయ్యననో అనలేదు, అనలేను.

నేను పోషించే పాత్రకు ఏది అవసరం అయితే అది చెయ్యాలి కదా.





**ఎటువంటి పాత్రలను ఇష్టపడతారు?**

పాత్రకు బలం వుండాలి. కేవలం పెద్ద హీరోలు న్నారన్న కారణంగా చెయ్యలేను. అటువంటి పాత్రల కోసం ఛేజ్ చెయ్యలేను. నిజానికి, ఈ రోజుల్లో సినిమాలు హీరో ప్రాధాన్యంతోనే ఉన్నప్పటికీ, తారలకూ తగిన ప్రాధాన్యం ఉంటున్నది.

అలా ఉన్నప్పుడు అటువంటి పాత్రలు చేయడానికి నాకేమీ అభ్యంతరాలు లేవు. నాకు కావాల్సిందల్లా నా పాత్ర ఎలా ఉంటుంది అనేది.

**మీకు, జైతో పెళ్ళి అన్న రూమర్లు వచ్చాయి కదా? దీనిపై మీ కామెంట్?**

ఈ రూమర్లకు కారణం నేను కాదు. వాటిపైన నేను కామెంట్ చెయ్యలేను. వీటిపైన ఎటువంటి క్లారిఫికేషన్లనూ ఇవ్వాలనుకోవడంలేదు.

పుకార్లకు కారణం నేను కానప్పుడు, నాకెందుకు వివరణలు ఇవ్వాల్సిన బాధ్యత ఉంటుంది? అప్పుడు నాకు సంబంధించిన ప్రతి రూమర్‌కు వివరణ ఇచ్చుకుంటూ పోవాల్సివుంటుంది. నా పని మానేసి వీటి చిక్కుముడులు విప్పుతూ కూర్చోలేను.

**సినిమాల ఎంపికలో మీ ఫోకస్ ఎలా ఉంటుంది?**

ఆసక్తికర సినిమాల్లో, ఆసక్తిదాయక పాత్రలను ఎంచుకోవడంపైనే నా దృష్టి వుంటుంది.

సినిమా చూసిన ప్రేక్షకులు నా పాత్ర బావుందని ప్రశంసించగలగాలి.

**మీరు ఎక్కువగా మిస్సవుతున్నానని అనుకునేది?**

కుటుంబంతో ఎక్కువ సమయాన్ని గడపలేకపోవడం, థియేటర్లలో గుర్తింపులేకుండా సినిమాలు చూడగలగడాన్ని.

**మీరు బాగా టీజ్ చేసిన సహనటుడు ఎవరు?**

(నవ్వేస్తూ) నాకన్నా జూనియర్లు అయిన ప్రతి సహనటుడినీ. నన్ను 'మేడమ్' అని పిలవమనేదాన్ని, లేదా ఏదో ఒక రకంగా ఏడిపించేదాన్ని.

**మీకు బాగా కోపం తెప్పించే సందర్భాలు?**

మరీ ఎక్కువ కోపం నాకు రాదు. ఒకవేళ వచ్చినా ఒకటి, రెండునిమిషాల్లో తగ్గిపోతుంటుంది.

**మీరు ఎవరికి బాగా కోపం తెప్పిస్తుంటారు?**

మా అమ్మకు. ముఖ్యంగా నేను పనిచేయనప్పుడు ఇంట్లో ఏమీచేయకుండా ఖాళీగా, బద్ధకంగా తిరుగుతున్నప్పుడు తనకు కోపం వస్తుంటుంది.

**ఈ ఫీల్డ్‌లో మిమ్మల్ని బాగా టీజ్‌చేసిన సహనటుడు ఎవరు?**

జీవ- అంటూ ముగించింది అంజలి.

**అయినపూరి సుజాత**



# మిమ్మల్ని మీరు బాగా ప్రేమించండి

భర్త,పిల్లలకోసం రోజంతా కష్టపడుతూ,వారికేం కావాలి, వారికేం చేయాలి అన్న ఆదుర్దాతో క్షణం తీరిక లేకుండా, తన అవసరాలను పక్కనపెట్టి పనిచేసే గృహిణి తనసుఖంకంటే ఎక్కువగా,కుటుంబ సభ్యులకోసం రోజుకు 18 గంటలు ఒళ్ళు హూనం చేస్తూ పనిచేసే ఉద్యోగి, తమ గురించి తాము ఎప్పటికీ ఆలోచించుకుంటారు.

ఇతరులపై ఇష్టాన్ని చూపించడంకోసం తనను తాను ప్రేమించుకోవటం మానేస్తారు? ఇలా జీవితంలో ఇతరులను నిలబెట్టడంకోసం తనను తాను మరిచే మనుష్యులు ఏదో ఒకరోజు తమ గురించి తాము ఆలోచించక తప్పదు. తమనితాము ఇష్టపడలేకపోతే ఇతరులను ఎలా నిజంగా ఇష్టపడగలరు. అందుచేత ప్రతి మనిషీ మొదటగా తనను తాను ఇష్టపడాలి. దానిని స్వీయప్రేమ, స్వానురాగం, స్వప్రీతి, సెల్ఫ్ లవ్ అని అంటారు.

సెల్ఫ్ లవ్ ఏ అనుబంధంలో అయినా మనమెంత ఆనందంగా వుంటామో నిర్ణయిస్తుంది. స్వానురాగమంటే స్వంతడబ్బాకొట్టుకోవడం కాదు. స్వార్థంతో జీవించడం కాదు. అంతా నేనే, అంతా నాదే అనే తత్వంకాదు, గర్వంకాదు, తన గొప్పతనం చాటుకోవడానికి ఇతరులను తక్కువ చేయడం కాదు.

ప్రతి మనిషీ తననితాను గమనించుకుని తనలోని మంచికి ఆనందిస్తూ, తప్పులను క్షమించుకుంటూ, పొరపాట్లకు నవ్వుకుంటూ తనతోతాను ప్రేమగా వ్యవహరించటమే సెల్ఫ్ లవ్. స్వీయ ప్రేమ అంటే ఇతరులను ప్రేమించినవిధంగానే మనల్ని మనం ప్రేమించుకోవటం. మనల్ని మనం ఎలా ప్రేమించుకోవాలి? సెల్ఫ్‌లవ్‌ను పెంపొందించుకోవటానికి నాలుగు ముఖ్యమైన విషయాలున్నాయి.

## నమ్మకం

మీరు మంచి నిర్ణయాలు తీసుకోగలరు అన్న నమ్మకం మీకు వుందా? ఇచ్చినమాటమీద నిలబడగలరన్న నమ్మకం మీకుందా? ఇతరులకు ఇచ్చిన మాట కాకుండా మీకుమీరు ఇచ్చుకున్న మాటమీద నిలబడతారా? ఇతరులకు ఇచ్చిన మాటకోసం ఎల్లప్పుడూ మీరు తగ్గివుంటున్నారా?

అయితే ఎందుకు ఆలా జరుగుతోంది? చాలా కాలంనుంచి మీకు మీరు చేసుకున్న వాగ్దానాలపై నిలబడలేకపోయుంటే ఇప్పుడు పెద్ద వాగ్దానాల జోలికి వెళ్ళకండి చిన్నమాటలతో మొదలుపెట్టండి.

## స్వానుభూతి

స్వానుభూతి అంటే మన ఆలోచనలను, భావనలను, అనుభూతులను స్వయంగా అర్థంచేసుకోవటం. మొదట మీలో కదిలే భావాలను, అనుభూతులను స్వయంగా స్వీకరించేలా అనుమతిని ఇచ్చుకోండి.

అది సంతోషం కావచ్చు, కృతజ్ఞత కావచ్చు, ఓటమి కావచ్చు, వాటిని మీరు అనుభూతి చెందండి. జీవితం రంగుల వలయం.

ఒడిదుడుకుల నిలయం. వాటితో కలిసి నడిస్తే మన అనుభవాలు అందంగా వుంటాయి, వాటికి విలువ వుంటుంది, వాటికి శక్తి ఉంటుంది.

ప్రమోషన్ వచ్చిందన్న ఆనందం, పిల్లవాడికి ఫుట్ బాల్ టీమ్‌లో చోటు దొరకనందుకు విషాదం ఒకే రోజు కలుగుతాయి.

అనుకున్నట్టుగా జీవితం సాగనందుకు విషాదం ఆదేక్షణంలో ఆరోగ్యంగా వున్నందుకు సంతోషం కలుగుతాయి. స్వానుభూతి కలిగివుండటం అంటే నేను మనిషిని అని అంగీకరించటం.

మనుష్యుల్లోవుండే సద్గుణాలు, దుర్గుణాలు అన్నీ నీలోకూడా వున్నాయని గుర్తించటం.

దీనివల్ల ఉన్నదానిని వున్నట్టే చూస్తారు.

ప్రతిక్షణం వాస్తవంలో జీవిస్తారు. అవకాశాన్నిబట్టి మెరుగుపరచటానికో ప్రయత్నిస్తారు.

## దయ

అనుకున్నది పొందలేనప్పుడు మిమ్మల్ని మీరు నిర్దాక్షిణ్యంగా హింసించుకుంటున్నారా?, తిట్టుకుంటున్నారా? క్షోభపెట్టుకుంటున్నారా? ఇతరులు మీలానే సాధించలేనప్పుడు వారితోకూడా ఇలానే

# స్వీయప్రేమవల్ల గొప్ప అనుబంధాలు

ఎప్పుడైతే మనల్ని మనం ప్రేమించుకుంటామో మనలో వున్న అనుమానం, అంతులేని బాధ వదిలి పోతాయి. మన అనుభూతులను, నిర్ణయాలను నమ్మటం మొదలుపెడతాం.

తద్వారా ధైర్యంగా వుంటాం. హృదయపూర్వకంగా జీవించటం మొదలుపెడతాం. జీవితాన్ని మరింత దయతో సున్నితంగా గడుపుతాం. జీవితమనే ఆటను ధైర్యంగా నవ్వుతూ ఆడతాం. మనం ఏర్పరుచుకున్న సొంత అవరోధాలనుంచి బయటపడి విశాల దృక్పథంతో కలలుగనటం మొదలుపెడతాం.

ప్రతికూల పరిస్థితులమీద దృష్టిపెట్టడం తగ్గించి వర్తమానంలో జరుగుతున్న విషయాల సౌందర్యాన్ని అందుకోగలిగిన అవకాశాలను, అంతరంగ, బహిరంగాలలో గుర్తించటం మొదలుపెడతాం.

మన జీవితాలు ఎంత గొప్పవో గుర్తిస్తాం. తెరిచిన హృదయకవాటాలద్వారా కృతజ్ఞత ప్రవాహంలా మన జీవితంలో నిండేట్టు చూసుకుంటాం. సంతోషాన్ని, ఆత్మవిశ్వాసాన్ని, సరదాతనాన్ని, సౌమ్యతను, శాంతిని, సానుకూల దృక్పథాన్ని మన నుండి ప్రసారం చేయటం ప్రారంభిస్తాం.

ప్రేమించటం, ఆ ప్రేమకు మొదటిఅర్హత కలిగిన వ్యక్తి మనమేనని తెలుసుకోవటం, స్వార్థంకాదు. అది అవసరం. మనం కోరుకునే అద్భుతమైన, ప్రేమనిండిన ప్రపంచాన్ని సృష్టించటానికి సెల్ఫ్‌లవ్ మొదటిమెట్టు.

స్వీయప్రేమవల్ల మనలో ప్రేమించే శక్తి మరింత పెరుగుతుందేకానీ తరిగిపోదు. ఇద్దరువ్యక్తుల మధ్య గొప్పప్రేమపుట్టాలంటే వారిద్దరిలోను ప్రేమపూర్తిగా నిండివుండాలి. తమను తాము ప్రేమించుకోవటం మొదటిమెట్టు. ఇతరులను ప్రేమించటం మలిమెట్టు. ఈ రెండుమెట్లు ఎక్కితేనే మనిషి నిండైనప్రేమికుడు అవుతాడు. అప్పుడు మాత్రమే ఇతరులతో మెండైన ప్రేమానుబంధాలను పెనవేసుకోగలుగుతాడు.

**లక్షణాలు :** మన కలలకు ప్రాధాన్యతనిచ్చుకుని, మనలో ఉత్సాహాన్ని, చిరునవ్వును నింపే పనులను చేయటం. మీ ప్రణాళికలను సరిపోనివి, మీకు అంగీకారం కానివి అయిన పనులను "నేను చెయ్యను" అని చెప్పటం. మిమ్మల్ని ప్రోత్సహించి, వెన్నుదన్నుగా నిలబడి, ఉత్సాహాన్ని నింపే వ్యక్తులతో చక్కటి సమయాన్ని గడపాలని నిర్ణయించుకోవటం.

- సొంత ఆలోచనలను, అభిప్రాయాలను, ఇతరులను సంతోషపెట్టడంకోసం వదిలిపెట్టకపోవటం. మనతో మనం సౌమ్యంగా, సున్నితంగా, దయతో సంభాషించుకోవటం.
- మీరు కోరుకునే కొత్త అనుభవాలను పొందటానికి కావల్సినంత ధైర్యాన్ని కలిగివుండటం.
- వ్యాయామం చేయటం, సరైన ఆహారాన్ని తినటం, ఏకాంతంగా సమయాన్ని గడపటం ద్వారా మనస్సు, ఆత్మ, శరీరాలను మరింతగా వికసింపచేసుకోవటం. భవిష్యత్తుకోసం పెట్టే పెట్టుబడులు ఏవైతే మీకు అద్భుతంగా అనిపిస్తాయో వాటిపైనే డబ్బు ఖర్చుపెట్టడం.
- మీరు కోరుకునే జీవితాన్ని సృష్టించుకోవడానికి కావల్సిన శక్తియుక్తులు మీకున్నాయని ధైర్యంగా నమ్మటం. మంచినిచూట్టం, ఇతరులు మిమ్మల్ని తగ్గించేందుకు అవకాశమివ్వకపోవటం.
- మిమ్మల్ని మీరు మన్నించుకోవటం, స్వీకరించటం, బహుమతిగా ఇచ్చుకోవాలి. మీలోవున్న మంచిచెడులు, అందం, వికారం, అన్నింటినీ ఉన్న వాటిని వున్నట్టుగా అంగీకరించి తప్పులను క్షమించుకోవటం. ◆




కనికరంలేకుండా వ్యవహరిస్తారా?

కష్టాన్ని దూరంచేయాలన్నకోరిక 'దయ'. మీమీద మీకు దయలేకపోవటం సరికాదు.

మిమ్మల్ని మీరు ఇష్టపడాలిఅంటే, మీకు వచ్చిన కష్టాన్ని దూరం చేసుకోవాలన్న కోరిక కలగాలి.

మీతో మీరు మాట్లాడండి. మీ ఆలోచనలుమిమ్మల్నికిందకు తోసేస్తుంటే దయతో మిమ్మల్ని మీరు తిరిగి పైకి తెచ్చుకోవాలి.

మిమ్మల్ని ఇబ్బందిపెట్టేఆలోచనలను ప్రశ్నించాలి. ఇలా ఆలోచన చేయాలి "నాకిష్టమైన మనిషి ఇదే స్థితిలో వుంటే నేనెలా ప్రవర్తిస్తాను?" బహుశా వారితోమీరు ఇలా అంటారు "నీ మీద నాకు నమ్మకం వుంది.

ప్రతివాళ్ళూ తప్పులు చేస్తారు. ఓ.కే. మళ్ళీ మొదలుపెడదాం" ఇవే మాటలను మీకు మీరు చెప్పుకుంటే మనస్సు తేలికవుతుంది. కొత్త ఉత్సాహంతో ముందుకు దూసుకువెళ్తారు.

## విలువ

మిమ్మల్ని మీరు విలువైన వ్యక్తిగా గుర్తించండి. ఒక విషయంలో మీ అభిప్రాయం ముఖ్యమైనది అయితే మీరు ఏమి చేస్తారు?

ఈ విషయం ఎంతోఅవసరం. దానిని ఎలా సాధిస్తారో? మీరు ఎంతో ముఖ్యమైనవాళ్ళు. మీగురించి మీరు ఎలా భావిస్తారు? అన్నది ఎంతో ముఖ్యమైన విషయం. స్వీయప్రేమను పెంపొందించుకోవటానికి మొద టగా మన విలువను మనం గుర్తెరగాలి.

మీ జీవితానికి, ఆనందానికి మీరు ఎంతముఖ్యమో గమనించు కోవాలి. ప్రతి విషయంలోనూ ఇతరులకు ఎక్కువ విలువ ఇస్తూ పోటీ, ఎల్లప్పుడూ వెనుకే వుండాల్సి వస్తుంది.

మీ విలువను పెంచుకోండి, చిన్నచిన్న విషయాల ద్వారా, మీ విలువను గుర్తిస్తూ సాగండి.

మీకు నచ్చిన పెర్‌ఫ్యూమ్ వాడటం, ఒక చెత్త టీ.వీ. సీరియల్ చూసి నవ్వుకోవటం, నచ్చిన స్వీటు కొనుక్కుని తినటంలాంటి పనులతో మొదలుపెట్టండి. ప్రతిరోజూ చిన్నచిన్న విషయాలతో మొదలుపెట్టి మొదటగా మిమ్మల్ని నిలబెట్టుకోండి. అలా నమ్మకాన్ని విలువను స్వానుభూతిని, దయను, మీపైమీరు ఉంచుకుంటూ సాగండి.

## ఒక అభ్యాసం

సంగీతం నేర్చుకునేమొదట్లో మీరు పాడే సరిగమలు అంత సరిగ్గా వుండకపోవచ్చు.

మీరు వాయించే పియానో కర్ణకఠోరంగా వినిపించవచ్చు. అలాగే స్వీయప్రేమను పెంపొందించుకునే మొదట్లోభయం భయంగా వుంటుంది.

అయోమయంగా అనిపిస్తుంది. కొన్నిసార్లు నావల్ల కాదేమో అనిపి స్తుంది. వీటిని అన్నింటినీ దాటుకుంటూ, అభ్యాసంచేస్తూ ముందుకు కదిలితే జీవితం మరింత బాగుంటుంది.

మరింత తేలికగా నిర్ణయాలు తీసుకోగలుగుతారు. మీ ప్రేమ మరింత గట్టిపడుతుంది. స్వీయప్రేమను అభ్యాసం చేయడం చాలా అవసరం.

నేను ప్రేమించబడుతున్నాను, నాకంటూ ఒక విలువ వుంది అన్న భావం ప్రతివ్యక్తికీ వారిలోనుంచి రావాలి. బయట వ్యక్తులద్వారా వచ్చేవాటికంటే స్వానురాగంద్వారా కలిగే అనుభూతి, ఆనందం ఎక్కువ శాశ్వతంగా వుంటాయి.

పాలపర్తి శ్రీకాంత్




"ఘర్వాలేదు. మృత్యువుకు భయపడే పిరికివాడ్నికాను. ముందు ఇక్కడనుంచి ఎలా బయటపడటం. ఈ సమయంలో కాపాలికుడు ప్రత్యక్షమైతే బాగుండును"

"కాపాలికుడా!" విస్మయంగా అడిగాడు సముద్రుడు.

"అవును కాపాలికుడే...!" అని సామ్రాట్ తిరిగి మరో సారి అన్నాడు.

"అందుకే వచ్చానుకదా సామ్రాట్!" వారిద్దరి వెనుకనుంచి విన్పించింది.

ఆ ఇద్దరు చివ్వుమని తల తిప్పారు. ఆ వెనుకగా కాపాలికుడు!

సామ్రాట్ మొహంలో వెయ్యి సూర్యుళ్ళు వెలిగినట్టయింది.

కాపాలికుడు "చంద్రగుప్తా! ముహూర్తానికి సమయం ఆసన్నమయింది"

సామ్రాట్ కళ్ళలో మెరుపు.

"చంద్రగుప్తా! తక్షణమే కచుడిని, రాజ్యవారసుడిగా ప్రకటించు.

సగౌరవముగా, లాంఛనంగా రేపు సూర్యోదయ ఘడియలకు కచుడిని పట్టాభిషిక్తుడిని చేయి" అని అన్నాడు కాపాలికుడు.

సామ్రాట్ మొహంలో ఒక్కసారిగా మెరుపు ఆరిపోయింది... "అదేమిటి కాపాలికా! నువ్వుకూడా" అన్నాడు,

"అవును సామ్రాట్! నేను కూడా అంటున్నాను. ఆనాడు భద్రకాళి ఆలయంలో రాజ్య వారసుడిని ప్రకటించే సమయము ఆసన్నం కాలేదని నీతో అన్నాను. గుర్తుందా!"

సామ్రాట్ తల తాటించాడు.

"ఇపుడు ఆసన్నమయింది. ఈ రోజు నిజమైన అర్హుడెవ్వరో నీకు ఈసరికి పూర్తిగా అర్థమయింది. ఈ ఘడియకోసమే, నీలోని సంశయాలను తొలగించి,నిశ్చితమైన నిర్ణయాన్ని తెప్పించటం కోసమే ఇంత కాలమూ ఆగమని అన్నాను. అవునా!"

సామ్రాట్ జేవురించిన మొహంతో "అయితే కచుడే నిజమైన అర్హుడనా నీ ఉద్దేశ్యం కాపాలికా!" అన్నాడు.

"కాదు చంద్రగుప్తా! నిజమయిన అర్హుడు సముద్రుడే!" సామ్రాట్ మళ్ళీ తేరుకోవడానికి మరికొన్ని క్షణాలు.

"ఏమిటి కాపాలికా...! ఏమిటీ నీ విరుద్ధ ప్రవర్తన!"అన్నాడు సామ్రాట్.

"అవును చంద్రగుప్తా! తక్షణమే కచుడ్ని రాజ్యవారసుడిగా ప్రకటించు" అన్నాడు కాపాలికుడు.

"నీ మాటలు నాకేమీ అర్థంకావటం లేదు కాపాలికా!"

"ఇది భద్రకాళి సంకల్పం. ఆ తల్లి ఆజ్ఞ. వెంటనే అమలుచేయి"

"మరి సముద్రుడు...."

"నీలోని సంశయం నాకు తెలుసు చంద్రగుప్తా! కచుడు రాజ్యాభిషిక్తుడు కావాలని దైవసంకల్పం. ఆ సంకల్పానికి ఎదురీత వద్దు.... అంతేకాదు..."

"... ... ..."

"సముద్రుడి రాబోయే వైభవ అధ్యాస్థానికి ఇది తొలిమెట్టు. ఈ కాపాలికుడి మాటలు. నిస్సంకోచంగా విశ్వసించు. ఇది భద్రకాళీ ఆశీర్వచనం"

"ఆశీర్వచనమా" సామ్రాట్ చంద్రగుప్తుడిలో విస్మయం.

"అవును సామ్రాట్! త్రికరణశుద్ధిగా విశ్వసించు. నీ సంకల్పాన్ని నేను నెరవేరుస్తా. ఇది కూడా ఆ జగన్మాత సంకల్పమే!" అన్నాడు కాపాలికుడు.

సామ్రాట్ చంద్రగుప్తుడు, కొన్ని లిప్తలు కనులు మూసుకొని అంతర్ముఖుడై తీవ్రంగా ఆలోచించాడు... ఆ తరువాత నిశ్చయానికి వచ్చినవాడిలా

## జరిగిన కథ (19)

చంద్రగుప్తునికి భైరవదర్శనము జరుగుతుంది.

జరగబోయే పరిణామాలను విశదీకరిస్తాడు కాపాలికుడు. కచగుప్తుడు, కశ్యపబ్రహ్మ ఇరువురి కుటిలత్వాన్ని చంద్రగుప్తుని ముందు ఆవిష్కరింపచేస్తాడు తన శక్తితో కాపాలికుడు.

అలెగ్జాండర్ కాలంలోని గ్రీకు శిల్పి అగస్టస్‌కు పుట్టిన సంతానం లోనిది లావినియా. గొర్రెపిల్ల కసాయిని నమ్మినట్లు సౌగంధినిని నమ్ముతుంది లావినియా.

లావినియాను చూడాలని తహతహలాడతాడు సముద్రగుప్తుడు. స్వయంగా వెళ్ళి నాగనాయకుడిని బంధించి తేవలసిందిగా కోర్తుంది సముద్రగుప్తుడ్ని లావినియా.

తన రత్నాంగుళీయకాన్ని లావినియా వ్రేలికి తొడిగి ఆమె చెప్పినట్లు నాగనాయకుడ్ని బంధించి తెస్తానని చెబుతాడు.

తనమీద హత్యాయత్నం చేయబోయిన వ్యక్తి ఎవరో లావినియా చెప్పబోతుండగా ఏదో ఉపద్రవం వచ్చింది, త్వరగా రమ్మనమని సుకన్య రావడంతో ఆమెవెంట బయలుదేరతాడు సముద్రగుప్తుడు. తీరా వెళ్ళేసరికి అతన్ని, తండ్రిని ఇద్దరినీ బందీ చేస్తాడు కచగుప్తుడు. ఇక ఆ తర్వాత జరగబోయేది చదవండి.



కనులు తెరచి "అలాగే కాపాలికా! నిన్ను విశ్వసిస్తాను. నీ వాక్కుల్ని ఆ భద్రకాళి వాక్కులుగా నమ్ముతాను. ఇపుడే కచుడ్ని రాజ్యావారసుడిగా ప్రకటిస్తాను" అన్నాడు చంద్రగుప్తుడు.

బయట గడియ కదులుతున్నట్టుగా చప్పుడయింది.

వెంటనే కాపాలికుడు "సామ్రాట్! ఎవరో వస్తున్నారు. నేను నిష్క్రమిస్తాను" అని ఆ ప్రాసాదానికి ఆవల ఉన్న మరో గదిలోకి వెళ్ళిపోయాడు.

ఈసారి తలుపులు తెరచుకున్నాయి. కశ్యపబ్రహ్మ వడివడిగా లోపలకు ప్రవేశించాడు. అతని వెనుక మళ్ళీ తలుపులు మూసుకున్నాయి.

కశ్యపబ్రహ్మ ఒక్క ఉదుటున వచ్చి సామ్రాట్ పాదాలపైన పడ్డాడు.

సామ్రాట్‌లో అణుచుకోలేని ఆశ్చర్యం "ఏమయింది కశ్యపా!"

అశ్రుతప్త నయనాలతో తల పైకి ఎత్తాడు కశ్యపుడు.

"ఏమయింది కశ్యపా!"

"ప్రభూ...!" కశ్యపబ్రహ్మ గొంతు గద్గదమయింది.

"ముందు లేచి కూర్చో కశ్యపా!"

కశ్యపుడు తమాయించుకొని లేచి కూర్చొని ఆ తర్వాత కొంతసేపు సేద తీర్చుకున్నవాడిలా ఏమీ మాట్లాడకుండా మౌనంగా ఉండిపోయాడు.

"చెప్పు, కశ్యపా! ఏమైంది"

"ప్రభువులు నన్ను క్షమించాలి" కశ్యపుడు గొంతుపెగల్చుకొని అన్నాడు. "విషయం ఇంత దూరం వస్తుందని నేను కలలో కూడా అనుకోలేదు"

"... ... ..."

"ప్రభూ! నేను ఈ దేశానికి, సామ్రాట్‌కు భృత్యుడను. మీ క్షేమాన్ని సదా కోరేవాడను. కచగుప్తుల్ని ఎంత వారించినా, నా మాట వినకుండా ఈ దారుణానికి ఒడిగట్టారు. మిమ్ములను బందీ గావించారు"

"... ... ..."

"అవును ప్రభూ! త్రికరణశుద్ధిగా అంటున్నాను. యువరాజు కచగుప్తులు రాజు కావాలని నేను కాంక్షించిన మాట వాస్తవమే. కాని ఈ తీరులో మాత్రం కాదు. కన్నతండ్రిని, తోడబుట్టిన సోదరుల్ని బందీలుగా ఉంచి సింహాసనాన్ని అధిష్ఠించమని ఏనాడూ చెప్పలేదు"

సామ్రాట్‌కు ఈసారి మహామంత్రి, పూర్తిగా అర్థమయ్యాడు.

అనేక క్షణాలు తనలో తాను ఆలోచించుకుంటూ ఉండిపోయాడు.

కశ్యపుడు ఈసారి ప్రాధేయపడుతున్నవాడిలా "ప్రభూ! నా మాటలను విశ్వసించరా...! నేను కూడా మీతో పాటే ఇక్కడే స్వచ్ఛందంగా బందీగా గడపాలని వచ్చాను"

సామ్రాట్ ఈసారి నవ్వాడు- "కశ్యపా...! నీ రాజభక్తిని, దేశభక్తిని నేనేనాడూ శంకించలేదు. ఐతే ఎంత మేధావయినా నువ్వు కచుడి తత్వాన్ని సరిగ్గా అంచనా వేయలేకపోయావు, అవునా!" అని అడిగాడు.



నాకు నోబెల్ శాంతి బహుమతి రావాలని చాలామంది ఆకాంక్షిస్తున్నారు. కాని నేను దానిని కోరుకోలేదు.

-డొనాల్డ్ ట్రంప్, అమెరికా అధ్యక్షుడు

"ముమ్మాటికీ అంతే ప్రభూ!"

"సరే! ఇప్పటికి మించిపోయిందిలేదు. నీ పాత్ర ఇంతటితో ముగిసిపోలేదు. నువ్వు చేయవలసిన అసలు పాత్ర ఇపుడే ప్రారంభమయింది. నెరవేర్చవలసిన కీలక బాధ్యతలు ముందు ఉన్నాయి" అన్నాడు.

కశ్యపుడు చాలా ఆశ్చర్యముగా వింటున్నాడు.

"భయం వద్దు కశ్యపా...! వెంటనే లేచి కర్తవ్యాన్ని చేపట్టు"

"అవశ్యం ప్రభూ! ఆజ్ఞాపించండి"

"కచుడిని రాజ్యావారసుడిగా ప్రకటిస్తున్నాను. పట్టాభిషేకానికి సమస్త ఏర్పాట్లుగావించండి"

కశ్యపుడు దిగ్భ్రమంతో చూశాడు.

"ఇపుడు అన్ని విషయాల్ని సవిస్తరంగా చెప్పేందుకు సమయం లేదు. పైగా నువ్విక్కడ ఎక్కువ సమయం ఉంటే అనేక అనుమానాలకు దారితీయవచ్చును... వెంటనే నువ్వు వెళ్ళి కచుడికి నా వర్తమానాన్ని అందచేయి"

"... ... ..."

"వెళ్ళు కశ్యపా! నా నిర్ణయంలో లోతు నీకిపుడే అవగాహనలోకి రాదు. ముందు వెళ్ళి కచుడికి ఈ వార్తను విన్నవించు" అన్నాడు.

ఇంతవరకు ప్రేక్షకుడిగా, మౌనంగా ఉండిపోయిన సముద్రగుప్తుడు ముందుకు వచ్చి... "ఔను మహామంత్రీ! ప్రభువులవారి ఆజ్ఞను పాటించండి" అన్నాడు.

కశ్యపుడు ఈసారి తల విదిల్చి "అలాగే ప్రభూ...!" అని అన్నాడు.

సామ్రాట్ వాత్సల్యంగా కశ్యపుడితో "ఇకనుండి నువ్వు నాకు ఆంతరంగికుడివి. ఆప్తుడివి కశ్యపా!" అన్నాడు.

కశ్యపుడు కళ్ళు ఆనందంతో చెమర్చాయి. "ధన్యుడ్ని ప్రభూ!"

ఆ తరువాత ఉత్తరక్షణమే కశ్యపబ్రహ్మ బయలుదేరాడు. మరొక అరఘడియలో కచుడు వచ్చాడు. తండ్రివైపు సందేహాస్పదంగా చూశాడు.

సామ్రాట్ కచుడితో "కచగుప్తా! నా తల్లిదండ్రులమీద, ఆ పరమేష్టిపైన, ఈ సూర్యచంద్రులపైన ఆన. నువ్వే ఈ దేశానికి ప్రభువు. రేపు సూర్యోదయ ఘడియలలో నీకు పట్టాభిషేకం"

"... ... ..."

సముద్రుడు "ఇది మా అందరి అభిలాష సోదరా! నాకేనాడూ రాజ్యకాంక్ష లేదు. నువ్వే అన్నివిధాలా అర్హుడివి"

కచుడికి వారి మాటల్లో నిజాయితీ, విశ్వాసం హృదయానికి తగిలింది... అప్పటికప్పుడు తండ్రి, సోదరులను, బంధవిముక్తుల్ని గావించాడు.

ఈలోగా కశ్యపుడు రాజశాసనాన్ని పట్టుకువచ్చాడు. దానిలో సామ్రాట్ తన జ్యేష్ఠ కుమారుడు కచగుప్తుడిని రాజుగా ప్రకటిస్తోన్న శాసనం.

ఆ శాసనంపై తన రాజముద్రను వేశాడు, ఆ అందరి ముందు. ఈసారి కచుడి మోహం విప్పారింది.

'తను తొందరపడలేదు కదా...!' కచుడిలో పశ్చాత్తాపం.

"ప్రభువులు నన్ను క్షమించాలి!" అతి కష్టంమీద కచుడు అన్నాడు.

సామ్రాట్ మోహంలో సంతోషం కన్పడుతోంది చూపరులకు.

"ఈ శుభసమయంలో క్షమాపణలు దేనికి కచా! ఈ పరిణామాలకు కారణం నేను. అనవసరంగా తాత్సారం చేసి, లేనిపోని అనుమానాలకు ఆస్కారమిచ్చినవాడ్ని అయ్యాను"



## కలిసివచ్చే కాలం

అందాల రాణి అని పిలిపించుకుంటున్నందుకు దానికి న్యాయం చేయాలన్నది కాజల్ కోరిక. ఇన్నేళ్ళలో కలిసివస్తున్న కాలమే తనకు అవకాశాలను అందిస్తున్నదంటోందీ చందమామ.

"దక్కిన, దక్కుతున్న అదృష్టానికి ప్రతిభను జత చేస్తున్నాను. మారే పరిస్థితులకు అనుగుణంగా నన్ను నేను మెరుగుపరుచుకునే ప్రయత్నాలు సాగిస్తుంటాను. అందంలో, నటనలో సరికొత్తగా కనిపించేందుకు నిరంతరం శ్రమిస్తుంటా.

ప్రేక్షకులు నన్ను అందాల రాణిగా అభివర్ణిస్తున్నందుకయినా ఆ పేరును సార్థకం చేసుకోవాలన్నది నా కోరిక" అంటున్నది కాజల్ అగర్వాల్.

కచుడు తలవంచుకున్నాడు.

సముద్రగుప్తుడు ఈసారి కచుడి చేయి పైకెత్తి జయ జయ ధ్వానాలు చేశాడు. "కచగుప్తుడికి జై" ఒక్కసారిగా సముద్రగుప్తుడి కంఠాన్ని అనుసరించారు ఆ చుట్టుపక్కలవారు.

జయజయ ధ్వానాలతో ఆ ప్రాసాదమంతా దద్దరిల్లిపోయింది.

కచుడు వంగి సామ్రాట్‌కు పాదాభివందనం చేశాడు.

సామ్రాట్ "వెళ్ళి నీ మాతృశ్రీ ఆశీర్వచనాలు తీసుకో కచా!"

కచగుప్తుడు బయలుదేరాడు.

అప్పుడుగానీ సముద్రగుప్తుడికి గుర్తుకురాలేదు. తన తల్లి మహారాణి కుమారదేవి సంకల్పం, "ఈ దేశానికి కాబోయే పట్టమహిషి లావినియా!"

సముద్రగుప్తుడి గుండెలో ఉన్నట్టుండి తుపాను ప్రారంభమైన అనుభూతికి లోనయ్యాడు.

సరిగ్గా అదే సమయంలో మహారాణి కుమారదేవి ముందు లావినియా కూర్చొని ఉంది. అప్పటికే రాజధాని నగరంలో సామ్రాట్ ప్రాసాదంలో జరిగిన విషయాలు మహారాణి చెవులకు చేరాయ్...! ఇక్కడ లావినియా కపోతాలపై కన్నీరు.

"మహారాణి! మీరు నా కన్నతల్లి వంటివారు. నేను ఈ దేశానికి పట్టమహిషికావాలని ఎన్నడూ కోరుకోలేదు. కానీ... కానీ..."

కుమారదేవి అన్నది "పినతల్లి మహాదేవి నాకు సవిస్తరంగా చెప్పింది లావినియా! నీ మనసు సముద్రుడిపై లగ్నమయింది. అలాగే సముద్రుడు నిన్ను కోరుకుంటున్నాడు"

"అవును మహారాణీ! కానీ యువరాజు కచగుప్తులు రాజ్యాభిషిక్తులు అవుతున్నారు"

"అందుకోసమై నువ్వు పట్టమహిషి కావాలని లోగడ నా సంకల్పంమాత్రమే. అయితే అది నా శపథం కాదు లావినియా!" అన్నదామె.

లావినియా కళ్ళు మెరిశాయ్!

"అవును లావినియా! నువ్వు ఈ దేశసింహాసనాన్ని అధిష్ఠించే మహారాణి కావాలని ఉవ్విళ్ళూరాను. కాని విధి నిర్ణయం వేరేలా ఉన్నది"

ఇలా మాట్లాడుకుంటూవుండగా కచుడు లోపలకు ప్రవేశించాడు.

కచుడి హఠాత్తు ఆగమనానికి తత్తరపాటుతో లేచి నిల్చున్న లావినియా మేలిముసుగు ఒక్కసారిగా జారిపోయింది.

ఆ ఒక్క లిప్తకాలంలో కచుడు లావినియాను పరిశీలించాడు. కచుడికి కొన్ని క్షణాలు నోటమాట రాక మాన్పడిపోయినట్టుగా అయ్యాడు.

"ఎంతటి అద్భుత సౌందర్యరాశి" అతని పెదవులు అప్రయత్నంగా పైకి ఉచ్చరించాయ్!

లావినియా కలవరపడుతూ, మేలిముసుగును మొహంమీదకు లాక్కొని అక్కడనుండి లోపలకు వడివడిగా నిష్క్రమించింది.

మహారాణి కుమారదేవి మనస్సులో కచుడు అన్న ఆ మాటలలో అపశ్రుతి వినిపించింది. మొహాన అతికష్టంమీద నవ్వు తెచ్చుకుని కొడుకును ఆహ్వానించింది.

కచుడు ఇంకా రెప్పవాల్చకుండా లావినియా వెళ్ళినవైపే చూస్తున్నాడు. "కచా!" మహారాణి పిలిచింది.

కచుడు ఈ లోకంలోకి పడ్డాడు. అన్యమనస్కంగా వెళ్ళి తల్లి పాదాలకు నమస్కరించాడు.

మహారాణి కచుడిని ఆశీర్వదించింది. కచుడిలో ఇంకా లావినియా రూపం మెదులుతోంది.

కచుడికి స్త్రీ వ్యామోహం లేదుకానీ, లావినియా సౌందర్యం అటువంటిది. బండ శిలలను కూడా ఆకర్షించగల ఆమె సౌందర్యాకర్షణకు కచుడు కూడా తలొంచక తప్పిందికాదు.

కచుడిలోని అన్యమనస్కత మహారాణి కుమారదేవికి ఇక్కడ సుస్పష్టమవుతోంది. ఆమెలో ఏదో తెలియని అలజడి, సంచలనం.

'ఈ విషయం ఎటువైపుకు పరిగణించగలదో!' "కచా...!" మరోసారి మహారాణి పిలిచింది.

ఈసరికి కచగుప్తుడు పూర్తిగా తేరుకున్నాడు. "మాతృశ్రీ! మీ ఆశీర్వచనాలను కోరుతున్నాను"

"కచా! రాజాధిరాజు సామ్రాట్ రక్తం పంచుకుపుట్టిన నీవు ఈ దేశాన్నే కాదు, ఈ యావత్ ప్రపంచాన్నీ ఆ అలెగ్జాండరులా జయించాలని నా కోరిక" అంది మహారాణి.

"మీ ఆశీర్వచన బలాన్ని విశ్వసిస్తున్నాను మాతృశ్రీ!" అన్నాడు.

"అంతేకాదు కచా...! సర్వకాల సర్వావస్థలయందు మనిషిని వెన్నంటి కాపాడేది ఒకటి ఉన్నది"

"... ... ..."

"అది ధర్మం...! ధర్మబలం! ధర్మోరక్షతి రక్షితః. నీవు ధర్మాన్ని రక్షించు. ఆ ధర్మమే నిన్ను సదా కాపాడగలదు" అన్నదామె.

కచుడు తల్లి మాటలను మననం చేసుకున్నాడు. "అవశ్యం మాతృశ్రీ!" కచుడు తల పరికించాడు.

"మీ మాటల్ని ఆచరణలో పెట్టేందుకు నా ప్రయత్నం చేస్తాను"

కుమారదేవి యువరాజు నడుమున బిగించిన ఛురికను తీసుకొన్నది. దాంతో తన బ్రొటనవేలు అంచును గీసి, పొంగిన రక్తంతో కచుడి నుదుటిని రక్తతిలకాన్ని దిద్దింది.

కచుడు మరోసారి తల్లికి నమస్కరించి ఆ తర్వాత సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

మహారాణి కచుడు వెళ్ళినవైపు ఆలోచిస్తూ శిలావిగ్రహంలా నిల్చుండిపోయింది. ఆ తర్వాత యువరాజును పట్టాభిషిక్తుడు చేసే కోలాహలం, సంరంభం మొదలయింది.

చూస్తుండగానే కచుడి పట్టాభిషేక వార్తదిశదిశలా వ్యాపించి తండోపతండాలుగా ప్రజలు రాజధాని నగరం చేరుకోవటం మొదలుపెట్టారు.

హఠాత్తుగా తీసుకున్న నిర్ణయం, ముహూర్తానికి అతి తక్కువ వ్యవధి కాలం ఉండటంతో రాజధానిలో రాజపరివారము నుంచి పురప్రముఖుల

## మెరుపు తీగ

ఈమధ్య వరుస పరాజయాల్ని చవిచూసినా కొత్త అవకాశాలను అందుకోవడంలో మెహరీన్ మెరుపులు బాగానే వున్నాయి. ఓ మూడు చిత్రాల్ని అందిపుచ్చుకున్నది.

ఇంకొన్ని కథలు వింటున్నానని అంటున్నది. 'జవాన్'లో బొద్దు తేలిందన్న మాటలు బాగా వినపడడంతో ముందుగా రూపాన్ని మార్చుకునే ప్రయత్నంలో పడిందట.

అసలే అపజయాల టాక్ వున్న తాను ఈ దశలో బొద్దు తేలితే కెరీర్‌కు ప్రమాదం అనుకుందేమో సన్నజాజి మొగ్గమాదిరి తయారయ్యే పనిలో మునిగిపోయింది.

ఫిట్‌నెస్ ట్రైనర్‌ల సమక్షంలో జిమ్‌లో కసరత్తులు చేస్తున్నది. మరోమారు మెరుపులు వెదజల్లేందుకు సిద్ధం అవుతున్నది.





బొంబాయి బాంబు దాడులను ప్రోత్సహించింది పాకిస్తాన్. అందులో సందేహం లేదు. -నవాజ్ షరీఫ్

పాకిస్తాన్ మాజీ పి.ఎమ్.

వరకూ ఊపిరి సలుపుకోనంత పని మొదలయింది.

పురంలో, దేశంలో ఎక్కడ చూసినా ఇవే కబుర్లు. అనేకమంది సామ్రాట్ హఠాత్ నిర్ణయం, ఇంత తక్కువ వ్యవధిలో రాజును చేస్తున్న వైనం ఆశ్చర్య పరచలేకపోలేదు.

సామ్రాట్, సముద్రగుప్తులు కొన్ని ఘడియలు బందీలుగా గడిపిన విషయం అత్యంత రహస్యం. విషయం బయటకు వస్తే తలలు ఎగిరిపోగలవని కచుడి హెచ్చరిక చేశాడు.

కచుడి క్రూరత్వం తెలిసిన ఆ సేనానాయకులు, దండనాయకులు, ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని నోళ్ళు మూసుకున్నారు. ఆ తరువాత కాలం అతి వేగంగా గడిచిపోయింది.

ఆ రోజు సాయంసమయంలో సామ్రాట్, యువరాజు కచగుప్తుడిని తీసుకుని భద్రకాళి ఆలయానికి బయలుదేరాడు. అక్కడ కాపాలికుడితో కచగుప్తుడి భేటీ.

సామ్రాట్ "కచగుప్తా! నువ్వు ఈ దేశానికి ప్రభువుకావాలని నామీద తీవ్ర ఒత్తిడి చేసిన వాళ్ళలో కాపాలికుడు. నువ్వు దేశానికి రాజు కావాలని, అది భద్రకాళీ సంకల్పమని నాతో చెప్పిన వాడు ఈ కాపాలికుడే!"

కచగుప్తుడు కాపాలికుడువైపు కృతజ్ఞతగా చూసి నమస్కరించి...

"కాపాలికా! మీ అమోఘ అద్భుత మహిమల గురించి విన్నాను. మీ అండదండలు నాకు ఉండితీరాలి"

"అవశ్యం యువరాజా! భద్రకాళి దాసుడను. ఈ రాజ్య క్షేమానికి సేవ చేయమని ఆ తల్లి నన్ను నియమించింది" అని చెప్పాడు.

కచుడు మరోసారి నమస్కరించి, ఆలయంలో పూజలు జరిపి ఆ తర్వాత రాజధాని నగరానికి చేరాడు. ఆ రోజు రాత్రి చాలా ఆలస్యంగా తన తల్పం మీద చేరిన కచుడికి మనసులో ఏదో అనిర్వచనీయ ఆనందం.

మరికొద్ది ఘడియలలో సూర్యోదయమవుతుంది. 'తన ప్రగాఢవాంఛ నెరవేరబోతోంది'

ఉన్నట్టువుండి కచగుప్తుడికి లావినియా రూపం గుర్తుకువచ్చింది.

'ఎంతటి సోయగం' మనసులో మరోసారి అనుకున్నాడు.

ఆ ఉత్తర క్షణమే కిదారుడు గుర్తుకొచ్చాడు. ఇంత కాలమూ తను అవివాహితుడిగా ఉండవలసిన అగత్యం తన మనసులో మెదిలింది.

'గాంధార ప్రభువు కిదారుడు కూతురు హేమమాల ఈ దేశానికి కాబోయే పట్టమహిషి అని లోగడ మాట ఇచ్చివున్నాడు'.

కచగుప్తుడి మనసు రెండుముక్కలైంది. ఒక భాగంలో హేమమాల! మరో భాగంలో లావినియా!!

**హేతువాదులు మొండిగా కాక వాస్తవాలు తెలుసుకుంటే సహజంగానే భక్తిభావంవైపు మొగ్గుతారు.**

-త్రిదండి చినజీయర్‌స్వామి
ఆధ్యాత్మిక గురు



మహారాణి కుమారదేవి ఖిన్నురాలయింది. ఆమె మనసు పరిపరి విధాల పోతోంది.

'లావినియా పట్టమహిషి కావాలని కోరుకుంది. అయితే ఆమె మనసు ఏమిటో తెల్సుకోకుండా తను అనాలోచితంగా తొందరపాటు నిర్ణయము తీసుకుంది. ఇది అనర్థహేతువు కాదు కదా' ఇదే కుమారదేవి చింత.

అలాగే లావినియా మనసులో కూడా ఒక అపశ్రుతి.

కచగుప్తుడు తన సౌందర్యాన్ని ప్రశంసించటం తన చెవులారా విన్నది.

'ఎంతటి దురదృష్టము కాకపోతే అతడిముందే తన మేలిముసుగు జారిపోవాలా! అపుడే అతడి కంటబడాలా! తన సౌందర్యం తనకు అదృష్టాన్ని తెస్తుందా? దురదృష్టాన్ని తెస్తుందా? తన కథ చివరకేమవుతుంది... సుఖాంతమా! దుఃఖాంతమా!'

ఇవీ లావినియా ఆలోచనలు... లావినియా వెంటనే కుమారదేవిని చేరింది. లావినియా మొహంలో ప్రస్ఫుటమవుతున్న ఆందోళనను మహారాణి గమనించింది. అయితే కుమారదేవి తనలోని కలవరపాటును వెనక్కు నెట్టివేసి లావినియాకు భరోసా ఇవ్వాలని ప్రయత్నించింది... కానీ ఎందుకనో కుమారదేవికి మాటలు పెగలటంలేదు.

లావినియా నోరు విప్పింది "మహారాణీ...! నాకు ఎందుకనో... మనసు మనసులో ఉండటం లేదు"

"ఎందుకు లావినియా!"

"యువరాజు కచగుప్తుల ప్రశంస" ఆ తరువాత లావినియా చెప్పలేకపోయింది... కుమారదేవికి కూడా ఇపుడు ధృవీకరణ అయింది. తాము ఇద్దరూ ఒకే తీరున ఆలోచిస్తున్నారు.

ఇద్దరిదీ ఒకటే ఆందోళన.

'ఈ అబల తనని ఆశ్రయించింది ఇపుడు ఆమెకు తను రక్షణ ఇవ్వగలదా?' కుమారదేవి మేకపోతు గాంభీర్యాన్ని తెచ్చుకుని...

"భయం లేదు లావినియా! నీకు నేనున్నాను" అన్నది. ఇలా అంటున్నప్పుడు ఆమె కంఠంలో తెలియని జీర... మనసులో కలవరం.

లావినియా కుమారదేవిని లోతుగా చూసి అక్కడనుండి నిష్క్రమించింది. ఆమెకెందుకనో ఒక్కక్షణం సముద్రగుప్తుడిని చూడాలని అనిపించింది ఆ క్షణంలో. అప్పటికప్పుడు మహాదేవి మందిరాన్ని చేరింది.

ఆ వృద్ధురాలికి తన మనసులోని ఆందోళన ఏకరువు పెట్టింది. మహాదేవి సముద్రుడికి కబురుపెట్టింది.

సముద్రగుప్తుడు కొంతసేపయ్యాక మహాదేవి మందిరాన్ని చేరుకున్నాడు. అక్కడ లావినియాను కలిశాడు.

సముద్రుడిలో తీవ్ర ఆరాటం 'తనపై హత్యాయత్నం చేసింది ఎవరు? లావినియాకు తెలుసట...! ముందు ఈ విషయమేమిటో తెలుసుకోవాలి.

అలాగే తన భవితవ్యం నిక్షిప్తమైన ఆ తాళపత్రాలు మాయమయ్యాయి. ఈనాడు అవే తనవద్ద ఉంటే తనకు ఎంతో సాయపడివుండేవి.

తనపై హత్యాయత్నం చేసిన వ్యక్తే ఈ తాళపత్రాలను కూడా దొంగిలించాడా...'

లావినియాను కలిసి ప్రశ్నల వర్షం కురిపించాలనుకున్న సముద్రగుప్తుడు లావినియా మొహంలోని కారుమబ్బులను చూసి ఆగిపోయాడు. "ఏమైంది లావినియా!" అని అడిగాడు.

**ఇంకా ఉంది**



## అల్లరిగా గడిపేస్తా

**త**న గురించి తాను ఎంతో కొంత డబ్బా కొట్టుకోవడంలో శృతీహాసన్ ఓ అడుగు ముందే ఉంటుంది. నాన్న కమల్‌హాసన్‌తో కలసి 'శభాష్ నాయుడు'లో నటిస్తున్న శృతి తనగురించిన కబుర్లను ఊదరగొట్టేస్తున్నది.

"సెట్‌లో నేను ఉన్నానంటే చాలా సందడిగా వుంటుంది. మాట్లాడుతుంటా, చదువుకుంటుంటా, రాస్తుంటా, వింటుంటా. అదీ ఇదీ అని లేకుండా అన్ని పనులూ చేస్తూ అల్లరిగా ఉంటుంటా. తోటివారితో పోల్చితే ఫ్యాషన్ విషయాల్ని పట్టించుకోను. నాకు నూటయ్యే దుస్తులనే ధరిస్తాను. అవసరం లేనప్పుడు మేకప్ జోలికి వెళ్ళను. అస్తమానం ఫోన్‌తో గడపను" అంటూ పెద్ద జాబితా విప్పింది.

# హెల్త్ బిట్స్


Courtesy :HEALTH

## కాపడం... చల్లదనం

గాయం తగలగానే చల్లదనంకోసం లేదా వేడి కోసం ప్రయత్నిస్తారు. అది ఏ గాయానికి ఎటువంటిది అవసరం, ఎందుకు చేయాలి అనేది తెలుసుకోవాలి. శరీరానికి తగిలిన దెబ్బలలో రక్తం కారక, బయటకు ఎటువంటి గాయం కనిపించనివాటికి వేడికాపడం పెడతారు.

దీనివలన కాపడం పెట్టిన ప్రదేశానికి రక్తసరఫరా జరిగి, అక్కడ తగిలిన దెబ్బ నుండి కండరాలు కోలుకునేందుకు అవసరమయిన పోషక పదార్థాలు అందించబడతాయి.

రక్తం కారుతున్నా గాయం దగ్గర ఐస్ అద్దుతారు. అలా ఐస్‌వలన ఏర్పడిన చల్లదనానికి రక్తనాళాలు కుంచించుకుని గాయమైనచోటుకు అధికంగా రక్తం చేరి, స్రావం అవటాన్ని తగ్గిస్తుంది.

రక్తం అధికంగా చేరితే అక్కడ ఎక్కువ వాపు కనిపిస్తుంది.దీనివలన గాయం మానటంలో ఆలస్యం వుంటుంది. చర్మం మరింతగా దెబ్బతినకుండా కాపాడుతుంది ఐస్‌పెట్టే ప్రక్రియ. ◆

## మొటిమలకు టీకా

టీనేజ్‌లో వచ్చేటువంటి ఇబ్బంది మొటిమలు, ముఖంమీద కురుపులు. దీనివలన ముఖం అందాన్ని, ఆకర్షణను కోల్పోతుంది. మగవారికి షేవింగ్ చేసుకోవడం కష్టమవుతుంది. ఆకర్షణ తగ్గిన ముఖాన్ని కప్పివుంచుకోలేక ఇబ్బందిపడతారు.

ఈ సమస్యలు అన్నింటికీ పరిష్కారంగా త్వరలో టీకా మందును అందిస్తామంటున్నారు.



ముఖంమీద కురుపులకు మూలమయిన బ్యాక్టీరియాలను సంహరించే శక్తి కలిగిన టీకా మందును కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంవారు తయారు చేస్తున్నారు. ఆ బ్యాక్టీరియా ముందు రోజులలో కూడా ఎటువంటి ఇబ్బంది మరెక్కడా కలిగించని విధంగా టీకా పని చేస్తుంది.

చర్మంమీద చేరిన బ్యాక్టీరియా స్రవించే ఒక ప్రొటీన్ వలన కురుపులు వస్తాయి. ఆ ప్రొటీన్ ప్రభావాన్ని ఎదుర్కొంటుంది టీకామందు. పరిశోధనల స్థాయిని దాటి బయటకు వస్తున్న ఈ టీకాకోసం యువతరం ఎంతగానో ఎదురుచూస్తోంది. ◆

## పొట్ట ప్రమాదం

మధ్యవయసులోకి రాగానే పొట్ట పెరుగుతోందంటే కోరి కష్టాలు తెచ్చుకుంటున్నట్లు.ఆ వయసులో పొట్ట ప్రారంభం అయితే రక్తనాళాల సంబంధిత వ్యాధులు మొదలుకుని, డయాబెటిస్, క్యాన్సర్‌వంటివాటివైపు అడుగులు పడుతున్నాయని అర్థం.



దాదాపు రెండు లక్షల పాతికవేలమంది మధ్య వయసు వారి బరువు, ఎత్తు, పొట్ట కొలతలు తీసుకుని, బాడీమాస్ ఇండెక్స్ (బి.ఎమ్.ఐ.) లెక్కకట్టి, వారి ఆరోగ్యాల రికార్డులను పదహారు సంవత్సరాల పాటు నమోదు చేశారు.

అలా చూసినప్పుడు ఎవరిలో అయితే పొట్ట పెరగటం జరిగిందో వారు పలురకాల అనారోగ్యాలకు గురై 40-50 ఏళ్ళ మధ్యలో గుండెపోటుతో మరణించారు. మధ్యవయసులో బరువును, పొట్టను నియంత్రించుకోవటం వయసు మళ్ళిన తర్వాత ఆరోగ్యానికి అవసరమన్నది పరిశోధకుల సందేశం. ◆

## సెకండ్ ఒపీనియన్

ఒక రోగం గుర్తించినతరువాత మీకు నమ్మకం లేకుంటే సెకండ్ ఒపీనియన్‌కి వెళ్ళండని వైద్యులే చెపుతుంటారు. ఒకవేళ వైద్యుడు చెప్పకపోయినా తప్పనిసరిగా మరో వైద్యుడికి చూపించుకుంటారు రోగులు. కాని సెకండ్ ఒపీనియన్ మరింత కన్ఫ్యూజన్ సృష్టిస్తున్నది.

సాధారణంగా మొదటి వైద్యుడు చేసిన పరీక్షలు, గుర్తించిన అనారోగ్యాన్ని రెండవ వైద్యుడు అంత సులభంగా అంగీకరించరు.

మళ్ళీ పూర్తిస్థాయి పరీక్షలు చేయిస్తాడు. ఆ ఖర్చుకు రోగులు భయపడుతున్నారు.

అమెరికాలోని మాయో క్లినిక్‌కి వచ్చిన పేషెంట్సులో, అదీ సెకండ్ ఒపీనియన్ కోసం వచ్చినవారి మీద జరిపినటువంటి పరిశోధనల్లో కేవలం పన్నెండు శాతం కేసులలోనే మొదటి డాక్టర్ సరిగా రోగాన్ని గుర్తించారని అంగీకరించారని తేలింది.

అరవైఆరు శాతం కేసుల్లో చికిత్స విషయంలో మార్పు చెయ్యటం జరిగింది. ప్రతి అయిదు కేసుల్లో ఒకటి మొదటి డాక్టర్ తప్పు అని తేలింది.

ఇటువంటి కన్ఫ్యూజన్ వల్లనే మరో ఒపీనియన్‌కి వెళ్ళాల్సివస్తోంది రోగులు. ◆

## పొగలో ముందున్నాం

ప్రపంచంలో సంభవిస్తున్న మరణాలకు కారణాలలో పొగ తాగటం రెండవ స్థానంలో వుంది.

తీవ్రమైన గుండె, రక్తనాళాల జబ్బులకు కారణం పొగతాగే అలవాటు. దానివలన ఊపిరితిత్తులు దెబ్బతింటాయి. క్యాన్సర్ వస్తుంది. అన్నీ తెలిసినా పొగ తాగే అలవాటు మానటంలేదు.

పొగ తాగేవారి సంఖ్య ఏటికేడు పెరుగుతోంది. ఈ అలవాటులో తొలి స్థానం చైనాది. రెండవ స్థానం



భారత్‌ది. ప్రపంచంలోని పొగ తాగేవారిలో 50 శాతం మంది చైనా, భారత్, ఇండోనేషియాల్లో వున్నారు.

ఇటీవలి కాలంలో పొగ తాగే ఆడవారు పెరుగుతున్నారు దేశంలో. యువతలో పెరుగుతున్న ఈ అలవాటువలన రాబోయే రోజుల్లో భారతదేశంలో అనారోగ్యాలు పెరుగుతాయన్నది ఆందోళన.

ఆరోగ్య భారతదేశ నిర్మాణం జరగాలంటే పొగ తాగే అలవాటులో వెనకపడాలి.

# కదిలే బొమ్మల కబుర్లు









1.6.2018

## ఇష్టాలు, అయిష్టాలు

'సాహో'లో, సైనానెహ్వాల్ బయోపిక్‌లో నటిస్తున్న శ్రద్ధాకపూర్ ఈ మధ్య హైదరాబాద్‌లో ఎక్కువ సమయాన్ని గడుపుతూ స్థానిక పదార్థాలను బాగా ఎంజాయ్‌చేస్తున్నది.

ఈ విషయాన్ని ఫేస్‌బుక్‌లో తెగ పోస్టింగ్స్ పెడుతున్నది.

చిన్నతనం అంతా టామ్‌బాయ్‌గా పెరిగిన శ్రద్ధాకపూర్‌కు చెప్పులను సేకరించడం, వంట చేయడం, పుస్తకాలు చదవడం హాబీలట. చేపల కూరన్నా, వేడివేడి జిలేబీలు అన్నా చెవికోసుకుంటాననంటుంది.

అన్నయ్య సిద్ధాంత్ అంటే అమిత ఇష్టం అంటుంది. నాన్నపై జోకులు వేస్తే అస్సలు నచ్చదట. ◆

## కొత్త ఆరంభం

'అహాకల్యాణం' అంటూ తెలుగు వారిముందు సందడిచేసిన వాణీ కపూర్ హిందీ 'బేఫికర్'తో కెరీర్‌లో ఎంతో ఎత్తుకు వెళ్ళిపోగలదని అంతా ఆశించారు కాని, ఆపైన ఆమెకు అవకాశాలే రాలేదు.

రెండేళ్ళనుంచి ఖాళీ. తాజాగా 'షంషేరా' సినిమా కోసం ఎంపికైంది. "మళ్ళీ కొత్త ఆరంభం. 'షంషేరా' సినిమాలో రణ్‌బీర్‌కపూర్ సరసన నటించబోతున్నందుకు ఆనందంగా ఉంది" అంటున్న వాణీకపూర్‌కు మంచిఫిజిక్, అంతకుమించిన నటన, అందాల ఆరబోత వున్నాయి. చక్కని డ్యాన్సర్ కూడా.

ఈసారైనా కాలం, కర్మం కలిసి వస్తాయేమో చూద్దాం. ◆

## వారెవ్వా! సాయేషా!

'అఖిల్' తర్వాత సాయేషా సైగల్ ఒక్క తెలుగు సినిమా కూడా చేయలేదు.

తమిళంలో మాత్రం జోరు బాగానే ఉంది. విజయ్ సేతుపతి, కార్తీ, ఆర్యల సినిమాలలో నటిస్తూ బిజీగా, ఖుషీగా ఉంది.

ఇప్పుడు తాజావార్తలు ఏమిటంటే సూర్య హీరోగా నటిస్తున్న తదుపరి ప్రాజెక్టులో ఈ అమ్మాయే హీరోయిన్ అన్న మాటలు అదే పనిగా వినపడుతున్నాయి. అదే నిజమైతే ఈ పిల్ల బంపర్‌ఆఫర్ కొట్టేసినట్లేనన్నది టాక్.

తమిళంలో కార్తీతో కలిసి నటించిన సినిమా 'చినబాబు' పేరుతో విడుదలకానున్నది.

మొత్తంమీద సాయేషాసైగల్ కెరీర్ ఓ గాడిలో పడినట్లే ఉంది. ◆

## ఎన్నో నేర్పింది

తెలుగు పరిశ్రమలోకి చొర బడిన బెంగాలీ బ్యూటీ త్రిధాచౌదరి ఇప్పుడుతెలుగువారితో 'నిన్నువదిలి నేను పోలేనులే' అంటున్నది.

"ఇదో ప్రేమ కథ. స్క్రిప్టు నాకు బాగా నచ్చింది. నాలోని ప్రతిభను బయటపెట్టేందుకు ఇది మరో అవ కాశంగా భావిస్తున్నాను. ప్రతి యువతీ కనెక్ట్ కాగల పాత్ర.

మొదట్లో ఇక్కడ నాకు భాష కొత్తగా అనిపించింది. తర్వాత అల వాటయిపోయింది. చిత్ర పరిశ్ర మలో విభిన్నపోకడలను ఏవిధంగా అందిపుచ్చుకోవాలో ఈ పరిశ్రమ నాకు నేర్పింది" అని మెరిసే కళ్ళతో చెప్పింది త్రిధాచౌదరి. ◆





## తొలిప్రేమ తోడ్పడింది

తనలో మంచినటి ఉందన్న సంగతిని రాశీఖన్నా 'తొలిప్రేమ' తర్వాత కాని నమ్మలేదట.

ఈ చిత్రం విడుదల తర్వాత మంచినటి అన్న గుర్తింపు వచ్చిందని ఫ్రాంక్‌గా చెప్పింది.

"నా గత సినిమాల్లో నా నటనపైవచ్చిన విమర్శ లన్నీ నా చెవికి సోకాయి. దేనికైనా సమయం రావాలి కదా.నటిగా నన్ను నిరూపించుకోవడానికి 'తొలిప్రేమ' తోడ్పడింది. ఎదుటివారితో పోల్చుకోవడం నాకు రాదు. నా తప్పులను ఎదుటివారిపై రుద్దడం అసలే రాదు. సమయానికి విలువ ఇస్తా.

చుట్టూఉన్నవారిని తక్కువచేసి మాట్లాడితే కోపం వచ్చేస్తుంటుంది" అంటూ పనిలోపనిగా తన కబుర్లు చెప్పింది రాశీఖన్నా. ◆





## భలే పాత్ర

తొలి సినిమాలో జోష్‌గా నటించేసి ఏకంగా ట్రాక్టర్ చక్రాలు తిప్పేసిన సాయిపల్లవి ఇప్పుడు ఆటోడ్రైవర్ పాత్రలో నటిస్తున్నది. ఇందుకోసం ప్రత్యేక శిక్షణకూడా తీసుకున్నది.

నటించిన కొద్ది సినిమాల్లోనూ సహజంగా కనిపిస్తూ అలరించిన సాయిపల్లవి ఆటోడ్రైవరుగా, మరెంత రుబాబుగా నటిస్తుందోనన్నది ఆమెగురించి అదే పనిగా వినిపిస్తున్న ప్రస్తుత టాక్.

ఏది ఏమైనా అనతికాలంలో టైటిల్ రోల్స్ పోషించే స్థాయికి ఎదిగిందంటే గ్రేటే కదా! ◆



## అదిరే అందాలు

చేతిలో సినిమాలు లేనప్పుడు ఏదో ఒక రకంగా లైమ్‌లైట్‌లో ఉండే ప్రయత్నాలను తారలందరూ దాదాపుగా చేస్తూనే వుంటారు. హాట్ బ్యూటీ అదాశర్మ కూడా అదే దారిలో వుంది.

'హార్ట్‌ఎటాక్' తర్వాత కొన్ని సినిమాల్లో నటించినా సక్సెస్ బాటపట్టనేలేదు. అవకాశాలు లేకపోయినా అందాల వెలుగులో ముందంజలోనే ఉంటున్నది. ఫోటోషూట్‌లతో అదరగొట్టేస్తున్నది.

అంతేకాదు- సోషల్‌మీడియాలోనూ మహాచురుగ్గా ఉంటున్నది. ఎర్రని ఊరించే పెదాలనుంచి చిరు నవ్వులు చిందిస్తూ చురుక్కున ఆకర్షిస్తున్నది. ◆

## దేశాన్నీ ప్రేమించాలి

కాబోయే భర్త ఎలా వుండాలని ఎవరినైనా కదిలిస్తే అమ్మాయిలు బోలెడంత జాబితా చెప్తారు.

బాలీవుడ్ 'క్వీన్' కంగనా రనౌత్ మాత్రం ఒకే ఒక ప్రధాన లక్షణాన్ని తెలిపింది.

అతడు ఖచ్చితంగా దేశభక్తుడైవుండాలట. పైగా, ఈ విషయంలో ఓ లాజిక్‌ను కూడా చెప్తున్నది. కన్న భూమిపై విశ్వాసం లేనివాడు తనతో విశ్వాసంగా ఉండగలడన్న నమ్మకం లేదంటున్నది.

"ఒకవేళ నేను ప్రేమించే వ్యక్తి దేశభక్తుడు కాదని తెలిస్తే గుడ్‌బై చెప్పేస్తా. నన్ను మాత్రమే ప్రేమిస్తే చాలదు. దేశాన్నికూడా ప్రేమించాలి" అంటున్నది కంగనా రనౌత్. చాలా ఉందే! ◆





## ప్రయోగాలు ఇష్టం

పాత్రలతో ప్రయోగాలు చేయడం అంటే అనుష్కశర్మకు అమిత ఇష్టం అట. ఈ విషయాన్ని తనే స్వయంగా చెప్పుకున్నది.

"ఆది నుంచి నా పాత్రలతో ప్రయోగాలు చేస్తూనే వున్నా.

ఈ ఏడాది నేను చేసే పాత్రలన్నీ ఇంతకుముందు చేసినవాటికి శారీరకంగా, భావోద్రేకాల పరంగా భిన్నమైనవి. నా సినిమాలన్నీ త్వరలోనే విడుదలవుతాయి" అని అంటున్న అనుష్కశర్మ తాజా ఎండార్స్‌మెంట్ ప్రమోషనల్ క్యాంపెయిన్‌లో కూతురిగా, అమ్మగా, అమ్మమ్మగా మూడుపాత్రల్లో కనపడింది.

ఇలా ఇంతకుముందు ఎన్నడూ మూడు పాత్రలు పోషించలేదని, ఎగ్జయిటింగ్‌గా వుందని హుషారుగా చెప్పింది అనుష్కశర్మ.

# చివరి రోజుల్లో...

## జాన్ గూటెన్ బర్గ్ (1400-1468)



ఇప్పుడు మన అందరి చేతుల్లో ఏదో ఒక రకం పుస్తకాలు వున్నాయంటే, విజ్ఞాన విషయాలు అతి వేగంగా చేరవేయబడుతున్నాయంటే, శాశ్వత గ్రంథాలు మన బీరువాలలో నిలిపివుంచ గలుగుతున్నామంటే దానికంతటికీ మూల పురుషుడు గూటెన్ బర్గ్. ఒక రకంగా నేడు మనం చూస్తున్న ప్రింటింగ్ టెక్నాలజీకి ఆద్యుడు ఆయన.

కొందరి శ్రమ వారికిమాత్రం ఉపయోగ పడదు. లోకానికి మాత్రం బ్రహ్మాండంగా ఉపయోగపడుతుంది. ప్రపంచగతిని మార్చే కొత్త విషయం కనుక్కుంటారు. కాని దానివలన వచ్చే లాభాలుమాత్రం వారు పొందలేరు.

పైగా అంత గొప్ప విషయం కనుక్కున్నారన్న గుర్తింపు సరిగా దక్కదు వారికి. మరణించే సమయానికి ఎన్నో రకాల ఇబ్బందుల్లో, అనామకుడిలా వెళ్ళిపోతారు. ఆ తర్వాత ఎప్పుడో లోకం వారి గురించి చాలా గొప్పగా చెప్పుకుంటుంది. కాని అది వినటానికి వారుండకపోవటం ఒక దురదృష్టం.

అటువంటి దురదృష్టవంతుడు అచ్చు యంత్రం కనుక్కున్న జాన్ గూటెన్ బర్గ్. ఇప్పుడు మన అందరి చేతుల్లో ఏదో ఒక రకం పుస్తకాలు వున్నాయంటే, విజ్ఞాన విషయాలు అతి వేగంగా చేరవేయబడుతున్నాయంటే, శాశ్వత గ్రంథాలు మన బీరువాలలో నిలిపి ఉంచగలుగుతున్నామంటే దానికంతటికీ మూల పురుషుడు జాన్ గూటెన్ బర్గ్.

ఒక రకంగా నేడు మనం చూస్తున్న ప్రింటింగ్ టెక్నాలజీకి ఆద్యుడు ఆయన. గూటెన్ బర్గ్ జర్మన్ దేశస్తుడు. భవిష్యత్తులో చరిత్ర సృష్టిస్తున్నాడని తెలియదు కదా! అందుకే అతని పుట్టిన సంవత్సరాన్ని సక్రమంగా నమోదు చెయ్యలేదు.

ఆ తరువాత ఎవరెవరో చెప్పిన విషయాలమీద ఆధారపడి దానిని 1400 సంవత్సరంగా భావిస్తున్నారు. అసలు వారి కుటుంబం గురించి తెలిసిన విషయాలు పరిమితం.

లోహాలను కరిగించి, అవసరమైన రూపంలోకి మార్చటం, సన్నని తీగలవంటివి తయారుచేయగలిగిన నేర్పునుబట్టి వారి కుటుంబం నుండి గూటెన్ బర్గ్‌కి వచ్చిన విద్యగా భావిస్తున్నారు చరిత్రకారులు.

అతని యవ్వనం ఎలా గడిచిందో తెలియదు. విశ్వ విద్యాలయంలో చదువుకున్నట్టు స్పష్టమైన రికార్డు లేదు. 1434లో లభించిన ఒక ఉత్తరంలో గూటెన్ బర్గ్ స్ట్రాస్ బెర్గ్‌లో నివసించాడని తెలుస్తుంది. ఆ తర్వాత సంపన్నులకు విలువైన రాళ్ళగురించి సలహాలు ఇచ్చే వృత్తిలో ఉన్నాడని, కంసాలిగా పని చేసేవాడని తెలుస్తుంది. ఒక అమ్మాయిని పెళ్ళి చేసుకుంటానని వాగ్దానం చేసి వదిలేసిన కేసులో నిందితుడుగా గూటెన్ బర్గ్ పేరు నమోదయివుంది.

గూటెన్‌బర్గ్ జీవితం సజావుగా సాగలేదు. అతని మనసులో అచ్చు యంత్రం లీలగా ఉంది. అయితే దానికి ఒక రూపమిచ్చిన తీరు చిత్రమైనది. మెరిసే లోహ అద్దాల తయారీ వ్యాపారం మొదలుపెట్టటానికి అప్పుచేసి, అనుకున్నది సాధించలేక, అప్పిచ్చినవారి ఒత్తిడి తట్టుకోలేక 'నా దగ్గర ఒక రహస్యం' ఉందంటూ వారికి చెప్పాడు. ఆ రహస్యమే అచ్చు యంత్రం.

1450 నాటికి అచ్చు యంత్రానికి ఒక రూపం ఇచ్చి, తొలిసారిగా ఒక జర్మన్ గీతాన్ని అచ్చు వేశాడు. కదిలే అచ్చు యంత్రం, తక్కువ సమయంలో ఎక్కువ ముద్రణలు అందించే యంత్రం అనే సరికి చాలామందికి ఆసక్తి కలిగింది.

జొహాన్ ఫుస్ట్ అనే వడ్డీ వ్యాపారి నుండి అప్పు తీసుకున్నాడు. ఫుస్ట్ అల్లుడు కూడా ఆ అచ్చు యంత్రం ప్రాజెక్ట్‌లో చేరాడు. తొలిసారి అక్షరాల రూపకల్పనలో అతని పాత్ర ఉంది.

**గూటెన్‌బర్గ్‌కి తన సొంత ప్రాజెక్ట్ నడిపేందుకు అవసరమైన సరంజామా లేదు. డబ్బు లేదు, స్థలం లేదు. బంధువు ఖాళీ స్థలంలో షెడ్డు వేశాడు. అప్పు తీసుకుని అచ్చు యంత్రం పని మొదలుపెట్టాడు.**

అయితే ఏం అచ్చువేయాలి! తాను అచ్చువేసినది ఎవరు కొని చదువుతారు. తాను పెట్టిన పెట్టుబడి తిరిగివచ్చేది ఎలా!

ఈ ప్రశ్నలకు ఒకరోజు గూటెన్ బర్గ్‌కి తట్టిన ఆలోచన అందరినీ ఆకట్టుకునే బైబిల్ ముద్రణ. బైబిల్‌ని ఎలా ముద్రించాలా అనేదానికి ఆలోచనచేసి రెండు కాలమ్స్‌లో కాలమ్‌కి 42 లైన్లు ఉండే 180 బైబిల్ ప్రతులు ముద్రించేందుకు మూడేళ్ళు పట్టింది. చర్చికి సంబంధించిన పత్రాలను ముద్రించాడు.

1455లో తొలి బైబిల్ కాపీ బయటకు వచ్చింది. మరుసటి సంవత్సరమే అప్పు ఇచ్చిన ఫుస్ట్‌తో విభేదాలు వచ్చాయి. తాను సమకూర్చిన నిధులు జాన్ గూటెన్ బర్గ్ దుర్వినియోగం చేశాడని, బైబిల్ ముద్రణ ఖర్చులను ఎక్కువ చేసి చూపించాడని జొహాన్ ఫుస్ట్ ఆరోపించాడు. తాను ఇచ్చిన డబ్బును వడ్డీతో కట్టమని ఒత్తిడి చేశాడు.

గూటెన్ బర్గ్‌కి కొత్త విషయాల పరిశోధనే తప్పించి వ్యాపారం తెలియదు. అప్పు తీర్చలేదని ఫుస్ట్ కోర్టుకు ఎక్కాడు. గూటెన్ బర్గ్ పెట్టిన ప్రింటింగ్ ప్రెస్‌ని, అందులో అచ్చు అయిన బైబిల్ కాపీలలో సగం జప్తుకు కోర్టు ఉత్తర్వులిచ్చింది.

గూటెన్ బర్గ్ బికారి అయ్యాడు. ప్రభువు గ్రంథాన్ని అందరికీ అందిద్దామనుకుంటే నా పరిస్థితి ఇలా దివాలా తీసిందేమిటని బాధపడ్డాడు. అయినా తనకు ప్రియమైన ప్రింటింగ్ ప్రెస్‌నిమాత్రం వదిలిపెట్టలేదు. బాంబెర్గ్ పట్టణంలో తిరిగి అచ్చు యంత్రపు పని మొదలుపెట్టాడు.

అయితే ఆ రోజుల్లో పుస్తకంమీద దానిని ఎవరు అచ్చు వేశారో ముద్రించే అలవాటు లేదు. ఈలోగా కోర్టు ఉత్తర్వుల్తో గూటెన్ బర్గ్ తొలి అచ్చుయంత్రాన్ని సొంతం చేసుకున్న ఫుస్ట్ పుస్తకాల షాపు తెరవటమే కాదు, ఆ పుస్తకాలమీద తన పేరును, ప్రింట్ చేసిన సంవత్సరాన్ని ముద్రించటం మొదలుపెట్టాడు.

ఆ విధంగా 1457లో గూటెన్ బర్గ్ పేరు ప్రస్తావించకుండా ఆ పుస్తకాలను తాను ఎంత కష్టపడి తన ప్రింటింగ్ ప్రెస్‌లో ముద్రించినదీ ఫుస్ట్ పుస్తకాల మొదటి పేజీలో వేశాడు. దీనితో గూటెన్‌బర్గ్‌కి దక్కాల్సిన ఆ ఖ్యాతి దక్కకుండాపోయింది.

ఆ తర్వాత గూటెన్ బర్గ్ తన 62వ ఏట జర్మన్‌లో తాను నివాసముండే మియాంజ్ డయోసిస్‌లోని చర్చి పెద్దలమధ్య తలెత్తిన వివాదంలో ఈయన పేరు ఇరికించారు. ఫలితంగా గూటెన్ బర్గ్ ఆ ప్రాంతంనుండి బహిష్కరణకు గురయ్యాడు.

ఎల్ట్ విల్లే అనే మరో చిన్న పట్టణానికి చేరాడు. ఈలోగా మరెవరో ఆ ప్రాంతంలో ఒక అచ్చుయంత్రం నడుపుతుంటే వారికి సహాయకుడిగా ఉండిపోయాడు. 1465లో ఆయన మరణానికి మూడేళ్ళముందు గూటెన్ బర్గ్ శ్రమను గుర్తించి నెలవారీ వేతనం, తిండి గింజలు, ద్రాక్ష సారా బహుమతిగా, 'హోఫ్‌మన్' అనే బిరుదిచ్చారు. ఆ కొంచెం గుర్తింపుకే తృప్తిపడి 1468లో మరణించాడు. ఆయన సమాధి చేసిన ప్రదేశం, పక్కనే వున్న చర్చిని ఆ తర్వాతికాలంలో ధ్వంసంచేశారు.

శాశ్వత ముద్రణ అందించిన గూటెన్ బర్గ్‌కి పుస్తకంమీదే కాదు, సమాధిపరంగా కూడా గుర్తింపు లేకుండాపోయింది.

# ఈ శీర్షిక మీదే

## ఉత్తమ ప్రశ్న-సమాధానం

→ ఎస్.ఎస్.చంద్రబోస్, విశాఖపట్నం

'దేశం'కోసం ఏమైనా చెయ్యాలనుకునేవాడు మొదట ఏం చేయాలి?

'ట్యాక్స్' కట్టాలి.

→ ఎమ్.కృష్ణ, కాకినాడ

అయస్కాంతం ఎలా ఆకర్షిస్తుంది?

కాంతంలా.

→ ఎమ్.కమల, విశాఖపట్నం

'షార్ట్స్' అంటే?

తొడుక్కోవడానికి పైకి లాగు, విప్పడానికి కిందకి లాగు, మొత్తానికి అది లాగే.

→ జి.వి.మురళీమోహన్, ముచ్చుమిల్లి

పెళ్ళి చేసుకున్నాక మగవాళ్ళకి స్నేహితులు దూరం అవుతారు ఎందుకని?

ఫ్రెండ్ కష్టాలు చూసే గుండెధైర్యం లేక.

→ డి.వి.చంద్రశేఖర్, కర్నూలు

చాదస్తురాలు?

భర్త శవాసనం వేస్తానంటే ఇంట్లో వద్దు 'వరండా'లో వెయ్యమనేది.

**ఉత్తమ ప్రశ్నకు ₹ 500**
**ప్రతి ప్రశ్నకు ₹ 300 బహుమతి**

→ డి.వి.చంద్రశేఖర్, కర్నూలు

బ్యాంక్ మేనేజర్ అయోమయంలో పడేది ఎప్పుడు?

'లోను తీసుకుని ఏం చేయాలనుకుంటున్నావ్' అని గుడి పూజారి అడిగితే, 'చిన్న గుడి కట్టుకుని స్వయంఉపాధి చేసుకుంటాన'ని చెప్పినప్పుడు.

→ వై.ముత్యాలరావు, రాయకుదురు

టీ.వీ. ఎక్కువగా చూస్తే?

కళ్ళు అలసిపోయి- ఒళ్ళు బలిసిపోతుంది.

→ కె.వి.లక్ష్మణరావు, మానేపల్లి

పిల్లల దృష్టిలో తెలుగు?

తెలుగుకు 'పలక' లేదు!, తెలుగును 'పలక లేరు!'

## ఈ కార్టూన్ మీదే




"నేను కావాలంటే తెచ్చిచూపిస్తా... కాని ఇచ్చేయను..." అని చెప్పింది.

"అదేమిటి!"

"మరి మా ఇంట్లో ఉన్న వస్తువు మా ఆయనే కదా!" అని చెప్పింది.

"ఏమండోయ్ భూకంపం వస్తుంది. ఇళ్ళు కూలతాయి అంటున్నారండీ"

"ఐతేనేం. మనకెందుకు భయం. మనది అద్దె ఇల్లే కదా!" తడుముకోకుండా అన్నాడు కనకారావు.

"నిజమే కాని ఇంట్లో ఉన్నది మనమేకదా"

తుర్రున బయటకు పరిగెట్టాడు కనకారావు.

జాన్, సూసన్ ప్రేమించుకుని, పెళ్ళిచేసుకోబోతూ వెడ్డింగ్ కార్డ్స్ పంచుతున్నారు. ఎవరెవరికి ఇవ్వాలన్న లిస్ట్‌లో మేరీ పేరు గ్యారెంటీగా ఉండాలంది సూసన్. ఎందుకని జాన్ అడిగితే,

"నన్ను పెళ్ళిచేసుకునేంత వెర్రివెధవ ఈలోకంలో వుండడని ఎద్దేవా చేసేది. అందుకు..."

"ఏంటండీ ఎన్నడూ లేనిది నాకు పొద్దున్నే పాలు అందిస్తున్నారు..." ఆశ్చర్యంగా అడిగింది శాంతం.

"మరివ్వాళ నాగులచవితి కదా..."

"నాగులచవితి అయితే!"

"మరి ఆ రోజు పాముకు పాలుపొయ్యాలికదా"

"నిన్ను పనిలో పెట్టుకుంటున్నా... నువ్వు ఎవరో తెలియకపోయినా ఇంట్లో స్థానమిస్తున్నా... నాలుగు రోజులు పనిచేసిపోతానంటే ఒప్పుకోను" అన్నాడు సుబ్బయ్య.

"అయ్యగారూ... మీ ఇంట్లో ఏవేవి ఎక్కడున్నాయో తెలుసుకునేందుకు నాలుగైదు నెలలు పడుతుంది కదండి... అప్పటిదాకా నేనెక్కడికి పోతా!"

## ఔ హ్యాస్యం

దయ్యాల లోకంలో "అంతా గందరగోళంగా ఉంది. ఏమైంద"ని అడిగాడు దయ్యాల పెద్ద.

"వీడు బతికుండగా దయ్యాలు లేవని వాదించాడు. ఇప్పుడు చచ్చి దయ్యమై వచ్చి మనుషులు లేరంటున్నాడు" అన్నది మరో దయ్యం.

"ఏంట్రా, నీ చెప్పులు కిర్రుకిర్రుమంటున్నాయి. నీవికావా... ఎక్కడైనా కొట్టేసుకొచ్చావా!"

"అలాగయితే నా ప్యాంట్, అండర్‌వేర్ కూడా కిర్‌కిర్‌మనాలి కదా!"

"మావారికి అసలు రోషమంటూ లేకుండా పోయిందండీ... దేనికీ కోపం రావటంలేదు"

అలాగా... "నేను బిల్లు ఇచ్చినపుడు ఆ కోపం అదే వస్తుందిలే" అన్నాడు సైకియాట్రిస్ట్ హరీష్.

"ఏమిటండీ మీవాడు అలా ఏడుస్తున్నాడు" అని అడిగింది పంకజం.

"వాడు గుర్రంమీద ఎక్కుతానంటున్నాడు"

"దానికంత గొడవ ఎందుకు... నామీద ఎక్కమనండి" అన్నది.

"వాడు ఎక్కుతానంటున్నది గుర్రం... ఏనుగు కాదు" అని చెప్పాడు.

ఇంట్లో ఉన్న పనికిరాని వస్తువును క్లబ్‌కి ఇవ్వమంది మహిళా క్లబ్ అధ్యక్షురాలు.

నిరంతరం శ్రమించే వ్యక్తిని చూసి ఓటమి భయపడుతుంది.